## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100061523

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: In

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఓజసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# మామాట

మనిషి ఏమి సాధించాలన్నా దానికి సంకల్పం అవసరం. సాధించాలన్న బలమైన సంకల్పం కలగటం సామాన్యంగా సగటు మనుషుల విషయంలో జరగకపోవచ్చు. వారి విషయంలో జీవితాన్ని ఎలాగో ఓలా వెళ్ళబుచ్చటమేది దుగుతూ ఉంటుంది. బ్రతుకు భారం మోయడమనేది వారి జీవన విధానం. ఇలాంటి జీవితానికి చీకటి వెలుగుల తేడాతో పనిలేదు. అలాకాదు.....ఎవరికైనా జీవితం భారం కాకూడదు అజ్ఞా నాంధకారంలో ఎవరూ జీవించకూడదు. జీవిత మనేది ఒక లక్ష్యసాధనగా ఉండాలి అని ఆశించడం మానవత్వం. మరి సామాన్యులలో ఇటువంటి మార్పు ఎలావస్తుంది? మన దేశ జనాభాలో ఎక్కువమంది ఇలాంటివారే. మనం ఆశించే జీవిత విధానానికి మూలం వివేకం. అంటే జ్ఞానం మరి జ్ఞానం ఎలా కలుగుతుంది.? ఒకరు చెప్పితే వచ్చేది జ్ఞానం కాదు. స్వంతంగా సంపాదించుకున్న జ్ఞానమే నిలకడగల జ్ఞానం, ఉపయోగపడే జ్ఞానం. మరి జ్ఞానాన్ని స్వంతంగా సముపార్జించేందుకు ఒక సాధనం కావాలి. ఆ సాధనమే అక్షర జ్ఞానం. అంటే చదువు మరి సామాన్య మానవుని జీవిత విధానం చదువుపట్ల సంకల్పాన్ని కలుగజేయదు. దానికి ఎంతో ప్రేరణ కావాలి.ప్రణాళికలు ఎన్ని అమలు అవుతున్నా ఇలాంటి ప్రభుత్వ ప్రేరణ లోపంవల్ల ప్రజలలో వాటికి స్పందనలేదు. అందువల్ల ప్రణాళికా ఫలితాలు దక్కటంలేదు. మరి ఇలాంటి ప్రేరణ, స్పందన ఎవరు కల్గిస్తారు? ఈ విషయంలో సృజనాత్మక రచయితలదే అగ్రతాంబూలం కదా! వీరే ప్రజలలో కొత్త ఆలోచనల్నీ కొత్త ఆశల్నీ కొత్త ఉత్సాహాన్నీ, కొత్త శక్తియుక్తుల్నీ రేకెత్తించగలరు. అందుకే వారిని సృజనాత్మక రచయితలని అంటారు. ఏ విప్లవానికైనా వీరే మూలాధారమని చరిత్ర కూడా చెప్పుతోంది. మనదేశంలో ఎంతోమంది రచయితలు ఎన్నో విషయాలపై ఎన్నో ప్రక్రియల్లో తమ రచనలు చేస్తున్నారు. ఏదేశంలోనైనా సాధారణ పరిస్థితులు నెలకొన్నప్పుడు రచయితలు తమతమ వ్యక్తిగతమైన ఆసక్తి ననుసరించి రచనలు సాగిస్తూ ఉంటారు. కాని, ఏదేశంలోనైనా సామాజికంగా అసాధారణమైన పరిస్థితులు

నెంకొన్నప్పుడు, సాధారణంగా అందరి రచయితల దృష్టి ఏదో ఒకవైపు మొగ్గటం జరుగుతుంది. ఆ విషయంపైనే వారు వారి రచనల్నితమ తమ శైలిలో, ప్రక్రియల్లో సాగిస్తారు. అయితే సమాజంలో సాధారణ పరిస్థితి ఉందా, అసాధారణ పరిస్థితి ఉందా అని తెలియటం ఎలా? ఒక రకమైన అసాధారణ పరిస్థితి బహిర్గతంగా ఉంటుంది. అది అందరికీ తెలుస్తుంది. అది నిశితంగా పరిశీలిస్తేగాని కనబడదు. యుద్ధ కలహాలు, కరువులు, ఉప్పెనల వంటివి బహిర్గతంగా కనిపించే అసాధారణ పరిస్థితులు విస్తృతమై నిరక్షరాస్యత వంటివి అంతర్గతంగా ఉన్నఅసాధారణ పరిస్థితులు. ఇవికూడా సమాజానికి చాలా ప్రమాదకరమైన పరిస్థితులు. రచయితలు ఇటువంటి అంతర్గతంగా ఉన్న అసాధారణ పరిస్థితులను తమ రచనల్లో చిత్రించి సమాజాన్ని ప్రభావితం చేయవలసిన అవసరం ఎంతైనా ఉంది. ముఖ్యంగా కథా ప్రక్రియకు ప్రజల్లో ఆదరణ ఎక్కువగా ఉంటుంది. కథ అంటే అందరికీ ఇష్టమే.

అందరకీ విద్య రాష్ట్ర ప్రచార ఏవేదిక పై విషయాలనుగమనించి చదువు ఇతివృత్తంగా చేసుకొని రాసిన కథలను కేతు విశ్వనాథరెడ్డి, పి.సత్యనారాయణ సంపాదకత్వంలో సేకరించి ఒక సంకలనంగా ప్రచురించి మీ ముందుంచింది. ఈ సంపుటిలోని కథలు గత 84 ఏళ్ళకాలంలో వెలువడినవి. ఈ సంపుటి ముఖ్య ఉద్దేశ్యం రచయితలకు, ముఖ్యంగా యువ రచయితలను చదువుకథలు రాయడానికి ప్రోత్సాహమివ్వాలని. వారు చదువు ఇతివృత్తంగా ఇంతకంటే మంచి కథలను ఇప్పటి పరిస్థితులకు అనుగుణంగా రాసి ప్రజల్లో చదువు పట్ల ఆసక్తినీ, సంకల్పాన్నీ కలిగింపజేయాలని ఆశిస్తున్నాం. అందరికీ చదువు అనే విప్లవ ఉద్యమంలో పాల్గొంటున్న కార్యకర్తలను కూడా ఈ కథలు ప్రభావితం చేస్తాయని ఆశిస్తున్నాం.

ఉస్మానియా విశ్వవిద్యాలయం<br>
హైదరాబాదు<br>
08 ఆగస్టు 1994

వి.ఈశ్వరరెడ్డి,<br>
అధ్యక్షులు, అందరికీ విద్య రాష్ట్ర ప్రచార వేదిక<br>
పి.సందీప్,<br>
కార్యదర్శి, అందరికీ విద్య రాష్ట్ర ప్రచారవేదిక

# చదువు కథలు

## ఎందుకు చదవటం?
## ఎందుకు రాయటం?

*చదువు అంటే ఏమిటి?*
*చదువు వల్ల ఎవరికైనా ఒరిగేదేమిటి?*
*ఆడా మగా తేడా లేకుండా అందరూ చదవటమేనా?*
*కూలీ, రైతూ, సహస్రవృత్తులవాళ్లూ పేద, ధనిక తారతమ్యం లేకుండా*
*అందరూ చదవాల్సిందేనా?*
*చదువుకోవాలనే తపన ఎవరికైనా ఎందుకుంటుంది?*
*చదువు ఒక జాతీయ సమస్యగా, ఒక అంతర్జాతీయ ఉద్యమంగా ఎందుకైంది?*

చివరి ప్రశ్న రాజ్యాల్నీ, ప్రభుత్వాన్నీ, సంస్థల్నీ, విద్యా ప్రణాళికావేత్తల్నీ, బుద్ధి జీవుల్నీ కలవరపరిచేది కావచ్చు. మిగతా ప్రశ్నలన్నీ ప్రతివాళ్లనూ ఎప్పుడో ఒకప్పుడు ఆందోళనకు గురిచేసేవే, ఆలోచింపచేసేవే. ప్రతివాళ్లనూ బాధించే సమస్యల్ని గురించి రచయితలు బాధపడతారు. సమస్యలకు జీవితంలో మూలాలు వెతుకుతారు. కథలద్వారా మనల్ని కదిలిస్తారు, కదిలింప చేస్తారు.

ఈ సంకలనంలోని ఇరవై కథల్లోని ప్రదాన సమస్య చదువు. చదువుకోసం పసిపిల్లల ఆర్తి, పెద్దవాళ్ల ఆరాటం, చదువుకు గుదిబండగా తయారైన పేదరికం, పెళ్లిళ్లు, ఆడపిల్లలకు చదువెందుకనే మూర్ఖసంప్రదాయం, చదువును కుంటుపరుస్తున్న కొందరు అయ్యవార్లు, డ్రెస్సుల భాగోతం, చదువు వచ్చిన స్త్రీపురుషులు చేయగలిగిన మంచిపనులు – ఇవ్వన్నీ ఈ కథల్లోని ప్రదాన సమస్యలోని వివిధపార్శ్వాలుగా కన్పిస్తాయి.

చదువు సమస్యలో మూడు ప్రధానమైన పార్శ్వాలను ఈ సంకలనంలోని రచయితలు గుర్తించారు.

మొదటి పార్శ్వం తిండి ఉన్నోళ్లకే చదువు' అనే దారుణ పరిస్థితి, అడవుల్లో పశువులను కాస్తూ వచ్చిన అక్షరాల్ని ప్రతి బండమీద రాసుకునే దుస్థితి, పెద్దవాడుగా పుట్టడం వల్ల పనీపాటలతో బాల్యం హరించుకుపోయే స్థితి, తండ్రి బిడ్డకు పాఠ్యపుస్తకాలు కూడా కొనలేని నికృష్టసన్నివేశం మనకు ఎదురవుతాయి. అయితే వెట్టిచాకిరీని ప్రభుత్వం రద్దు చేసినప్పుడు దొర సంకెళ్లు తెంచుకొని చదువుకోసం పట్నం వెళ్లేప్రయత్నం చేసిన పదేళ్ల బాలుడూ, కొడుకును చదివించుకోటానికి సర్వాత్మనా పూనుకొన్న తల్లీ మొదటి పార్శ్వంలో సహజంగావెలిగే దీపాలుగా, వెలిగించిన దీపాలుగా మనకు కన్పిస్తారు. మనవడితో దొంగతనం నేరం చేయించి 'బోస్టన్ స్కూల్‌కు పంపించి మనవడి సమస్యకు పరిష్కారం చూపిన గురప్పతాత వంటివారు మనల్ని నిలదీస్తారు.

రెండవ పార్శ్వం మన సమాజంలో స్త్రీల ప్రతిపత్తికీ, స్త్రీల చదువులకూ, సంబంధించింది. నదీజలాలను సరిగా ఉపయోగించుకోలేక ఉప్పుసముద్రం పాలుచేసినట్లుగా పెళ్లిపేరుతో ఆడపిల్లల చదువుల్ని మధ్యలో తుంచేసే స్థితి, ఆడపిల్లలు చదవటం,

ముందు ఇష్టపడక తర్వాత పశ్చాత్తాపపడిన నీలకంఠంలాంటి తండ్రులూ కనిపిస్తారు. వీళ్లతోపాటు రిక్షాతొక్కైనా ఆడపిల్లల్ని చదివించి తీరాలనే వ్యక్తులు, పట్టుపట్టి ట్యూషన్ ఏర్పాటుచేసి బిడ్డను చదివించే చదువు మర్మం తెలిసిన తల్లులూ కన్పిస్తారు. భర్త తప్పుడు నడవడిని చక్కదిద్దగలిగిన ఆధునిక మహిళలూ కన్పిస్తారు.

మూడవ పార్శ్వంలో చదువు చెప్పే టీచర్లూ, హెడ్మాష్టర్లూ, పాఠశాలల్లో అమలుపరుస్తున్న నిబంధనల్లో నలిగే పిల్లలూ, సర్వస్వాన్ని వొడ్డి పదిమందికి చదువు కల్పించడం కోసం స్కూలు బిల్డింగు కట్టించిన పిచ్చి దంపతులూ కన్పిస్తారు.

నిజానికి ఈ కథల్లోని రెండు పార్శ్వాలే ప్రధానమైనవి. అవి పేదరికానికీ, అక్షరాస్యతకూ ఉన్న సంబంధాన్నీ, చదువు మూలంగా కలిగే సంస్కారాన్నీ, భౌతిక సదుపాయాల్నీ తెలియజేసే పార్శ్వాలు - ఆడామగా తేడాలేకుండా పేద, ధనిక తారతమ్యంలేకుండా.

ఈ కథలన్నీ ఇప్పటి మన సమాజంలోని చదువుకు సంబంధించిన వివిధ పార్శ్వాలను స్పృశించినవి కాకపోవచ్చు. కానీ రచయితలు గురజాడ మొదలుకొని చదువును ఒక సమస్యగా గుర్తించడమే ఆ సమస్య పట్ల వారికున్న చైతన్యాన్ని తెలియజేస్తుంది వివిధ అంతరువులు కలిగిన మన సమాజంలో చదువుపట్ల ఒక సమగ్రమైన అవగాహనను కల్గించటానికి సృజనాత్మక రచయితలు చేయవలసింది చాలా ఉంది. చదువు కథలు రాత కథలుగా, నోటికథలుగా, దృశ్యచిత్రణలుగా గిరిజన, గ్రామీణ, పట్టణ, నగర ప్రాంతాలలోని నిరక్షరాస్యుల్ని ఎక్కువగా కదిలించవలసిన అవసరం చాలా ఉంది.

ఈ అవసరాన్ని మొదట తన పరిశోధక వ్యాసంలోని ఒక అధ్యాయంలోని భాగంద్వారా గుర్తింపజేసిన పరిశోధకుడు డా.ఎ.మద్దులేటిరెడ్డి. చదువు కథలు చదివినా, చదివింపజేసినా, చదివివిన్పించినా అటువంటివిరాసే చైతన్యాన్ని కలుగజేసినా అందరికీ విద్య రాష్ట్ర ప్రచార వేదిక లక్ష్యం కొంతవరకైనా నెరవేరగలదని మేము చర్చించినప్పుడు పనికానిమ్మని ప్రోత్సహించిన మిత్రులు ప్రచారవేదిక అధ్యక్షులు ప్రొ॥ ఈశ్వరరెడ్డి, కార్యదర్శి డా.సందీప్, మిగతా సభ్యులూ. ఈ కథల్ని అనంతపురం రచయితల సమావేశంలో చర్చించి ప్రచురణ కార్యక్రమానికి ఊపునిచ్చిన మిత్రుడు సింగమనేని నారాయణ చౌదరి. ఈ ప్రణాళికలోని ఔచిత్యాన్ని గుర్తించినవారు యునిసెఫ్ హైదరాబాదు కమ్యూనికేషన్ విభాగానికి చెందిన సోదరి సుధామురళి. సంకలనంలో తమకథల్ని చేర్చుకోటానికి మాకు నోటిమాటద్వారా అనుమతి ఇచ్చిన వారు కొందరు రచయితలు ప్రచురణ కర్తలు ఇందుకు తోడ్పడిన మిత్రులు చిత్రకారుడు చంద్ర. ప్రూఫుల్ని సరిచూసిన ముద్రణ సమయంలో తోడ్పడిన మిత్రులు ప్రొ॥వై. ఉమాపతివర్మ, డా॥కె.ఎస్.రమణ, సంకలనకర్తలుగా వీరందరికీ మా ధన్యవాదాలు.

ఈ కథల్నించి పాఠకులు, రచయితలు, నిరక్షరాస్యత నిర్మూలనధ్యేయం కోసం పనిచేసే స్వచ్ఛంద సంస్థలలోని కార్యకర్తలు, విద్యాప్రణాళికల్తో సంబంధమున్న అధికారులు, అనధికారులూ ఏ కొంచెం స్ఫూర్తిని పొందినా అక్షరాస్యతశాతం తప్పక పెరుగుతుందనీ, చదువు మన అభివృద్ధి కార్యక్రమాల్లో ఒక విడదీయరాని భాగంగా రూపొందగలదనీ మా ఆకాంక్ష.

ఆగష్టు 10, 1994<br>
హైదరాబాదు

కేతు విశ్వనాథరెడ్డి<br>
పోలు సత్యనారాయణ

# కథలక్రమం


| | | పేజి |
|---|---|---|
| గురజాడ | దిద్దుబాటు | 1 |
| శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి | తల్లిప్రాణం | 5 |
| చాసో | వెలం వెంకడు | 58 |
| చాసో | ఎందుకు పారేస్తాను నాన్నా! | 64 |
| వి.యస్.అవధాని | జ్యేష్ఠుడు | 69 |
| జమదగ్ని | బళ్లోకి వెళ్లాలి | 75 |
| కె.సభా | పిచ్చిదంపతులు | 61 |
| బలివాడ కాంతారావు | పాడులోకం! పాడుమనుషులూ | 69 |
| మధురాంతకం రాజారాం | పుత్రోత్సాహం | 101 |
| దాశరధి రంగాచార్య | చదువు | 109 |
| అరిగేరామారావు | లేతమొలకలు | 114 |
| పులికంటి కృష్ణారెడ్డి | గూడుకోసం గువ్వలు | 124 |
| సింగమనేని నారాయణ | వేషం | 136 |
| జీడిగుంట రామచంద్రమూర్తి | ఉప్పుకప్పురంబు | 141 |
| వి.రాజారామ మోహనరావు | లోటు | 148 |
| దేవరాజు మహారాజు | పాడవని పొద్దు | 155 |
| సదానంద శారద | చదువుకన్ను | 162 |
| వారాల కృష్ణమూర్తి | ఉప్పుసముద్రం | 167 |
| భూపాల్ | సిద్ధార్థుడు | 170 |
| శశికళ | పాము-కప్ప | 179 |

# దిద్దుబాటు

## గురజాడ అప్పారావు

"తలుపు! తలుపు!"

తలుపు తెరువబడలేదు ఒక నిమిషమాత్రం డూరుకొనెను.

గదిలోని గడియారము టింగుమని ఒంటిగంట కొట్టినది.

"ఎంత ఆలస్యము చేస్తిని? బుద్ధి గడ్డితిన్నది. రేపటినుంచి జాగ్రత్తగా వుంటాను. యాంటినాచల్లా పోయి సానిదాని పాట సరదాలో లగ్నమైపోయినది. ఒక్క పాట సరదాతో కుదరలేదు. మనిషిమీద కూడా సరదా పరిగెత్తుతూంది. లేకుంటే, పోకిరీ మనిషి వలె పాట ముగిసినదాకా కూర్చోవడమేమిటి? ఏదో ఒక అవకాశము కలుగజేసికొని దానితో నాలుగు మాటలు ఆడడం ఆసక్తియేమి? ఇదిగో లెంపలు వాయించుకుంటున్నాను రేపటి నుంచి మరి పాటకు వెళ్లను. నిశ్చయం... .. గట్టిగా పిలిచితే కమలిని లేవగలదు. మెల్లిగా తలుపుతట్టి రాముడిని లేపగలిగితినా చడి లేకుండా పక్కజేరి పెద్దమనిషి వేషము వెయ్యవచ్చును."

గోపాలరావు తలుపు చేతనంటగానే రెక్క విడబారెను. "అరె యిదేమి!" అనుకొని, రెక్క మెల్లన తెరవ, నడవలో దీపము లేదు. అంగణం దాటి తన పడకగది తలుపుతీయ, నందును దీపము లేకుండెను. చడిలేక అడుగువేయుచు మంచము దరికిపోయి కమలిని నిద్రించుచుండెనా, మేల్కొని యుండెనా యని కనుగొన యత్నించెనుగాని, యేర్పరింప లేడయ్యె. అంత జేబునుండి అగ్గిపెట్టె తీసి పుల్ల వెలిగించెను. మంచముపైని కమలిని కానరాలేదు. విశ్చేష్టుడై చేతినుండి అగ్గిపుల్ల నేల రాల్చెను. గదిని, అతని మనస్సునూ కూడ చీకటి క్రమ్మెను. వెఱ్ఱి శంకలును, అంతకు వెఱ్ఱి సమాధానములును మనసున పుట్టుచు గిట్టుచు వ్యాకులత కలుగజేసెను. బుద్ధి తక్కువకు తన యందో, కానరామికి కమలిని యందో యేర్పరింపరాని కోపావేశమును, చీకాకును గలిగెను. నట్టివాకటికి వచ్చి పిలువ ఒక్కకాంతిని దాసిగాని దాసుండుగాని కనపడలేదు వారికి తగిన శిక్ష ఉరియేయని గోపాలరావు నిశ్చయించెను.

తిరిగి గదిలోనికి పోయి దీపము వెలిగించి, గది నలుదెసల పరికించెను కమలిని కానరాలేదు. వీధిగుమ్మమెు జేరి తలుపు తెరిచి చూడ చుట్టకాల్చుచు తలయెత్తి చుక్కల పరీక్షించుచున్న రాముఁడు వీధి నడుమ కానవచ్చెను పట్టరాని కోపముతో వానిని జూచి గోపాలరావు "రామా! రా!" యని పిలచెను. రాముఁడు గతుక్కుమని చుట్టపారవైచి, "బాబు" అని డగ్గరెను

"మీ అమ్మేదిరా?"

"మాయమ్మా? ఇంటనున్నది బాబూ"

"మీ అమ్మకాదురా! బుద్ధిహీనుడా! నా భార్య"

"అమ్మగారా? యెక్కడుంటారు బాబూ? పడున్నారు"

"ఇంట్లోనే లేదు!"

రాముడి గుండెలో దిగులు ప్రవేశించెను. గుమ్మములో అడుగు పెట్టగానే రాముని వీపుపై వీశగుద్దులు రెండు పడెను "చంపివేస్తిరి బాబూ" అని రాముడు నేల కూలఁబడెను

గోపాలుఁడు సదయ హృదయుఁడు. అక్రమ మాచరించితినను జ్ఞానము వెంటనే పొడమి ఆగ్రహావేశము దిగజారి పశ్చాత్తాపము కలిగెను రాముని చేత లేవనెత్తి, వీపు నిమిరి పశువువలె నాచరించితినని యనుకొనుచు గదిలోనికి తీసుకొని పోయెను.

కుర్చీపయి కూర్చుని "రామా యేమాయెరా?" యని దైన్యముతో ననెను

"ఏటో మాయలా వుంది బాబూ."

"పుట్టింటికి వెళ్ళి యుండునా?"

"అంతవారు కారనా, బాబూ? కోపగించితే చెప్పలేనుగాని, ఆడారు చదువు నేరిస్తే యేటౌతది?"

"విద్య విలువ నీకేం తెలుసురా, రామా!" అని గోపాలరావు మోచేతులు బల్లపయినాన్చి వాని నడుమ తలయుంచి యోచించుచుండ కమలిని చేవ్రాలు నొక యుత్తరము కానవచ్చెను. దానిని చదువసాగెను.

"అయ్యా"

"ప్రియ పోయి 'అయ్యా', కాడికి వచ్చెనా?"

"పెయ్య పోయిందా బాబూ!"

"మూర్ఖుఁడా! వూరుకో"

"అయ్యా! పది దినములాయె రాత్రులనింటికి మీ రాకయే నేనెరుగను. మీటింగులకు బోవుచుంటిమంటిరి లోకోపకారకములగు నుద్యమముల నిదురమాని చేయుచుంటిమంటిరి. మా చెలులవలన నిజము నేర్చితిని. నేనింట నుండుటను గదా మీరు కల్లలు పలుకవలసివచ్చె నేను పుట్టింటనున్న మీ స్వేచ్ఛకు నిర్బంధమును అసత్యమునకు అవకాశమును కలుగకుండును. మీచే దిన దినమును అసత్యమాడించుటకన్న మీ త్రోవకు అడ్డునుండ కుండుటయే, పతి మేలుకోరిన సతికి కర్తవ్యము కాదా? నే నీ రేయి కన్నవారింటికి జనియెద, సంతసింపుఁడు. వెచ్చముగాక యేపాటి మిగిలియున్నను దయనుంచుడు."

ఉత్తరము ముగించి "నేను పశువును" అని గోపాలరావు అనెను.

"అదేటి బాబూ, అలా శలవిస్తారు!"

"శుద్ధ పశువును!"

రాముఁడు అతి ప్రయత్నముచే నవ్వు ఆచుకొనెను.

"గుణవతి, విద్యానిధి, వినయ సంపన్నురాలు, నా చెడుబుద్ధికి తగినశాస్తి చేసినది."

"యేటి చేసినారు బాబూ?"

"పుట్టింటికి వెళ్ళిపోయినది! గాని నీకు తెలియకుండా యెలా వెళ్ళిందిరా?"

రాముఁడు రెండడుగులు వెనుకకు నడచి "నాను తొంగున్నాను కావాల బాబూ! అలకచేస్తే చెప్పచాల్ను కాని బాబు! ఆడదాయి చెప్పకుండా పుట్టినారింటికి యెల్తానంటే లెంపలాయించి కూకోబెట్టాలిగాని, మొగోరిలాగ రాతలూ, కోతలూ మప్పితే ఉడ్డోరం పుట్టదా బాబూ?"

"ఓరీ మూర్ఖుడా! భగవంతుడి సృష్టిలో కెల్లా ఉత్కృష్టమయిన వస్తువు విద్యనేర్చిన స్త్రీ రత్నమే. శివుఁడు పార్వతికి సగం దేహం పంచి యిచ్చాడు. ఇంగ్లీషువాడు భార్యను బెటర్ హాఫ్ అన్నాడు అనగా పెళ్ళాము మొగునికన్న దొడ్డది అన్న మాట. బోధపడ్డదా?"

"నాకేం బోదకాదు బాబూ!" రామునికి నవ్వు ఆచుకొనుట అసాధ్యమగుచుండెను.

"నీ కూతురు బడికి వెళ్ళుచున్నది కదా! విద్య విలువ నీకే బోధపడుతుంది. ఆమాట అలా ఉండనియ్యి కాని, నువ్వో, నేనో బయలుదేరి చంద్రవరం వెళ్ళాలి. నేను నాలుగు రోజులు దాక వూరినుంచి కదలడముకు వీలుబడదు. నువ్వు తాతలనాటి నౌకరువి. వెళ్ళి కమలినిని తీసుకరా. కమలినితో ఏమి జెప్పవలెనో తెలిసిందా?"

"యేటా బాబూ! బాబు నా యీపు పగలేసినారు రండమ్మా అంతాను."

"దెబ్బలమాట మరచిపో. కొట్టినందుకు రెండు రూపాయలిస్తాను తీసుకో. మరి యెన్నడు ఆ వూసెత్తకు, కమలినితో గాని తప్పిజారి అనబోయేవు సుమా?"

"అనను బాబూ."

"నువ్వు చెప్పవలసిన మాటలు చెబుతాను. బాగా విను. పంతులుకి బుద్ధి వచ్చింది. ఇక యెన్నడూ సానులపాట వినరు. రాత్రులు యిల్లు కదలరు. ఇది ఖరారు. తెలిసిందా? మిమ్మలను గెడ్డము పట్టుకొని బతిమాలుకున్నానని చెప్పమన్నారు. దయదలచి ఆయన లోపములు బయలుపెట్టక, రెండు మూడురోజులలో వెళ్ళిపోయి రమ్మన్నారు. మీరు లేని రోజూ యుగముగా గడుపుతున్నారు, అని నిపుణతగా చెప్పు తెలిసిందా?"

"తెలిసింది, బాబూ"

"యేమని చెబుతావో నాతో ఒక మాటు చెప్పు"

రాముడు తల గోకుకొనుచు "యేటా యేటా, అదంతా నాకేం తెలదు. బాబూ, నానంతానూ, అమ్మా! నా మాటినుకొండి. కాలం గడిపినోణ్ణి ఆడోరు యెజమాని చెప్పి నట్టల్లా యిని వల్లకుండాలి. లేకుంటే మా పెద్ద పంతులార్లాగ అయ్యగారు కూడా సానమ్మ నుంచుగుంతారు. మీ శెవులో మాట, పట్నంలోకి బంగారబొమ్మలాంటి సానమ్మ వచ్చింది.

మరి పంతులు మనసు మనసులో లేదు. ఆపై మీ సిత్తం అంతాను."

"ఓరీ వెధవా!" అని గోపాలరావు కోపముతో కుర్చీనుంచి లేచి నిలచెను.

ఊసవలె రాముడు వెలికెగసెను.

అంతట మంచము క్రింద నుండి అమృత నిష్యందినియగు కలకల నగవును, కరకంకణముల హృద్యారావమును విననయ్యెను.

(1910)

# తల్లి ప్రాణం

## శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

"చెప్పినమాట విను" అన్నాడు రామబ్రహ్మం.

బుజ్జగించి లోపుచేసుకుందామని అతని ప్రయత్నం; కాని, పురుషుని అహంకారమూ యజమాని అధికారమూ స్ఫుటంగానే ధ్వనించాయామెకి ఆ మాటలతో.

"నేను విననండీ" అంది భద్రమ్మ తల తాటించుకుంటూ.

ఇంకా వూరుకుంటే విషమిస్తుందని తోచినప్పుడు స్త్రీలు కనపరిచే పట్టుదలా ప్రతిఘటనా స్పష్టంగానే వున్నాయామాటలో.

వాటికి మెరుగు పూద్దామని ప్రయత్నించనేలేదామె.

పై పెచ్చు నిర్లక్ష్య భావమూ కనపరిచింది నిర్మొగమాటంగా.

ఇదివరలో రెండుమూడు మాట్లీ ప్రస్తావన రాకపోలేదు; కాని తెలివిగా మాట తప్పించేస్తూ వచ్చిందామె.

అయినా అతనూరుకోకపోడం చూసి యెవరో అతణ్ణి రెచ్చగొడుతున్నారని గుర్తించుకుంది.

కనక, యెప్పటికయినా యిది తప్పనిదే, తనకి.

అంచేత, దీని అంతు చూడాలని నిశ్చయించుకుంది.

ఈ నిశ్చయంతో యిలా యెదురుకుంది, చివరికి.

ఇందులో పెంకితనం కనపడకపోలేదతనికి.

అయినా, వెనక్కి తగ్గలేదతను.

ఇందులో తనకూ బాధ్యత వుందని ఆమెకి తెలియపరచాలన్న ఉద్దేశంతో అందుకున్నాడు, మెల్లిగా.

"అలా కాదు, కొంచెం నిదానించు. దీనివల్ల యేమీ లాభం లేదని నీకే తెలుస్తుంది."

"చదువుకుంటే లాభం లేదని మీరు కనక అనగలిగారు, వూరుకోండిపాటికి"

"శిరోమణి పరీక్ష యిచ్చిన మొగరాజులకే దిక్కూ దివాణమూ లేకుండా వున్న దినాలివి. అమ్మాయి విద్వానయితే-"

"అయితే, అంటూ సందేహం కూడానా?"

"లేదు అవుతుందే అను, నీ మాట యెందుక్కాదనాలీ? అయితే, అది వుద్యోగం చేస్తుందా వూళ్ళేలుతుందా?"

"చెఉయ్యకపోడానికి యేలకపోడానికి తెలివితక్కువదా, చేతకానిదా చిట్టితల్లి?"

"అది కాదు నేను చెప్పేది-"

"మరేమిటండీ?"

". . .... ."

"కాక, - ఉద్యోగం కోసమేనా చదువు?"

"చెప్పేదేమిటో-"

"ఉద్యోగం చేయిద్దామనే చెప్పించారు మీ నాయనా, మా నాయనా మీకు ఏం చెయ్యగలిగారు, మీరు?"

". ...."

"మీరే కాదు బి యేలూ ఎం ఏలూ కూడా లక్షమంది మొగపిల్లలు దేవుళ్ళాడుతున్నారు, వుద్యోగాలు దొరక్క, మరి, చదువులు మానుకున్నారా వారిని చూసి తరవాతి వాళ్ళు?"

"దాని కవసరం యేమిటని అడుగుతున్నాను నేను తెలుసా?"

"అంటే?"

"అది తప్ప, మన కిప్పటికింకెవరూ లేరుగదా, వున్నదంతా సుఖంగా అనుభవించక నౌఖరీ కర్మం యేమిటీ అమ్మాయికి?"

"అధీనం తప్పితే అత్తవారు విదిపికొట్టే మనోవర్తి డబ్బులకు తప్ప, ఎంత వుండినా పుట్టింటివారి ఆస్తిలో అధికారం యేదీ ఆడపిల్లకి?"

"............ ."

"పోనీ, అనుభవించడానికే పెట్టి పుట్టిందా నా చిట్టితల్లి?"

ఇలాంటి మర్మాఘాతం సంభవిస్తుందనుకోలేదతను.

నోరు నొక్కేసినట్టయిపోయింది, దీంతో

"చేతులారా దాని గొంతుకు పిసికేశారు కాని, కాస్త అయినా తరువాయి అట్టేపెట్టారా మీరు మీ అమ్మాను?" అంటూ ఆమే అందుకుంది చూసి చూసి

"... . .."

"మొగుడు ఛస్తే చచ్చాడు, చదువనీ పుస్తకాలనీ పత్రికలనీ సభలనీ ఆ సందట్లో పడయినా కాలం వెళ్ళబుచ్చుకోడానికి-"

"కాలమే వెళ్ళబుచ్చు కోవాలంటే అందుకు లక్షమార్గాలు"

"వాటిలో యిదొకటి తెలుసా?"

గభీమని మాట తోచకపోవడమే మంచిదయిందతనికి

ఈవ ధానంలో కొత్తదారి కనప డింది.

"మాటకి మాట అనెయ్యడమే గొప్ప అనుకోకు. దానికోసం డబ్బు ఖర్చు పెట్టటం యిష్టం లేక నేనిలా అంటున్నానని కూడా అనుకోకు. ఇనప్పెట్టి తాళాలు దానికే యిచ్చేస్తాను. నాకేం కావలసినా దాన్నే అడుగుతాను. అది యిస్తేనే పుచ్చుకుంటాను"

"ఉపోద్ఘాతం చాలు, అసలేమిటో చెప్పండి"

"తీర్థయాత్రలు దినానికో నోము, సంతర్పణలు, సమారాధనలు–"

"ఏం ఆగారేం?"

"సంసారం అంతా అదే నిర్వహించేస్తుంది. మరి, వివరాలెందుకూ?"

"ఎవరి సంసారం?"

తల యెగరవేసుకుంటూ ఆమె యిలా అడిగేటప్పటికి వులిక్కి పడిపోయాడతను

"బుర్రకూడా–" అంటూ మాట నాన్చేసిందామె; కాని, అంత మాత్రానికే కొండవిరిగి మీద పడ్డట్టయిందతనికి.

జుట్టు తీయించేసుకునీ, సైను పంచె కట్టుకునీ తన కూతురు తన యింట్లోనే వంటలక్క అయివుండినట్టున్నూ అనిపించింది.

కాళ్ళల్లో వొణుకు పుట్టింది, దీంతో

మనస్సు చెదిరిపోయింది

ఇది గుర్తించి "మేనరికం వద్దో అని నేనెంత మొత్తుకున్నా, నాకీ మొగుడు వద్దు మొర్రో మంటూ అదెంత గోలపెట్టినా మొండికెత్తి దాని బతుకింతకి తెచ్చారు మీరు. పుట్టిన వొక్కబిడ్డా మోడయిపోయి అలో లక్ష్మణా అంటూ యేడుస్తూ వుంటే జాలి లేదూ మీకు? కనికారం పుట్టదూ?"

". ........"

"దుఃఖం యెరుగరూ మీరు?"

గిర్రున నీళ్ళు తిరిగాయతని కళ్ళల్లో.

ఆమెకేసి చూడలేకపోయాడు. ఆ వాలకంతో

"అంత చక్కని పిల్ల మరొక్కర్తి వుందా భూమ్మీద? దాని తెలివితేటలకు హద్దూపద్దూ వున్నాయా? దాని వొబ్బిడీ దాని నిదానమూ, దాని ఆరిందాతనమూ యేమయిపోనూ? దాని ఆశలు నిరాశలయి, దాని బతుకు బగ్గం పాడయిపోవలసిందేనా?"

చెవులు గింగుర్లెత్తిపోయాయతనికి.

"నేనెందుకు చూస్తున్నానో కాస్త పరకాయించుకోండి చదువుసంధ్యలబ్బాయి కనకనే ఆ మంచితనమూ అబ్బింది దానికి. చదువే లేకపోతే – మీ యింటి ఆడబడుచది – మీ అక్కలాగ కజ్జాకోరయిపోయి వుండును. గుర్తించుకోండి"

తన అక్క సంగతి బాగా తెలిసి వుండదనుకున్నాడామెకి.

తెలిసి వుండినా యిప్పుడు మరిచిపోయి వుంటుందనీ అనుకున్నాడు.

కాగా, దీంతో తెల్లబోయాడు.

అదిన్నీ గ్రహించేసిందామె.

అతనికి "నసాళం అంటిం"దనుకుంది.

"ఇక ఫరవాలే"దనిన్నీ నిశ్చయించుకుంది

"మంచిమాటాడి పంపేద్దాం" అని దయతలచింది, చివరికి.

"మంకుపట్టు పట్టానని మీరు బాధపడనక్కరలేదు. ఇది తప్ప మీరేమీ చెప్పండి వింటాను. ఇదివరకల్లా వినలేదుటండీ?" అనడిగింది, లాలనగా

తేరుకున్నాడతను, దీంతో.

"ఈ వొక్క మాటా కూడా వినకూడదూ?" అందామనుకున్నాడు

మాట నాలుక చివరికి వచ్చేసింది కూడా; కాని "నా మాట వినడం నామోషీ అనుకున్నారేమో మీరు తల్లి మాటా వేరే గంపెడు సంసారం నిర్వహించుకుంటున్న అక్క మాటా వినడం కంటే తప్పు కాదు, చేసుకున్న పెళ్ళాం మాట వినడం" అందామె, చురచుర చూస్తూ, అంతలో.

కూతురుకి పెళ్ళి ప్రయత్నాలు చేసినప్పుడు తల్లికే కాదు అక్కకి తాను బానిస అయిపోయి వుండడం జ్ఞాపకం వచ్చిందతనికి.

అప్పుడు కూతురేడవడమూ, అందుకు జాలిపడి "నువ్వు మనిషివి కావూ?" అంటూ యిరుగు పొరుగూ తనని నిరసించడమూ, అయినా, తాను హృదయం రాయి చేసుకోవడమే కాక, భద్రమ్మని దాసీదానికంటె నికృష్టంగా చూడడమూ – ఇదిన్నీ జ్ఞాపకం వుందతనికి.

తన మొండితనమే యింతకి తెచ్చిందని బోధపడిందతనికి; కాని వయసు వచ్చిన సుందర వితంతువు – సయానా తన యేకపుత్రిక – పుణ్యస్త్రీ వేషం వేసుకు తిరగడమూ, పెద్ద పెద్ద చదువులూ చదువుతూ సభలకు వెళ్ళి పురుషుల మధ్య కూచుంటూ వుండడమూ – ఇవన్నీ జ్ఞాపకం వచ్చి మళ్ళీ అభిమానం అందుకుందతనికి.

కాగా "మరొకటీ మరొకటీ అయితే –" అంటూ యేమో అనబోయాడతను; కాని "మరొకటి మరొకటీ కాక మరేమిటీ యిదీ?" అంటూ ఝుమాయించి అడిగిందామె, మాట సగంలోనే అందుకుని.

మళ్ళీ తెల్లబోయాడు

మాటే ఆడలేకపోయాడు.

ఆమె మాత్రం వూరుకోలేదు.

"అమ్మాయి జోలి మీకక్కరలేదు. ఆడవాళ్ళ కష్టసుఖాలు మొగవాళ్ళ కర్థం కావు. చావలేక బతికివున్నాను నేను ఏడవక లేక నవ్వుతున్నాను. ఎదురొమ్ము మీద కుంపటిలాగ అమ్మాయిని భరించేదాన్ని నేను, మీకేం తెలుస్తుందీ?"

ఒక్క దెబ్బతో అష్టోత్తరశతంగా ఓంకారనాదం చేసే గంట అయిపోయిందీ మాటతో అతని చెవి.

"ఒక్కనాడు మీరింటో లేకపోతే – ఒక్కపూట మీరు కనపడకపోతే – ముప్పయ్యేళ్లు

నిండిన నేనే యెలాగో అయిపోతాను గదా, మొన్ననే పదిహేడేళ్ళు నిండిన పిల్ల అమ్మాయికి వైరాగ్యం కలగాలని మీరెలా ఆసిస్తున్నారండీ?"

మనస్సు గుబగుబలాడిపోయిందతనికి.

"పోనీ – మీ మాట చెప్పండి. నాతో మాట్టాడకుండా వుంటారా మీరు? నాకూడా కూడా తిరగడం మానుకుంటారా. నాకేసి చూడ్డం కూడా పనికిరాదు. కట్టిపెట్టేస్తారా?"

ఇలా అడుగుతూ చురుగ్గా కూడా చూసిందామె.

ఆ చూపులు భరించలేకపోయాడతను.

"గుర్రం దిగు ఈపాటి" కంటూ జబ్బ పట్టుకుని యెవరో దిగ గుంజేసినట్టున్నా కాగా మాట్టాడలేకపోయాడతను.

అతనేదో ౼ాకటి అనగలిగితే యేమిటేమిటో అనేసునామె; కాని అతని మౌనం విసుగు పుట్టించింది.

మరో క్షణం కూడా యెదురు చూసింది.

"ఒక్కదానికి బదులు చెప్పకపోతే యేంజేతునమ్మా నేనూ?" అందామె చేతులు తిప్పుకుంటూ చివరికి.

పూర్తిగా చిత్తయిపోయి వున్నాడతను; కాని దీంతో వూపిరాడింది మెల్లిగా.

నిర్లక్ష్యంగా యెదురుకుని, నిర్మొగమాటంగా నిలవతీసిన్నీ వుండి వుండి చివరికలాగ ఆమె స్త్రీ సహజమైన ధోరణిలో పడిపోయాటప్పటికి పౌరుషం రేకెత్తిందతనికి.

అయినా దెబ్బతిన్న పాము.

ఆలోచించి "ఇప్పుడే కాదూ మాట్టాడవద్దన్నావూ నువ్వూ?" అనడిగాడు మొండిగా, నిష్ఠూరంగా చూస్తూ.

"సడే" అందామె; కాని వ్యవహారం మరో అంతస్థులోకి వెడుతోందని శంకించుకుంది

అదే నిజమైతే గ్రంధం తుంచెయ్యాలి, లేకపోతే చిక్కులున్నాయి.

అలా తుంచెయ్యడంలో కూడా విలాసాలు చూపించే అవకాశం వుంది, తన స్త్రీ జాతికి.

కాగా, మేజామీద వుండిన ఫలహారప్పళ్ళెం అందుకుని "యిలా తిరగండి" అందామె, చంటిపిల్లవాణ్ణన్నట్టు బెల్లించి చూస్తూ.

ఇదంతా ౼ారకంట చూశాడతను.

"చేతిలోకి వస్తోంది పిట్ట" అనుకున్నాడు.

అక్కడ ప్రారంభమైన విలాసాలకు మారాకు తొడగాలంటే తనది కోపం కాదన్నట్టు స్ఫురింప చెయ్యాలామెకి కావ్యార్థ సూచనలాగ.

కనక ఉన్నవాడున్నట్టామెకేసి తిరిగాడు లాఘవంగా.

"దగ్గరికి రండి"

మీదిమీదికి జరిగాడతను "మరేం చేస్తావో చెయ్యి" అన్నట్టు చూస్తూ.

"నాకేసి చూడండి"

నవ్వు వచ్చిందతనికి; కాని అతి ప్రయత్నం మీద బిగపట్టుకుని గాంభీర్యం కూడా తెచ్చుకున్నాడు, ముందు.

అతి తాపీగా మొగం తిప్పుకుని, అంతకంటేనూ మెల్లిగా ఆ మొగం పైకెత్తుకుని మెల్లిగా కళ్ళు పెద్దవి చేసుకుని, రెప్ప వెయ్యకుండా చూశాడు, చివరికి.

అతని ప్రయత్నమేమో ఆమె పాలించడమే.

ఊహ కూడా ఆమెను ప్రసన్నురాలిని చేసుకోడమే

అయితే, నవ్వు బిగబట్టుకోడానికి చేసిన ప్రయత్నం అతి అయి, అతని చూపులకు కరుకుతనం చేకూర్చింది

ఆమె గాంభీర్యం అంతా పూర్వపక్షం అయిపోయింది, దాంతో

బెట్టుసరి కూడా నీరయిపోయింది.

దీనికి సాయం, - చెలికత్తెతో మాట్లాడుతూ వంకాయబజ్జీ చేస్తున్న కూతుర్ని యేమార్చి వచ్చింది తాను.

ఇక్కడే కూచుంటే ఆమె కేకలేస్తుంది

ఫలహారం కాకుండానే ఆ కేక వస్తుందేమో?

కనక, "తొరగా కానివ్వండి" అంటూ పలహారం చేయించింది, మధ్య మధ్య తాను కూడా కాస్త కాస్త పుచ్చుకుంటూ

కాఫీ యిచ్చింది కొసిరి కొసిరి; కాని అతనామె చెప్పింది చేస్తూ కూడా అలా బిగపట్టుకునే వున్నాడు మొగం

ఇదంతా రసాభాస అయిపోయినట్టనిపించిందామెకి, దాంతో

మొగాన బేలతనమున్నూ అలుముకుంది

మరి వుండలేక బుజం పట్టుకుని కదుపుతూ "ఏం కోపం వచ్చిందా?" అంటూ జాలిగా చూసింది.

ఓ!

అఖండ విజయం పురుషులకది. ఏనుగెక్కినంత వుల్లాసం వచ్చిందతనికి, దీంతో

శృంగార విలాసాలున్నూ పుట్టుకు వచ్చాయి, అవ్యవధానంగా.

ఎడమచేత్తో ఆమె నడుము చుట్టివేశాడు వెంటనే బుగ్గకి బుగ్గ ఆనించి పావురం లాగ కువకువలాడుతూ.

## 2

మడత కండువా మెడలో సవరించుకుంటూ వీధి సావట్లోకి వచ్చాడు రామబ్రహ్మం.

అతనికోసమే అక్కడ కనిపెట్టుకుని వుండిన వెంకుసోదెమ్మ "ఏమాలోచించావు నాయనా?" అనడిగేసింది నిశ్చలంగా చూస్తూ, వెంటనే.

"ఆలోచించాను గాని యింకా యేమీ నిశ్చయించలేదమ్మా"

"ఏమీ అంటే?"

పోలీసుల అదమాయింపులా కనపడింగా [illegible]ది.

ఇంటిల్లపాదికీ తాను లోకువ అయిపోయి వుండినట్టనుమానం పుట్టి, అభిమానమున్నూ ముంచుకు వచ్చేసింది.

పురుషహంకారం యెలా వుండినా యెత్తింది మగజన్మ కదా.

పైగా గ్రాడ్యుయేటు - సెమీ అయితే యేంగాక.

కనక, యిది బాగా లేదనుకున్నాడు

ఇక యిలా జరగనివ్వకూడదనిన్నీ నిరుకు చేసుకున్నాడు

"బదులు చెప్పకపోతే యేం?" అనుకున్నాను కూడా; కాని "చదువు చెప్పించడమా మాన్పించడమా" అని యెలాగూ నోరు జారిపోయింది

పోనీ అంటే, అవతలి మనిషి అతణ్ణి కన్నతల్లి.

ఆ యింటో - అతనిమీద కూడా ఆమెకి వున్నాయి కొన్ని అధికారాలు, సహజంగా.

పైగా భర్త అకాలమరణం పొందిన దుఃఖం అంతా మరిచిపోయి, మూడుమాసాల గుడ్డుని పెంచి యింతవాణ్ణి చేసుకుందామె

తన చెప్పుచేతల్లో నుంచి జారిపోకుండా ఎక్కువ జాగ్రత్త పడుతా నున్నూ పెంచుకుందామె.

ఇప్పటికీ ఆ జాగ్రత్త మరిచిపోలేదామె

నలభై యేళ్ళూ పతను; కాని చంటిపిల్లవాణ్ణి ఆజ్ఞ పెట్టినట్టు నడిపిస్తూ వుంటుందతణ్ణి, యెలాంటి సందర్భంలోనూ కూడా

"కాగా చెప్పించడం యిదివరకే జరుగుతోంది. యిక నువ్వాలోచించవలసింది మాన్పించడం మాటే" అంటూ సాగతీసుకుంది, చేతులు తేలవేసుకుంటూ

అక్కడ యేదో విధంగా తప్పించుకు వచ్చాటప్పటికి కిక్కడ యిది.

ఇంటి కంతకీ తానొక్కడే మొగవాడు

యజమాని, కాని ఉన్న యిద్దరు స్త్రీలూ తన మీద అధికారం చెలాయిస్తూనే వుండడం చాలా బాధపెట్టిందతణ్ణి.

కాని, కిమ్మనలేకపోయాడు.

యధాపూర్వకంగానే అందుకుందామె

"చిన్నాడవూ చితకాడవూ కాదు నువ్వు, కాస్త పెద్ద తరహా నేర్చుకోవాలీపాటికి"

ఇలా అందేగాని, ఆ వాతావరణమే యెరగనివాడికి, ఇవాళ హఠాత్తుగా పెద్దతరహా వస్తుందా?

ఇది యోచించుకోలేదామె.

ఎంతసేపూ తనకి విధేయుడయి వుండేటట్టు చూసుకుంటూ వచ్చినందుకు, పెళ్ళానికిన్ని ఎధేయుడయి వుండే ధోరణే అబ్బిందతనికి.

అయితే, యీమె వ్యవహర్త.

ఆమె ప్రణయవతి మాత్రమే,

కాదంటే, విలాసవతిన్నీ.

పరోక్షంగా నయినా తానింటికి యజమానురాలు కనక, తన భర్త తన కనుకూలుడై వుండాలనుకుంటుందామె

ఇది యెప్పుడో గుర్తించేసింది వెంకుసోదెమ్మ.

అది మొదలు, సమయం వచ్చినప్పుడల్లా కోడలిని దూరంగా నెట్టుకుంటూనే వస్తోందామె మెళుకువగా.

బయట వుండి సాటివాళ్ళని చూసినప్పుడేమనుకున్నా – ఇంటో వుండినా లోపల్లోపల యేమనుకోగలిగినా అతనందుకనుగుణంగానే సంచరించుకుంటున్నాడు.

ఇక్కడే వుంది భేదం చిన్నప్పుడే తండ్రి చనిపోయిన మొగవాడికి, తండ్రి చెప్పుచేతుల్లోనే పెరిగిన మొగవాడికీనీ.

నిజానికి, కొడుకు తెలివితేటలు కావాలనడంలో తల్లికీ తండ్రికీ ఒక రకమైనదే శ్రద్ధ, కాని వీధికి వెడితే దుస్సహవాసాలలో పడిపోతాడేమో అని – కనీసం స్వతంత్రించడం అయినా నేర్చుకుంటాడేమో ఇంటోనే మూసి పెట్టుకుంటుంది తల్లి కొడుకుని

తండ్రిమాత్రం అలా కాదు, ఇటు దుస్సహవాసాలలో పడకుండానూ చూసుకుంటాడు, అటు స్వతంత్రుడూ వ్యవహర్తా కూడా అయేటట్టు చూసుకుంటాడు కొడుకుని

వీధికి వెళ్ళే మొగవాడికే వుండే దృక్పథం యిది. ·

రామబ్రహ్మం దీనికి దూరం అయిపోయాడు, చిన్నప్పుడే.

కాగా, తల్లి అన్నా భయమే, పెళ్ళాం అన్నా హాణుకే మొదణ్ణుంచీ అతనికి.

అయితే అటు మాతృ వాత్సల్యమూ యిటు భార్యా ప్రణయమూ గూడా పుష్కలంగా అనుభవిస్తున్నాడతను.

వీధికి మాత్రం వెళ్ళలేడు.

ఎలాంటి వ్యవహారం అయినా అర్థం అవుతుంది; కాని నడవదు

నడిపించుకుందామన్న చూపే లేదు.

మొదణ్ణుంచీ సంసారం తన గుప్పిట వుంచుకుని వుండిన వెంకుసోదెమ్మ కిదీ కావలసింది.

అయితే, చిన్నతనం కావడంవల్ల పెళ్ళాం మాట అంటే తియ్యగా వుండినా తాను కళ్లెరజేసినప్పుడూనా?

## 3

ఈ దిలాసాతో మళ్ళీ అందుకుందామె.

"నువ్విలాగనీళ్ళు నములుతూ కూచుంటే వల్లమాలిన అప్రతిష్టచుట్టబెట్టుకుంటుంది సుమా,"

చదువుకుంటే అప్రతిష్ఠ యేమిటమా?"

"ఆ!"

"పోనీ, పాఠశాలకి వెడుతోందేమో అంటే లేదాయె. నాలుగ్గోడల మధ్యా – ఇంటో కూచుని, చడీ చప్పుడూ లేకుండా–"

"అదేమిట్రా నీ మాటలూ నువ్వూనూ? ఇంటో కూచుని అయితే మాత్రం అదేమి చదువురా?"

"ఏం?"

"నువ్వు వచ్చి మావాళ్ళకి తెలియకుండా నన్ను తీసుకుపో" అంటూ కృష్ణమూర్తికి వుత్తరం రాస్తుందిట రుక్మిణీదేవి. ఆ పళంగా వచ్చి అతగాడు అమాంతంగా ఆమె నెత్తుకుపోయి - ఇలాంటిదేనా యీడువచ్చిన పిల్ల నేర్చుకోవలసిన చదువు?"

"ఏమిటీ?" అనిపించిందతనికి

అరికాలి మంట నెత్తికెక్కిందది. కాని అది రుక్మిణీదేవి కల్యాణం కథ అన్న మాట జ్ఞాపకం వచ్చిందంతలో

"భావకవుల రచనలు చదివితే యేమోగాని మహాభక్తుడు కదా పోతరాజు రచన చదివినా చెడిపోతారా ఆడపిల్లలు?" అనుకున్నాడు, దీని మీద.

అది తీరకపోగా "మరి, యిప్పటి యే(బ్రాసిపిల్లలు రాసేటట్టే రాసిందేం వుత్తరం రుక్మిణీదేవి?" అంటూ మరో సందేహం కలిగింది.

"అందుచేతనే కామోసు అమ్మకి గుంజాటన?" అనిపించింది.

అయితే, అటు చూస్తే కూతురి దృష్టి చెడుతుందన్న అపాయ శంక కనపడింది; కాని యిటు చూస్తే స్వతంత్రించి వ్యవహరించవలసిన చిక్కు కనపడుతోంది, తనకి

కాక - స్థితి వున్నందుకు, చక్కగా పొద్దున్న బిలియర్డ్సున్నూ, సాయంత్రం టెన్నిస్సూ ఆడుకోకుండా ఈ పాడు గొడవలేమి"టనిపించింది

"రాగాలు తీస్తూ, కళ్ళు తిప్పుకుంటూ పాతికేళ్ళవాడు పాఠం చెప్పడమా?" అంటూ ప్రారంభించింది, మళ్ళీ ముసలమ్మ

"ముసలి పండితుడు చెబితే పనికివస్తుంది కదా?" అనడుగుదామనుకున్నాడు కాని వశం కాలేదు

ముసలావిడే అందుకుంది.

"ఎక్కే గుమ్మమూ దిగే గుమ్మముగా ప్రయివేట్లు చెప్పి పొట్టపోసుకునే వాడికి ఆ పట్టంచుల పంచెలూ ఆ జరీ కండువాలూ యెక్కణ్ణుంచి వస్తాయో? అవెక్కడి సెంట్లో ఆ తాంబూలానికి విధీవిరామమూ వుందో లేదో-"

"తక్కిన యిళ్ళవాళ్ళెందుకు చెప్పించుకుంటున్నారూ ఆయనచేత?"

"అయితే?"

"మనకెందుకీ సందేహం?"

"వాళ్ళ కర్మం, మనకేం?"

ఝుమాయించి యిలా అడిగేసిందే గాని, తన మాటలో తనకే వూతం కనపడలేదామెకి. ఆలోచించింది.

"సుందరి యేమి చేస్తోందండీ అమ్మమ్మగారూ?" అంటూ వస్తాడా పిల్లాడు. అమ్మాయి కొడుకు కూతురా? తానేమో నాకు కూతురి కొడుకా? వావి యెలా

కల్పించాడో చూశావా?" అనడిగింది. వెంటనే "ఏం వెయ్యనా"నన్నట్టు చూస్తూ

"ఆ, ఆ" అనుకున్నాడతను

దడా దడా కొట్టుకున్నాయతని గుండెలు

"ఆహితాగ్నుల కుటుంబంరా మనదీ. ఏ పూరుషుడెప్పుడూ నొకరిచేత వేలుపెట్టి చూపించుకోలేదురా" అని కూడా అంది ఆ వేడి తగ్గకుండా

అయితే వారి నెవరినీ యెరగడతను; కాని ఆ పూర్వులు - ముఖ్యంగా - అతని పితృపితామహప్రపితామహులు ముగ్గురూ వచ్చి తన యెదుట నుంచున్నట్టనిపించిందతనికి

తనలాగ అప్రాచ్యవేషంతో కాక, నీరుకావి ధోవతులు కట్టుకునీ కాశ్మీరు శాలువలు కప్పుకునీ, కుండలాలున్నూ ధరించీ, బ్రహ్మ వర్చస్సంపన్నులై వున్నారు వారు

తళతళ మెరుస్తూ వారి చేతుల్లో చిన్న చిన్న రాగి జారీలున్నాయి.

"మేము స్వతంత్రులంగా బతికాం. మా సంసారాలు మేమే స్వయంగా నిర్వహించుకున్నాం. మా భార్యలను మేము ధర్మపత్నులనుగా చూసుకున్నాం ఆటవస్తువులుగా కాదు మా తల్లుల మాటమీదా మా తోడబుట్టువుల మాట మీదా మా ఆడపిల్లల గొంతుకలు కొయ్యలేదు మేము" అన్నట్టున్నూ అయింది వారు

చేత్తో దేవేసినట్టయిపోయిందతని మనస్సు. దీంతో

"అమ్మ చెప్పినట్టు నడుచుకోడమేనా. కూతురి బతుకు చూడ్డం యేమయినా వుందా?" అన్న ప్రశ్న యెక్కణ్ణుంచో వచ్చి చెవులు గింగురు మనిపించింది

"అమ్మా యేమంటుందీ?" అనడిగాడు దురుసుగా దీంతో.

"మెచ్చుకపడింది, మాంతానంటుందా అది?"

"అడిగేదొకటీ చెప్పేదొకటీన్నీ" అంటూ విసుకున్నాడతను: మొగం పక్కకి తిప్పుకుని,

"కాకపోయినా, దాని యిష్టమేమిట్రా?" అంటూ నిలవతీసింది ముసలమ్మ

ఒక్క నిమిషం అతనిలా చూడలేదు

తల్లిమాట మాత్రం చెవిని పడింది, ఆ నిమిషాన

"చదువబ్బుతోంది గాని లోకజ్ఞానమేదీ చిట్టితల్లికి? కనక, అమ్మ అన్నమాట నిజమే" అనుకున్నాడతను

"న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి" అన్న కారిక కూడా గభీమని జ్ఞాపకం వచ్చింది; కాని "మీ అమ్మ మాత్రం ఆ సూత్రం కిందికా రాదుటోయ్?" అంటూ యెవరో టోకాయించి నట్టుంది

నిర్విణ్ణుడయిపోయాడు.

"ఆ పిల్లాడు వస్తే యిక మా అమ్మాయి చదువుకోదు వెళ్ళిపొమ్మని చెప్పేస్తా" నంటూ ముసలమ్మే అందుకుంది. అతని తటపటాయింపు చూసి.

అప్పటికీ అతని నిర్వణ్ణత వదలలేదు; కాని అవతలివైపున "జాగ్రత్త" అని తర్జనితో నిషేధిస్తూ భద్రమ్మ ఉగ్రమూర్తి కనపడింది.

స్తబ్దుడే అయిపోయాడు, దాంతో అతను.

"ఏమంటావ్?" అనడిగింది ముసలమ్మ, చూసి చూసి.

"......... .."

"మాట్లాడవేమిరా?"

"..........."

"అక్కా బావా అక్కడ వీధికి రాలేక కుళ్ళిపోతున్నారురా."

"ఎందుకూ?"

"అయ్యో అయ్యో-"

"కుళ్ళి కుసిల్లిపోవలసినంత వుప్పెన యేం వచ్చిందమ్మా వాళ్ళకి?"

"చెట్టంత కొడుకు బుగ్గయిపోయి – ఈడు వచ్చి రంభలా వున్న కోడలు వీధెక్కి చదువులు వెలిగిస్తోందంటే ఇదేమీ విపరీతం రా, నీకింత మంచీ చెడ్డా తెలియకుండా వుందీ?"

"మన అమ్మాయి మంచిచెడ్డలు మనం చూసుకోమూ?"

"చూసుకోమనే కాదూ నేను చెబుతున్నది మాత్రం?"

"స్నేహితులతో డబ్బీలు కొట్టడంలో వున్న శ్రద్ధ సంసారం విషయమై లేదా యేమిటి మనికి?" అని తనకి తానే ఆకాంక్షించుకున్నాడతను.

"ఛ, యిక యీ పోసుకోలు తిరగాటం మానేస్తే బాగుంటుందేమో? అనుకున్నాడు కూడా కాని మొగాలు వేలవేసుకుని యెందరో స్నేహితులు తన కోసం సమాజం భవనంలో పడిగాపులు పడి వుండినట్టు కనపడిందతనికి

"నువ్వొక్కడవూ లేకపోతే మే మెంతమంది వుంటే మాత్రం యేమి ప్రయోజనమూ?" అని వారు దేవుళ్ళాడుతున్నట్టున్నూ కనపడింది.

తానే వారిలో గొప్పవాడన్న గర్వం పుట్టుకు వచ్చిందతనికి దీంతో.

"పాపం – దరిద్రులు" అనుకున్నాడింగ్లీషులో.

పై తృకంతో వేషాలకు పోయేవారందరిదీ యిదే మచ్చు లోకంలో.

తమ జాతి – తమ దేశం – తమ జిల్లా – తమ వూరు – తమ సంఘం – కనీసం తమ జట్టు తమ దయాధర్మ భిక్షాల మీదే నడుస్తున్నట్టు వారి భావన.

అందులోనూ, అందరికంటే యెక్కువ వున్నావాడేమో రామబ్రహ్మం మరీనూ

కాగా "వెళ్ళాలి" అంటూ తొందర పుట్టేసిందతనికి.

మనసులో సంకల్పంతోపాటు కాళ్ళల్లో చలనమున్నూ కలిగింది.

ఒక్క అడుగున్నూ పడింది వీధికేసి, కాని మొగంపై కెత్తుకునేటప్పటికి తల్లి రూక్షేక్షణాలు కళ్ళల్లో గుచ్చుకున్నాయి.

"చూడు" గద్దిస్తున్నట్టందుకుని "అల్లుడు చచ్చిపోయినందుకేమయినా విచారిస్తుందా నీ పెళ్ళాం?" అనడిగింది.

మాట అందలేదతనికి.

"పోనీ అంటే, సుందరమ్మయినా దుఃఖం యెరుగునా?"

అడిగి వూరుకోలేదు ముసలమ్మ తెగ సాగతీసుకుంది

అదెందుకో అర్థం కాలేదు రామబ్రహ్మానికి

పెళ్ళి కాక పూర్వం ధుమధుమలాడుకుంటూనే వుండేవారు సుందరీ కిష్టప్పాను ఎప్పుడోకచోట చేరినా.

అనిష్టానికి సాయం సిగ్గొకటి – పెళ్ళయాక చూడ్డమే మానుకుందతణ్ణి ఆమె.

ఈ స్థితిలో రజస్వల అయిందామె.

స్త్రీ కంటికి కొత్త వెలుగు కనపడే దశ అది.

పరోక్షంలో వున్న భర్త రూపం స్ఫురిస్తూ వుండడమూ, మాటిమాటికీ చూపు అటు మళ్ళుతూ వుండడమూ, భావనలో యేదో మాధుర్యం పొడగట్టడమూ జరిగే సమయం అది; కాని సుందరమ్మ రజస్వల అయిందన్న శుభలేఖ పట్టుటకువెళ్ళిన పురోహితుడు, కిష్టప్ప సుస్తీగా వున్నాడన్న కబురు పట్టుకు చక్కావచ్చాడు, కాకినాడ నుంచి.

మరో రెండురోజులకు "అబ్బాయిని ఆస్పత్రిలో చేర్చారుషరా" అని చెబుతూ ఎగిరి కాకినాడ వెళ్ళిపోయింది ముసలమ్మ.

అదేమిటో యెందుకలా జరిగిందో చెప్పినవారెవరూ లేకపోయారు. యింకో రెండు దినాలకు కిష్టప్ప మరణవార్త తప్ప.

"అయినప్పుడు సుందరమ్మ అయినా దుఃఖం యెరుగునా?" అనడిగితే యేమిటి చెప్పడం?

ఇదేమీ ఆలోచించలేదు ముసలమ్మ

అసలు నీ పెళ్ళామే మార్చేస్తోంది దాన్ని నేనెరగనూ? అంటూ మళ్ళీ అందుకుందామె.

"ఎలా మారుస్తోందీ?"

"నేను చెప్పాలా?"

"... ...."

"ఈ మాత్రమూ గుర్తించలేవూ నువ్వూ?"

".. .. ......"

"ఇల్లు గుల్ల చేసుకుని చెప్పించాను. నీ చదువంతా యేమయిపోయిందీ?"

ఏమిటో అనుమానం.

ఎందుకో కంగారు

నోరు విప్పి తన తల్లి చెప్పలేని పాడుపనులేమయినా......

చర్రున కోపం వచ్చిందతనికి.

వూగిపోయాడు, దాంతో.

కాని తానందుకు పూనుకుంటే సుందరమ్మకాదు, భద్రమ్మ యెదురుకుంటుంది, తనని.

చల్లబడిపోయాడతను.

ముసలమ్మ అందుకుంది, అవ్యవధానంగా.

"నీ మామగారు వీరేశలింగానికి స్నేహితుడని లోకం అందరూ యెరుగుదురు"

"అయితే?"

"అయ్యో అయ్యో-"

"కాకపోయినా, యిప్పుడాయన లేరుగా?"

"మరి నీ మామగారు?"

"......... తప్పు తప్పు, ఎవరయినా వింటే బాగుండదు వూరుకో యీపాటికి"

"ఎందుకూరుకోవాలీ?"

"...... . ."

"ఎవడ్రా నాయెదుట నుంచి నీకిది తగదనగలిగేవాడు?"

"నువ్విలాంటి మాటలంటావు కనకనే నీకూ నీ కోడలికి పడకపోడం"

"పడకపోతే పడకపోతుంది పోనీ"

"..... ..... ."

"దానివల్ల నాకేం దిగబడిపోతుందీ?"

"...... . ..."

"నన్నేం చెయ్యగలదురా అదీ?"

"నువ్వు మాత్రం దాన్నేమి చెయ్యగలవూ?" అనుకున్నాడతను, మొగం అటు తిప్పుకుని.

"పోరి, అమ్మాయిని నేను కిష్టప్ప కిప్పించానని-"

"అవును"

"అక్కకీ బావకీ అప్రతిష్ఠ రావాలని-"

"అదేమిటి మళ్ళీ?"

"పిల్ల మనస్సు-"

"ఏమిటి పిల్ల మనస్సు?"

కొంచెం నిష్ఠురంగా అడిగాడీమాట.

"ఏమిటమ్మా నీ గోల?" అని కూడా అడిగాడు, పురపుర చూస్తూ.

"గోలకిందే కట్టేశావా నాది?"

"కట్టను, ఏమిటో చెప్పు, మరి"

"నిన్నగాక మొన్న వాక కోమట్ల పిల్ల, మళ్ళీ పెళ్ళి చేసుకుని మన వీధిలో వూరేగింది, 'నన్నే చూసుకో'మంటూ"

"ఊరేగింపెందుకోసం మరి?"

"సడే"

".......... ..."

"పోనీ దాని జోలి నాకెందుగ్గానీ - సంబరపడ్తూ చూశారు అమ్మాయీ నీ

పెళ్ళామూను, అరుగెక్కి"

"ఇంకెవరూ చూడలేదూ?"

"చూడకేం?"

"వాళ్ళు తలుపులు బిడాయించుకునే చూశారా, యింటో వుండి?"

"అదా యేమిటి మాట?"

"కాకపోతే మరేమిటి?"

"చూసి తక్కినవాళ్ళందరూ ఛీఛీ అన్నారు"

"అందరూనా?"

"అందరూనా అంటే అందరికీ కావాలా యేమిటి?"

"నీకు మాత్రం యెందుకూ?"

" .... "

"... ... "

"మన యింటి పద్ధతి బాగాలేదు కనక"

"బాగా లేనిదేమిటి?"

"అలా వికటంగా అడిగితే-"

"నీ వేదాంతం యేమిటో నా బుర్రకెక్కడం లేదు ఏమిటో పెంచుకుపోతావు గాని, అసలు సంగతి-"

"నువ్వు గ్రహించుకోవాలిగాని, యింతకంటే యేమి చెప్పనురా నేనూ?"

"చెప్పకపోతే చల్లగా వూరుకో నువ్వూ నీ కోడలూ ఏదో కుళ్ళు పెంచుకుంటూ మధ్య నన్నేడిపిస్తున్నారు. మీ యిద్దరి మధ్యా గానుగలో చెరుకులాగ నలిగిపోతున్నానునేను. మీ తగువులు తీర్చడం నావల్లకాదు"

టెన్నిస్‌బాటు చేతిలో వుందేమో యెదటివాడు కట్‌చేస్తే కోర్టులో లాగ వాక్కటే అంగవేశాడు, వీధిలో కతను.

"వెళ్ళిపోతావుట్రా" అంటూ గడపదాకా వెళ్ళింది, ముసలమ్మ; కాని అప్పటికపడే మళుపు తిరిగేశాడు కూడా.

"...... హరి చచ్చుపెద్దమ్మా, వెళ్ళిపోతావుట్రా. .... నీ దగ్గిర యింత చేవ వుంది కనుకనే వొంటికాళి భరతం ఆడుతోందా వగలాడి . అమ్మమ్మ నిట నే నీ నిర్భాగ్యుడికి. నా మనుమడు చచ్చి నేనేడుస్తూ వుంటే - రానీ చెబుతానూ"

ఇలా రుంజుకుంటూ అరుగుమీదే కణాయించుక్కూచుందామె.

## 4

"చూ-శావులే అమ్మా" అంటూ గునుస్తూ వచ్చింది సుందరమ్మ.

పిండివంట యేదో తయారుచేస్తోంది భద్రమ్మ, వంటింటి వసారాలో.

తదేక దృష్టితో చేస్తోంది.

కాగా, యిటు చూడకుండా "యేమిటమ్మా?" అనడిగింది అంత తొందరలో

కూడా గారాంగానే

"శాస్త్రులుగారు రాలేదుట"

"ఏ?"

"అవును"

"ఎందుకో?"

"పిలిచారుట కాని వెళ్ళిపోయారుట"

"ఏమో?"

"ఏమో"

"నాకేమనమ్మ నేనా యీ మాటలు?"

"అవును"

"అన్నీ వేషాలు ఆడదామనుకొంటోంది ఆట" అంటూ తల తాటించుకుంది చంద్రమ్మ చేతిలో వున్న పని ఆపి, గ్రీవాభంగాభిరామంగా చూస్తూ.

"ఉండకుండా వెళ్ళిపోయినప్పుడు వచ్చినా రానట్టే కాదా—"

"అనడిగిందా?"

"అడిగిందమ్మా"

"తర్కం అంతా కురిపించేసిందే!"

"జీతం జీతం అంటూ గొణుక్కుంటూ వెళ్ళిపోయారుట"

"ఆ మాట యెందుకు వచ్చిందో?"

"అడిగాను 'ఇంతకంటే పెద్ద జీతం వచ్చే పాఠం దొరికిందేమో మరి' అంది"

"అలాగేం? అంతా కల్పన. ఏవో పుల్ల విరుపు మాటలని—"

"పుల్లవిరుపు మాటలతో కుదిర్చిందో లేదో?"

"ఎన్నిమాట్లు పిలిచారో పాపం"

"పిలుపందకుండా తలుపు వేసేసిందేమో?"

"అంత జాణ కాదనా?"

"నిన్నూ పిలువరుట, తననీ పిలువరుట యెప్పుడు వచ్చినా నన్నే పిలుస్తారుట – విన్నావా?"

"అలాగా?"

"మేడమీద వసారాలో నుంచుని కనిపెడుతూనే వున్నాను నేను. అయితే, అది కాదని యిదీ, యిది కాదని అదీ ప్లేటు మార్చడంలో ఫోను దగ్గిర నాల్గైదు నిమిషాలుండిపోవలసి వచ్చిందొకమాటు. ఆ సందుబాట్లో జరిగి వుంటుందది"

"అంతే అంతే"

"సమయానికి నాన్నారు కూడా లేకపోయారింటో"

"రానియ్యి, అదేమిటో కనుక్కుంటాను"

ఒక్కక్షణం వూరుకున్నారిద్దరూ.

భద్రమ్మ పని అందుకుంది.

ఇంకో క్షణం వెనక్కి ముందుక్కి తక్కిళ్ళాడి 'ఇప్పుడు వాళ్ళు రామలక్ష్మికి పాఠం చెబుతూ వుంటాడు" అంది సుందరమ్మ సిగ్గు తెములుచ్చుకుంటూ.

"సోమశేఖరం మామయ్యగారి యింటికి వెళ్ళి వాళ్ళ లచ్చిగాణ్ణొక మాటు తీసుకురా నువ్వు"

"ఎందుకే అమ్మా?"

"నీకు పాఠం చెప్పడానికి భోజనం చేసి రాత్రి రమ్మని కబురు చేస్తాను, శాస్త్రులుగారికి"

దీనిమీద ఏదో అనబోయింది సుందరమ్మ; కాని సాహసించలేకపోయింది

పోనీ అంటే, అనకుండానూ వుండలేకపోయింది.

ఒక్కక్షణం వూగిపోయిందీ ద్వైవిధ్యంతో ఆమె.

ఉండుండి సాహసం చేసింది చివరికి; కాని "పోనీ–" అని మాత్రమే అనగలిగింది.

"ఏమంటావు తల్లీ?"

".. .. .."

"చెప్పవే అమ్మా?"

"నీకు తెలవదాయేమిటి?"

"ఈపని తొందరలో నాకేమీ తోచడంలేదమ్మా"

"మైసూరుపాకు చేస్తున్నావు కాదా యేమిటి?"

"చేస్తే?"

". .... . ."

"శాస్త్రులుగారికి–"

"ఏమో నాకు తెలవదు" అంటూ బుంగమూతి పెట్టుకుంది సుందరమ్మ మొకం అటు తిప్పుకుని.

ముక్కలు మరో పళ్ళెంలో పేరుస్తూ ఆలోచించింది భద్రమ్మ.

పని మానేసి దృష్టి యేకాగ్రం చేసుకునిన్నీ ఆలోచించింది.

"ఇంకేమిటీ మరీ?" అంటూ యిటు చూస్తూ అడిగింది అటు పేరుస్తూనే.

సుందరమ్మ కూడా సరిగా అప్పుడే అటు చూసింది, తల్లి వాలకం గుర్తిద్దామని.

ఇద్దరి కళ్ళు అభిముఖాలయినాయి

ఇద్దరి చూపులు కలిశాయి

ఇద్దరికీ వూహ కూడా అందింది.

"భోజనానిక్కూడా రమ్మంటాను, సరా?" అంది భద్రమ్మ.

సిగ్గు మరీ ముంచెత్తగా తలుపుచాటున నక్కింది సుందరమ్మ.

"అంత సిగ్గెందుకు తల్లీ యీ మాత్రానికి? మరీ లచ్చిగాణ్ణి తీసుకురా తొరగా" అంటూ మళ్ళీ పని అందుకుంది భద్రమ్మ.

ఓరచూపులు చూసుకుంటూ గుమ్మందాకా అడుగులో అడుగు వేసి, తరువాత వూచ అయిపోయింది సుందరమ్మ.

"వెర్రితల్లీ" అనుకుంది భద్రమ్మ అది గుర్తించి.

ఆ మాత హృదయం వుప్పొంగిపోయింది ఆ ముగ్ధ విలాసానికి.

## 5

మేడమీద పనుండి భద్రమ్మ మెట్ల దగ్గరికి వచ్చేటప్పటికి "ఉత్తరం రాశాడు మా బావ" అంటూ నాలుగు కాగితాలు చేతబుచ్చుకుని హాల్లోనుంచి వచ్చి కలుసుకున్నాడు రామబ్రహ్మం.

"ఏదీ?"

"ఇంగ్లీషులో రాశాడు"

"సీమ నుంచి యిప్పుడే వోడ దిగారు కామోసు దొరగారు"

"... ...... . . ."

"ఏమి రాశారింతకీ?"

జాబు చేత్తో పుచ్చుకుని ఆమె సంబరపడుతూ చదువుకుంటుందనుకుని రాలేదతను.

తాను చదివితే సావధానంగా వింటుందనుకునీ రాలేదు.

తరువాత యేమి చేసినా, ముఖ్యాంశం అయినా వినకపోదుగదా అని అతని ఆశ

రెండురోజులకోమాటు యిలాగ వుత్తరం మీద వుత్తరం వస్తే కొంచెమయినా ఆమె పస్తాయించకపోదనిన్నీ అతని నమ్మకం

"కనక, దారికి తీసుకురాలేకపో"మని అతని దిటవు కాని ఆమె మొగం చిట్లించుకోడం చూసి, వినకుండానే పైకి వెళ్ళిపోతూందేమో అన్న ఆత్రంతో "చాలాదూరం రాశాడు, పాపం" అన్నాడు జాలిగా.

"వారి పాపపుణ్యాల జోలి మనకెందుకూ?" అందామె ముక్కూ మూతీ తిప్పుకుంటో, అవ్యవధానంగా.

"కాకపయినా అంత దూరం కూడా కూడా రావడానికి నాకిప్పుడు తీరికా లేదు, ఓపికా లేదు" అనిన్నీ అంది, వెటకారంగా.

అంటూనే అడుగు ముందుకి వేసేసింది

"నుంచోవూ?"

".... ...... ........"

"మాట"

"ఏమిటా మాటా?"

ఆలస్యం చేస్తే యీ అవకాశం కాస్తా జారిపోతుందనుకున్నాడతను.

విషయం సూచిస్తే వాదానికయినా ఆమె సిద్ధపడుతుందనీ, ఆ సందర్భంలో కొంత కాకపోతే కొంత అయినా మనస్సు మార్చవచ్చుననిన్నీ అనుకున్నాడు.

"అమ్మాయి చదువు మాన్పించమని రాశాడు" అన్నాడు గభీమని.

ఇది విని, గభీమని వెనక్కి తిరిగి, యెక్కిన ఆ వాక్క మెట్టు నూడా దిగి, వురిమి చూస్తూ అతని యెదట నుంచుందామె, ముందు

చెయ్యి జాడించింది తల తాటించుకుంది "మానిపించంగాక మానిపించం అని రాసెయ్యండి వెంటనే" అంది తరవాత, వొత్తివొత్తి.

గతుక్కుమనిపోయాడతను

"అగ్గిపుల్ల గీసి ముందా వుత్తరం అంటించెయ్యండి వెళ్ళండి" అంటూనున్ను వురిమింది వీధికేసి దారి చూపిస్తూ.

వెళ్ళవలసినవాడే అతను కాని స్తబ్ధు డయిపోయి వుండడం వల్ల కదల్లేపోయాడు

"కొడుకు చచ్చాక గూడా తమ పెత్తనం యేమిటీ బోడి పెత్తనం?" అంటు రుంజుకుందామె కర్కుగ్గా చూస్తూ

"సబబే" అనిపించిందతనికి; కాని ఆ దురుసుతనానికి మాత్రం కించపడ్డాడు

ఆమెకి వుక్రోషం తీరలేదు

"లేనిపోనివి కల్పించి యేమిటేమిటో మీ అమ్మ వుత్తరం రాసి వుంటుంది ఇందులో ఆవిడ ప్రమేయం [illegible]ంత వుంది, నాకు తెలుసు పూర్తిగా"

"ఊళ్ళోవాళ్ళు [illegible] [illegible]స్తున్నారు"

"ఎందుకో"

"........"

"ఎవరెవరో?"

"........"

"ఏమనో?"

"చదువు మాన్పించడం యిష్టం లేకపోతే చెప్పడానికి ముసలి పండితులేవరూ దొరకలేదా—"

"చదువు మాన్పించమని కాదుగదా?"

"వాళ్ళ వుద్దేశం మాన్పించమనే. ముసలి పండితుల ప్రస్తావన మనం చేస్తున్నదానికి సవరణ"

"పనిలేని మంగలి యేమో చేశాడుట"

"..........."

"వెంకటదీక్షితులుగారి సోమిదేవి కాళ్ళకి జోడు తొడుక్కునీ, నెత్తిమీద గొడుగు వేసుకునీ నన్నే చూసుకోమంటూ మొగరాజులను రాసుకుంటూ కాలేజీకి వెడుతూ వస్తూ వుంటే నోరెత్తలేనివాళ్ళు—"

"అతనికి చెప్పి చూశారు"

"చూసి?"

". .......... వినకపోతే వాళ్ళేం చేస్తారూ?"

"మనమూ అంతే అయితే?"

# వెలం వెంకడు

## చాసో

వెలం వెంకడి కళ్లాం, పొలాలూ ఎంత దూరంనుంచైనా పోల్చుకోవచ్చు వాస్తవానికి పూర్వం కన్నా మరింత కళ కట్టి దిష్టికొడుతున్నాయి. ఒక చేతికి యింకొక చెయ్యితోడైన తర్వాత ఊరికే పోతుందా? అద్దంలా కళ్లాం,.కుక్క అయినా దూరలేకుండా కంచె, నీళ్ళతో జిమజిమ లాడుతూ చెరుకులు, అరటి బోదెలు కనబడతాయి. నల్లగా నిరారుగా తాటిమాని ఏతాం ఎంత దూరానికైనా ముచ్చటగా ఆనుతుంది ఇహ పొలాలు నల్లగా నూనెకక్కుతూ పెంట పోగులతో సాగుకి సిద్ధంగానైనా ఉంటాయి. పచ్చని చేలతో ఉయ్యాల లూగుతూ నేనా ఉంటాయి

పుట్టిన దగ్గర నుంచీ వెంకడు ఆ పొలాల్లోనే పెరిగాడు ఆ పొలాల గట్లంటే గోచీ అయినా లేకుండా గొఱ్ఱెపిల్లని మేపేవాడు దూడలకి గడ్డి దవిరించేవాడు పెద్దవుతున్న కొద్దీ వాడి ప్రాణం ఆ పొలాలకి కట్టుకున్న పెళ్లాంతో సహా పెనవేసుకుంది

పొలాలెంత కలకల్లాడుతున్నా యిప్పుడు వెంకడి కంతా వెలవెల్లాడుతున్నాది

వెనకటి వెంకణ్ణి ఇప్పటి వెంకణ్ణి గణితశాస్త్రరీత్యా అర్థం చేసుకోవచ్చు.

వెనకటి వెంకడు = వెంకడు+పొలం+పెళ్లాం పై మూడు పన. సుకు కలసిన మోకు వెంకడు. తొలికోడితో లేచి గుర్రు పెడుతూ నిద్రపోతున్న పెళ్ళాన్ని లెగ్గొట్టి పొలాల్లో పడేవాడు. రాత్రి మాటుమణిగాక కళ్ళం పరిశుభ్రంగా తుడుచుకుని, పెళ్ళానికెదురుగా చుట్ట కాలుస్తూ నులక మంచం మీద కూర్చుని సాలలో నెమరువేసుకుంటున్న దూడలని, సాల మీదకెక్కి చిక్కగా బలిసి వెన్నెలతో పంతం ఆడుతూ తెల్లగా వికసించిన ఆనపపాదుని తనవితో చూసుకుంటూ సేదతేరేవాడు.

అప్పటి వెంకడు = వెంకడు+పొలం-(పెళ్ళాం+కొడుకు). ఇంక పిల్లలు కలగరని నిశ్చయం చేసుకున్న తర్వాత మన్నుచేసి, నీళ్లు పోసే కొడుకుని మధ్య వయస్సులో న ..రాలు కంది. కలక్క కలక్క కలిగిన కొడుక్కి శ్రీకూర్మం కూర్మనాథుని పేరిట

కూర్మిగాడని ముద్దుగా నాయురాలు పేరు పెట్టుకుంది. ఊరంతా కూర్మినాయుడని పిలవడం మొదలుపెట్టేరు వెంకడికి మాత్రం కూర్మిగాడిలో కూరిమి కనపడలేదు. పుట్టిన దగ్గర నుంచీ వాడి వాళకం ఒక్కలాగుంది. తను ఏతాం తోడుతూ నాయురాలు చెరుకులకు నీరు పెడుతూ ఉంటే గుడ్డ ఉయ్యాల్లోంచి కిందికి జారిపోతూ, కిరకిరలాడుతూ ఒకటే ఏడుపు ఏడ్చేవాడు. అది ఏడుపు సంసారం కాదు వెంకడి కాళ్ళకింద నూతిగోడలు నాలుగూ కూర్మిగాడి ఏడుపును పులుగుపిట్ట స్వరంతో ప్రతిధ్వనించేవి. పిల్లాణ్ణి సముదాయిస్తూ పొలం పాటుకి నాయురాలు ఎగనామం పెట్టేది పొద్దస్తమానం కూర్మిగాడే నాయురాలి లోకం. వెంకడు కర్ర అందించమంటే, "చేతిలో పిల్లాడు కనబడ్డంలేదా?" అని కస్సుని లేచేది.

ఆ కూర్మిగాణ్ణి చూసి ఆ తల్లే మెచ్చుకోవాలి. కాస్తంత గుంట నాగమ్మ ఐఃగాక వాడు పొద్దస్తమానం బక్కురుకొచ్చిన గడ్డి ఒక్క దూడకైనా చాలేది కాదు. ఆ కూర్మినాయుణ్ణి ఊళ్ళోవాళ్ళే మెచ్చుకోవాలి. వాడు వేరుశనగకి గొప్పు తవ్వితే కొనలన్నీ తెగిపోయి పొలం అంతా సర్వనాశనమైపోయేది ఊరు ఊరంతా వాణ్ణి వెనకేసుకొచ్చేవాళ్ళే.

కూర్మిగాడు చేతికంది వచ్చిన కొడుకుట. చిన్నవాడైనా సంతలో బేరసారాలు వాడితో సమానంగా యింకొహరు చెయ్యలేరుట వంకాయిలు పోగులు పెట్టడంలో వాడిది అందె వేసిన చెయ్యిట ముదరవీ, పుప్పివీ కనబడకుండా పెట్టడం, ఉన్నవి తక్కువ కాయలే అయినా ఎక్కువగా కనబడేటట్లు సర్దడం, చూసీ చూడ్డంతో కొనబుద్ది పుట్టేట్లు నీళ్ళు జల్లినంత మెరుగు పెట్టడం కూర్మిగాడి కొక్కడికే తెలుసునట.

వెంకడు కూర్మిగాడితో వేగలేకపోతున్నాడు వాడి బ్రతుక్కి వాడు వెంకడికి సలహాలు చెప్పడమా? పదేళ్ళు నిండని గుంట వెధవ అరటిగెలలన్నీ ఒకేసారి కొట్టి బండిమీద పట్నం తోలుకెళ్ళి, పది రూపాయలు చేసుకొని పట్నంలో నాలుగూ కొనుక్కుని, పదంపాడుతూ బండి తోలుకురావటం వెంకడి అలవాటు. అలాగ కాదుట నాలుగేసి గెలలు కోసి దగ్గర సంతలకి కావిడేసుకుపోతే రూపాయికి రూపాయి లాభం వస్తుందని కూర్మిగాడి సలహా. ముష్టివెధవ సలహా. ఏ గాలీవానా అయినా వస్తే గెలలు కిందబడి ముక్కలైపోతే లాభం గూబల్లో కొస్తుందని తెలీదు.

రోజు మొత్తంలో ఒక్కసారైనా వాడితో కసాలా తప్పటంలేదు తెల్లారిందీ అంటే వాడు తెచ్చేదన్నమాటే జట్టీ.

"నాలుగు ఆనపకాయలు కోసియ్యి. చద్దికూడు తిని మంగళారం సంతకి ఒట్టుకెల్తాను" అని పొద్దున్నే కూర్మిగాడడిగేడు.

"ఏ పాదుని కోసేపాటి కాయటునేవు" అన్నాడు వెంకడు. నెమ్మదిగానే చెప్పేడు.

"నేకపోడమేటి? గట్టుమీద పాదుల్ని ఉన్నాయి. సాలమీదా ఉన్నాయి."

"నీకెలాగ తెల్సు?"

"నాను సూసినాను"

"సూసినావూ? ఇంక ఆటిపని అయింది. ఇంకా వోరం పోతేగాని కొయ్యడానికి కాయల్నేవు"

"ఆ కాయలిప్పుడే కొయ్యాలి. ఇప్పుడు కోస్తేనే కొనేవాళ్ళు కొంటారు. ఏపాటి ముదిరినా బాపనాళ్ళు కొ్రను ముచిక దగ్గిర గోరుతో గిల్లి ఆళ్ళు చూసుకుంటారు. నీక్కాయలెప్పుడు కొయ్యాలో తెల్దు శీ శీ" అని మొహం చిట్లించుకొన్నాడు కూర్మిగాడు.

వెంకడు అగ్గి అగ్గి అయిపోనాడు పది పన్నెండు పంటలు కళ్ళ చూడని వెధవ ఏభై ఏళ్ళు మళ్ళిన అయ్యని అంత మాటంటాడా? వెంకడు ఒక సంతచూశాడా? రెండు సంతలు చూశాడా? ఆనపకాయ లెప్పుడు కొయ్యాలో వాడికి తెలియదూ? పొలమీదా గట్లమీదా ఉన్న ఆనప పాదుల నిండా యిప్పుడిప్పుడే పిందెలు దిగుతున్నాయి. కొన్ని గంగా బొండాం కొబ్బరికాయలలాగ ఉన్నాయి వాటినిప్పుడు కోసీమంటాడు కుర్రకుంక. అవే నాలుగు రోజులు పోతే కడవలంత అవుతాయి కడవంత కాయకి అణాడబ్బులు రావు కొబ్బరికాయంత పింజకి ఎక్కువ డబ్బులు వస్తాయా?

"ఓరి గుంటగాడిదా! తాతకిరా దగ్గులు నేర్పుతావు? ఈ పాలి పాదుల్లో కెళ్ళు సెపుతాను. నీ కళ్ళు పడితే కాయలుంటాయా? అందుకే అన్నీ మురిగిపోతున్నాయి వాటి జోలికెళ్ళావా టెంకి మాడుతుంది" అన్నాడు వెంకడు.

"ఈపాలి నన్ను సంతకెళ్ళమను సెపతాను" అన్నాడు కూర్మిగాడు.

"మానీ. ఇంటికాడ కూకో, నానే ఎల్తాను"

"అనాగే కూకుంటాను. యవసాయం కూడా నువ్వే చేసుకో"

"ఓ అలాగే వెళ్ళు" అన్నాడు వెంకడు. సమయానికి దగ్గిర నాయురాలు లేదు ఉంటే మరింత కొంప అంటుకొనేదే. కూర్మిగాడు తిని తిరిగేవాడు. పొలంలో పూాతికపుల్ల ముట్టుకోవడం కూడా మానేసేడు. ఊళ్ళో ఊసుపోకపోతే స్కూల్లోకెళ్ళి అక్కడ చదువుకుంటున్న కుర్రవాళ్లని పోగుచేసుకొని బిళ్ళా-కర్రా ఆడుకొనేవాడు.

"కూసే గాడిద మేసే గాడిదని చెడగొట్టిందట. బడి చుట్టుపక్కల కీమాటొస్తే బడితె బాజా పట్టిస్తాను అలా తిరక్కపోతే నలుగురితోపాటు వచ్చి నాల్గు ముక్కలు నేర్చుకోరాదా?" అని బడిపంతులు చీవాట్లు పెట్టేడు.

"సెపతారా?" అన్నాడు కూర్మిగాడు.

"మేష్టరెందుకున్నారు? బళ్ళెందుకున్నాయి?" అని చెపుతూ కూర్మినాయుణ్ణి చెవి పట్టుకొని ఈడ్చుకెళ్ళి ఇసకలో అ, ఆలు రాస్తున్న పిల్లల దగ్గర కూర్చోపెట్టేడు.

మేష్టరుగారికి కూర్మిగాణ్ణి చూడగానే చక్కటాలోచన తట్టింది. [illegible] గ్గా చాకులా గున్నాడు. నాలుగు ముక్కలు చెప్పుతున్నట్టుంటే యింటి దగ్గ[illegible] నా చాకిరీ చేయించుకోవడానికి పనికొస్తాడు. వాడక్షరాలు అవలీలగా పట్టుకొన్నాడు. [illegible]కెలు చెప్పి పది పదులు చెప్పేసరికి అంకెలన్నీ యిట్టే పట్టేసుకొన్నాడు.

"నువ్వు బడికొస్తే చాలదు. యింటికి కూడా రా" అన్నాడు పంతులు. అంతవరకు ఏదో విరిగిపోయిన పలక, తన డ్రాయర్లో పుల్లలు యిచ్చి చదువు చెప్పేడు. ఇంక అలాక్కాదు. పుస్తకమూ పలకా కొనుక్కోమన్నాడు. ఇంటికి రమ్మన్నాడు.

కూర్మిగాడికి అయ్యతో మాటలులేవు. వాడు పనిపాట్లు మాని ఊరిపందిలా

తిరుగుతూ వుంటే వెంకడు కూకలెయ్యలేదు. నాయురాలు తండ్రికీ కొడుక్కీ జట్టీలు లేకుండా ఉన్నాయని సంతోషించింది. బడిలో కెళుతున్నట్టు బడిపంతులింటి కెళుతున్నట్టు కూడా ఆరాలు తీసింది. వాడేం చేస్తున్నదీ చూస్తూనే ఉంది

"నాను పుస్తకం పలకా కొనుక్కోవాలి, డబ్బులియ్యవా?" అని కూర్మిగాడు తల్లినడిగేడు.

"నువ్వు చదువుకెడుతున్నావా?" అని ఏమీ ఎరగనట్టడిగింది నాయురాలు.

"వచ్చి అడుగు"

"అయితే పద" అని నాయురాలు కొడుకుని వెంటబెట్టుకుని బడి కెల్లింది.

"మేష్టేరుబాబూ! మాయోడు సదువుతున్నాట్ట నిజమేనా?" అని అడిగింది.

"వాడ్ని పలకా పుస్తకం కొనుక్కోమన్నాను" అన్నారు మేష్టరుగారు.

"కొనమని పీక్కు తింటున్నాడు, ఆడికి సదువొస్తాదా."

"ఫస్టుగా వొస్తుంది, కొను"

"అయితే మీరే కొనండి బాబూ కాస్త ముక్క సెపుతే పంటనాడేటేనా యిచ్చుకుంటాను" అని మొల్లో డబ్బు తీసి మేష్టరుగారికే యిచ్చింది.

ఆవేళ కూర్మిగాడరుగు మీద కూర్చుని పుస్తకం చదువుతూ ఉండగా వెంకడు చూసేడు. అరటి మొక్కలకి నీళ్ళు తోడి తోడి జామాయించిపోయి వచ్చేడు.

"పుస్తకమే సదివేస్తున్నావేట్రో?" అని అడిగేడు.

"ఆపాటి సదువొచ్చు" అన్నాడు కూర్మిగాడు.

"ఎవడి బొక్కు ఎత్తుకొచ్చినావు?"

"ఎత్తుకు రావడం ఖర్మమేమి? నానే కొనుక్కున్నాను"

"ఎదవా! పిడతలో డబ్బులు నాకు సెప్పకుండా ఎత్తుకుపోయినావా?" అని కళ్ళెర్రజేశాడు.

"నానేమీ ఎత్తుకుపోనేదు, మా యమ్మిచ్చింది"

"ఒలే ఈడికి డబ్బులిచ్చినా?" అని పెళ్ళాన్నడిగేడు.

"ఆ, యిచ్చినాను" అని నిర్లక్ష్యంగా జవాబు చెప్పుతూ నాయురాలు గుడిశెలోంచి ఇవతలకొచ్చింది.

"మూడు వోరాల నుంచీ ఆడు పని సెయ్యడం లేదు. ఏమిరా ఎదవా నీకీ పోగాలం, అని అడుగుతావా? ఆడికి పుస్తకమోటి కొని బుగతల్లాగా సదువుకుంటూ కూకోమంటావా?"

"పొలంలో నువ్వూ - నేనూ పడుతున్న పాటు శానలే, సిగ్గనేక మల్లా ఆడి వూసెందుకెత్తినావు?"

"అయితే ఆణ్ణి తగలెట్టు" అన్నాడు వెంకడు. గ్రామంలో ముత్యాల నాయుణ్ణి మినహాయిస్తే రైతుదనంలో అంతా నిశానీగాళ్ళే. ఊళ్ళో ఎలిమెంటరీ స్కూలున్నా ఏ ఒక్కడికీ అక్షరం అబ్బటం లేదు. మళ్ళా కూర్మిగాడు తలెత్తి చదువులవాడయ్యాడు. ఊళ్ళో సగం రంగం ఉత్తరాలు చదవడం, రాయడం వాడివొంతుకొచ్చింది. ఊళ్ళో ఐదోక్లాసు

దాకా అయితే మూడు మైళ్ళ దూరంలో ఉన్న పెద్ద ఊర్లో ఎనిమిదోక్లాసు దాకా అయింది కూర్మిగాడు పట్నం వెళితే పనికొస్తాడని పదిమందీ అన్నారు పనికిరాదని వెంకడు మూర్ఖపు పట్టుపట్టేడు. కూర్మిగాణ్ణి వెనకేసుకొని ముత్యాలనాయుడితో సహా పెద్దలంతా వెకండిమీదకొచ్చేరు.

"నలుగురు సెప్పినమాట ఇని ఆణ్ణి ఇజానారం సదువుకి పంపు ఈయాళ మనోళ్ళకు ఎక్కళ్ళేని ఉద్యోగాలు వస్తున్నాయి ఈ పెద్ద పెద్ద మునసబీలు కలకటేరులు మనోళ్ళే ఏటనుకున్నావో! ఆడు సదుకురానీ, దోశెడు రూపాయలు బిళ్ళకుడుముల్లాగ గణిస్తాడు" అన్నారు వూళ్లో పెద్దలు

"సదువుకునోళ్ళకి ఉద్యోగాలు ఎక్కడివి ఆళ్ళంతా అగ్గురోరాల్లో వూరపందుల్లాగ తిరుగుతుంటే?" అన్నాడు వెంకడు వాడు కళ్ళారా ప్రపంచాన్ని చూసే అన్నాడు అగ్రహారాల్లో భూములన్నీ అమ్మేసుకు చదివి పదిరూపాయల ఉద్యోగానికి గతిలేక పడిగాపులు పడుతున్నారు

"ఆ మాటనకు మనకేటిరా ఆ సొకు తెస్తావు? ఈయేళ సెన్నపట్నంలో మంతిరి మన రాజుగారు" అన్నారు పెద్దలు

"వచ్చింది ఈ మాట మళ్ళా? సుద్దబద్దం రాజుగారేటి సెన్నపట్నం మంతిరేటి? అన్నోడికి బుద్దుందా? రాజుగోరు మంతిరేటిరా ఎదవల్లారా " అన్నాడు వెంకడు.

"ఓరి ఎర్రోడా నీకు తెలకపోతే సదువుకున్నోళ్ళనడుగు" అన్నారు పెద్దలు

"సదువుకున్నోళ్ళు అందం విన్నాను నాను నిశానీగాణ్నే అయినా పదికాలాలు సూచినాను రాజుగోరెక్కడా మంతిరి కాడు. మంతిరంటే రాజుగోరికిందివోడు తెలిసిందా? ఢిల్లీలోకెళ్ళినా యింతే. సదువుకున్నోళ్ళు సెప్పినా నాను నమ్మను. గేనమున్న ఎవడు నమ్మడు ఇది సదువుకున్నోడి అబద్దం. ఆళ్ళబద్దాలు దేశాలు దాటిపోతాయి రాజుగారు సెన్నపట్నం మంతిరి! ఇనాగే సెప్పండి సదువులు" అన్నాడు వెంకడు

"పసందైన కొడుకుని పాడుచేస్తున్నావు" అన్నారంతా.

"మీరు బాగు చెయ్యడానికి సెప్పినారు. ఆడు పెద్దోడైనాడు మనం సూసినాము. అందుకూ సెడతాడు ఇందుకూ సెడతాడు ఎప్పటికైనా మీనాగా నానాగా ఈడు దున్నుకు బతకవలసినోడే" అన్నాడు వెంకడు.

"ఆడే సదువుకుంటే యవసాయం సెయ్యాలా? నిన్ను కూకోబెట్టి కూడు పెడతాడు.

"కూకుడుంటే కూడు ఎలతాదా? బూమిని బద్దలు చేసుకు బతకమన్నాడురా నిన్నూ నన్నూ బెమ్మదేముడు" అన్నాడు వెంకడు.

"నువ్వు బూమి బద్దలు చేసుకుంటూ సవ్వు నా కూర్మిగాడు పట్నం ఎళతాడు" అని గుడిశెలోంచి మాట బాణీలో 'నువ్వు పంపితీరాలి సచ్చితీరాలి' అని నాయురాలు ధ్వనించింది

"ఓలెళ్ళే ఇక్కణ్ణుంచి" అన్నాడు వెంకడు.

"అందరూ ఎళ్ళండి" అని మెడ తణువుకుంది నాయురాలు. నాయురాలి మెడనిండా మెడ తిరగని బంగారం అందరికళ్ళకి పచ్చగా కనపడ్డాది.

వెంకడు పెళ్ళాన్నీ పెద్దలనీ తీక్షణంగా చూశాడు చంటికుర్రాడిలాగ ఒక్క పిల్లిగంతువేసి సంతోషంతో నవ్వుతూ ఒక్క చిటిక వేసేడు.

"మా గనమైన ఆలోశన తట్టింది. దెబ్బతో బుద్ది మారిపోయింది ఎళ్ళండ్రా అంతా ఎళ్ళండి కూర్మిగాణ్ణి నానే పట్నం అంపుతున్నాను, మరి జట్టీ నేదు" అన్నాడు వెంకడు.

మర్నాడు కూర్మినాయుణ్ణి వెంకడే పట్నం చదువుకి పంపించేడు. పనులన్నీ పూర్తి అయినాక కళ్ళాంలో చుట్టకాలుస్తూ పెళ్లానికెదురుగా నులకమంచం మీద కూర్చున్నాడు కొడుకు పట్నం వెళ్ళిపోయాడని కొంచెం దిగులున్నా నాయురాలు మొగుడే పంపాడని సంబరపడుతున్నాది

"ఈ రేత్రి నా [illegible] మనసు నాగున్నాది" అన్నాది నాయురాలు.

"నా మనసూ [illegible]నసు నాగుంది" అన్నాడు వెంకడు.

# ఎందుకు పారేస్తాను నాన్నా

చాసో

చెల్లిని వొళ్ళో కూచోపెట్టుకుని కృష్ణుడు వంటింట్లో కబుర్లు చెప్పుతున్నాడు. వాళ్ళ నాన్న పిలిచి చుట్టలు తెమ్మని డబ్బులిచ్చాడు.

కృష్ణుడు వీధి ముఖం చూడకండా, మొగుడు చచ్చిన విధవలాగ ఇంట్లో దూరి కూచుంటున్నాడు. నాన్న చుట్టలు తెమ్మని పురమాయించేడు. హైస్కూలు దాటి చుట్టల దుకాణానికెళ్ళాలి. మేస్టర్లు, తోటి విద్యార్థులు అక్కడుంటారు కృష్ణుడికి రోడ్డెక్కడమే నామోషీగా ఉంది. బడి పక్క నుంచి ఎలాగ వెళ్ళడమని గింజుకుంటూ బయలుదేరేడు.

ఉదయం ఎనిమిది గంటలు కావొస్తున్నాది. బడిపెట్టేవేళ, వీధి చివర నుంచే బడిగోల సముద్రపు ఘోషలాగ వినపడుతున్నది. బడి పక్క నుంచి వెళ్ళక తప్పదు; రాక తప్పదు.

బడి కనబడగానే కృష్ణుడికి బెంగ పట్టుకుంది. హైస్కూలు పిల్లల గందరగోళంతో కలకల్లాడుతున్నాది. వరండాలు, గదులు, చుట్టూ రోడ్లూ, విద్యార్థులతో విద్యార్థినులతో చూడ సొంపుగా ఉంది. రోడ్డు వారగా కృష్ణుడు తలొంచుకుని పరిగెట్టాడు.

"కృష్ణా!" అని స్కూలు వరండాలోంచి కేకొచ్చింది. కృష్ణుడు తిరిగి చూడక తప్పింది కాదు. నరశింహం పరిగెట్టుకొచ్చి వాడి భుజం మీద చెయ్యేసి-

"ఏంరా, నువ్వు బళ్ళోకి రావడం లేదు?" అనడిగేడు.

"సోమవారం చేరుతాను." అని కృష్ణుడు చెప్పేడు.

"పుస్తకాలు కొన్నావా?"

"ఇంకా లేదు"

"వేగిరం కొనుక్కో, మళ్ళా అయిపోతాయి. ఎక్సరుసైజు పుస్తకాలు షాపుల్లో కొనకేం! స్టోర్సులో చవగ్గా ఉన్నాయి. ధరలన్నీ దారుణంగా పెరిగిపోయాయిరా!"

నరశింహం డబుల్ కప్పు చొక్కా హనావా పేంటూ, జోళ్ళూ తొడుక్కుని నీటుగా ఉన్నాడు. కృష్ణుడికి ఉన్న బట్టలన్నీ రెండు నిక్కర్లు; రెండు చొక్కాలు; ఉన్నాయంటే ఉన్నాయి. ఒక నిక్కరుకి పోస్టాఫీసుంది. ఒక చొక్కా భుజం చిరిగి జారిపోతే వాళ్ళమ్మ ఎత్తి కుట్టింది. చెయ్యి బుట్టలాగ లేచిపోయింది రేవుకో జత. కృష్ణుడు పేంటు కుట్టించమని ఎప్పుడూ ఏడవలేదు. పేంటుకైతే బట్ట ఎక్కువ పడుతుంది. బట్ట ఎక్కువైతే డబ్బు

ఎక్కువవుతుందని వాడికి తెలుసు. మరి రెండు జతలు కుట్టించమని బతిమాలుకున్నాడు. కాళ్ళావేళ్ళా పడ్డాడు. ఏడ్చుకొన్నాడు. ప్రయోజనం లేకపోయింది.

నరశింహం చంకలో కృష్ణుడికి కొత్త పుస్తకం కనబడ్డాది.

"ఏం పుస్తకంరా అదీ." అనడిగేడు

"ఇంగ్లీషు పుస్తకం. నేనన్ని పుస్తకాలూ కొనేశాను. జాగ్రఫీ పుస్తకమే కొనలేదు. జాగ్రఫీ పుస్తకాలింకా స్టోర్సువాళ్ళకి రాలేదు. చూడు పుస్తకం" అని ఇచ్చేడు.

కృష్ణుడు పేజీలు తిరగేశాడు. కొత్త పుస్తకంలోంచి ఒక విధమైన పరిమళం పైకి వచ్చింది. కృష్ణుడు పుస్తకంలోకి మొహం పెట్టి వాసన చూశాడు.

"కొత్త పుస్తకం వాసన బాగుంటుంది కదరా?" అన్నాడు నరశింహం.

"కమ్మగా ఉంటుంది నాకెంతో ఇష్టం" అన్నాడు కృష్ణుడు.

"నీ కింగ్లీషులో ఫస్టు మార్కు రాలేదు కదరా?"

"నాలుగు మార్కుల్లో పోయింది"

"ఎవరి కొచ్చిందిరా?"

"శకుంతల కొట్టేసింది"

"నిజమే? నేన్నమ్మలేదు దానికెన్నొచ్చాయి?"

"నా కర్రవె నాలుగు, దాని కర్రవె ఎనిమిది"

"ఆడపిల్లని మేష్టరు వేసీసుంటాడు"

"నీ మొహం? అది తెలివైంది".

"తస్సా చెక్కా? ఆడపిల్లలు చదివేస్తున్నారురా?"

కృష్ణుడు మార్కుల గొడవ తేగానే గొప్పవాడయిపోయాడు. తెలివైనవాడు కాబట్టే నలుగురూ గౌరవిస్తున్నారు. లేకపోతే వాడి కుళ్ళు గుడ్డలని చూసి అంతా దూరంగా ఉండేవాళ్ళే. వాడికి బడిపక్కని నిలబడడం, బడికెళుతున్న నరిశింహాన్ని చూడడం చాలా కష్టంగా ఉంది. ఎంచేతంటే కృష్ణుడు బడికెళ్ళి చదువుకొనే అవకాశాలు తప్పిపోయాయి. వాళ్ళ నాన్న ఈ యేడాది కృష్ణుడికి చదువు చెప్పించనని నిశ్చయంగా చెప్పేశాడు.

"ఎక్కడేనా చదువు మాన్పించుతారండీ? ఋణమో ఫణమో చేసి ముక్క చెప్పించకపోతే కుర్రాడెదుకేనా పనికొస్తాడా? చదువుకునే ఈడులో బడి మానిపించి, ఇంట్లు కూచోబెడితే తరువాత గాడిదలని కాయడానికేనా పనికిరాకుండా పోతాడు. ఏదో చూసి బడిలో వెయ్యండి." అని వాళ్ళమ్మ శతపోరి చెప్పుకొస్తున్నాది.

బళ్ళో వెయ్యగానే సంబరమా? వాడు చదివేది ఫోర్తుఫారమ్. జీతమెక్కువ. నెలనెలా ఎంత కట్టాలో తెలుసా? తూగ్గలనా? ప్రవేశ పెట్టడానికి, పుస్తకాలకే ఔతుంది ఏభై రూపాయలు. దస్త్రా కాగితాలు రూపాయి అర్ధణా. పెనసలు అరణాలు? ఎక్కణ్ణుంచి తేవడం! మొహాన్ని వాడికి లేందే? వాడి ప్రారబ్ధం, మన ప్రారబ్ధం! వారం వారం ఎక్కడలేని డబ్బా బియ్యానికి ముడుపు చెల్లించడానికే తలప్రాణం తోక్కొస్తున్నాది. మాటలా?" అని వాళ్ళ నాన్న చెప్పుకొస్తున్నాడు.

తల్లి మాటే నెగ్గుతుందో, తండ్రి మాటే నెగ్గుతుందో ఇంకా తేలలేదు. కృష్ణుడికి మాత్రం సందిగ్ధం లేదు. వాడు తల్లిదండ్రులని బాగా ఎరుగు, తల్లి ప్రతీ విషయంలోనూ బడబడలాడడమే కాని ఆఖరికి తండ్రి చెప్పినట్టే జరుగుతూ ఉంటుంది. అంచేత చదువుకి స్వస్తి చెప్పడమే ఖాయమని నిర్ధారణ చేసుకొని నామర్దాతో కృష్ణుడు కుళ్ళిపోతున్నాడు.

కృష్ణుడికి కొత్త ఇంగ్లీషు పుస్తకం పేజీలు తిరగేసిన కొద్దీ గుండెల్లో గాభరా పుట్టింది. చదువుతున్న కుర్రాళ్ళ మీద ఈర్ష్యా, తనకి చదువు లేకుండా పోయిందన్న దుఃఖము –

రెండూ రెండు చులేడిక పాములై అతని బుర్రని కరకరలాడిస్తున్నాయి

"కృష్ణా వేగం చేరరా! డివిజన్లు పెట్టేశారు. నేను 'జే' డివిజనులో పడ్డాను వాడ బేచివాళ్ళంతా 'జే' డివిజనులోనే పడ్డారు" అన్నాడు నరశింహం.

"అమ్మబాబో! 'జే' డివిజను దాకా పిల్లలున్నారా" అని ఆశ్చర్యపడ్డాడు కృష్ణుడు.

"జేతో ఐపోలేదు. 'కే' డివిజను కూడా ఉన్నాది"

ఏ, బి, సి, డి అని లెక్కబెట్టి – "పదకొండు డివిజన్లే" అన్నాడు కృష్ణుడు ఒక్క ఫోర్తుఫారములో సుమారు ఐదువందల మంది విద్యార్థులున్నారు. కృష్ణుడు అక్కడ నిలబడలేక పుస్తకాన్నిచ్చేసి "నేను చుట్టాలకెళ్ళాలి పోతా" నన్నాడు

"ఈ బొమ్మ చూశావట్రా?" అని నరశింహం పాఠానికి ముందున్న త్రివర్ణ చిత్రం తీసి చూపించేడు.

రైతులు జొన్నచేలు కోస్తున్నారు. రేకులని కూడదీసి కట్టుకొన్న పిట్టగూడు గుడ్లతో జారిపోతున్నాది చేలమీద రెండు పిట్టలు ముక్కులు విప్పి ఎగురుతున్నాయి కోతలవాళ్ళు తలలెత్తి పిట్టలని చూస్తున్నారు. అదీ త్రివర్ణ చిత్రం!

హైస్కూలు మొదటిబెల్లు ఖంగు ఖంగు మంటూ దూరంగా ఉన్న పిల్లలందరినీ పిలుస్తున్నాది రోడ్డు వరండాలు, గదులూ విద్యార్థులతో, విద్యార్థినులతో ఉపాధ్యాయులతో కలకల్లాడుతున్నాయి.

పుస్తకాలు పట్టుకుని సరస్వతీ దేవిలాగు శకుంతల వొచ్చింది. ఆమె చిన్నపిల్ల పదకొండేళ్ళది సూది ముక్కు, సూది గెడ్డం ఆ రెంటికీ పొందికయిన నోరు కలిగి ముద్దొస్తూ ఉంటుంది తెలివితేటల తళుకుతో దాని కళ్ళు [illegible]చల్యాన్ని పొందుతున్నాయి.

"కృష్ణ! ఇంగ్లీషులో ఫస్టు మార్కు నాది!" అని వొస్తూనే ఉడికించింది.

"ఒక్క ఇంగ్లీషులోనే కద! నాకు మూడింట్లో ఫస్టుమార్కులొచ్చాయి లెఖ్ఖల్లో నూటికి నూరు!' అన్నాడు కృష్ణుడు.

"ఇంగ్లీషు ముఖ్యమైందండీ!" అన్నాది శకుంతల.

"లెఖ్ఖలంతకన్నానండి ఆ మాటకొస్తే తెనుగు ముఖ్యమండి. తెనుగులో ఫస్టు మార్కెవరిదండి?"

"ఇంగ్లీషే ముఖ్యమండి ఎవరి నడుగుతావో అడుగు!"

"తెనుగేనండి బియ్యే వాళ్ళక్కూడా ఇంగ్లీషులో మానేసి లెఖ్కలు అవీ తెనుగులోనే చెప్పాలని పేపర్లో పడ్డాదండి"

"నువ్వు మహా పేపరు చదివి ఏడిశావు!"

"నేనాంధ్ర పత్రిక రోజూ చదువుతాను. మా యింటి దగ్గరవాళ్ళ కొస్తుంది"

రెండోబెల్లు కంగుఖంగుమని ప్రారంభమైంది.

నరశింహానికి శకుంతల మొహం చూడ్డానికి లజ్జ వేసింది. వాడు చదువూ సంధ్యా రాని దద్దమ్మ. వాళ్ళతో పాటు సంభాషించడానికి తాహతు లేక తల వాల్చుకుని మౌనవ్రతం పట్టేడు. తన హనావా పంట్లాము ధగధగలాడుతున్నా, కృష్ణుడి కుళ్ళు నిక్కరు కనబడుతున్నా వాడికి తక్కువతనం పట్టుకుంది. రెండో బెల్లు కాగానే చల్లగా బడిలోకి జారిపోయాడు.

"బెల్లయింది బళ్ళోకి రా!" అన్నది శకుంతల.

"నేను సోమవారం నుంచి వస్తాను" అన్నాడు.

"ఫోర్తుఫారమ్‌లో నీపని చెపుతాను. ఒక్క ఫస్టు మార్కు రానివ్వను"

"ఇహనన్ని ఫస్టుమార్కులూ నీవేలే!".

"ఏం?"

"ఏమీ లేదు"

"నువ్వు మా యింటికి రావడం మానేశావేంరా? మా అమ్మా, నాన్నా 'కృష్ణుడు రాలేదేమా' అని రోజూ అంటారు"

"ఏమీ లేదు"

"నేను బళ్ళోకి పోవాలి బాబూ!" అని పరిగెట్టింది

"శకుంతలా?" అని పిలిచాడు

"ఏం?" అని ఆగింది.

ఎందుకు పిలిచాడు? ఆమెతో నిజం చెప్పేసి దుఃఖోపశమనం చేసుకుందుకా, ఎందుకు పిలిచాడో వాడికే తెలియలేదు.

"ఏమీలేదు" అన్నాడు

శకుంతల వెళ్ళిపోయింది ఇద్దరూ ఒక్క ఈడువాళ్ళు. క్లాసుకి వాళ్ళిద్దరే అందరికన్నా తెలివైనవాళ్ళు. ఒకరి నోట్సు ఒకరు పుచ్చుకుంటూ స్నేహంగా వుండేవాళ్ళు పంతంతో చదివేవాళ్ళు శకుంతలతో పోటీ కృష్ణుడికి వికాసవంతంగా ఉండేది. శకుంతల దస్తూరి కృష్ణుడికి జ్ఞాపకమొచ్చింది. ఆమె దస్తూరీ మంచిదికాదు కొక్కిబిక్కిరిగా రాస్తుంది. అతనిది ముత్యాలకోవ

శకుంతల బడిలోకి పరిగెడుతుంటే కృష్ణుడు స్తంభించిపోయి చూస్తూ నిలబడి పోయాడు. పిల్లల గోలంతా క్రమేణా అణిగిపోయింది వరండాలన్నీ ఖాళీ అయిపోయాయి. మేష్టర్ల మాటలు ఉండుండి వినబడుతున్నాయి వేలకొద్దీ విద్యార్థులు డెస్కుల మీద వాలి కూచుని పాఠాలు వింటున్నారు. బడి దగ్గర నుంచి కృష్ణుడు కదలలేకపోయాడు తన చదువు పోయింది కదా అని కుమిలిపోతున్నాడు. ప్యూన్లు వరండాలో కెళ్ళాడు.

"నేనిక్కణ్ణుంచి కదలను" అనుకొని స్తంభానికి జేరబడ్డాడు

"నేనింటికే వెళ్ళను" అని నిశ్చయించుకున్నాడు.

నాలుగో క్లాసు దగ్గర నుంచి బడిలో తను చదివిన ఐదేళ్ళ సంగతులూ ఒక్కొక్కటే జ్ఞప్తికి వొచ్చేయి ఐదవక్లాసు చదువుతుండగా ఒక పిల్లడు కృష్ణుడు మీద మేష్టరుతో చాడీలు చెప్పేడు. మేష్టరు నమ్మక అబద్ధాలు చెప్పేడని వాణ్ణే చితక తన్నేడు. మూడవ ఫారంలో తెలుగు మాష్టరు "గాంధారపతి" అంటే అర్థం చెప్పమన్నాడు. అంతా నేలచూసి ఇంటికప్పు చూసి ధృతరాష్ట్రుడని చెప్పేరు తనొక్కడే "గాంధార దేశపు రాజు" అని చెప్పేడు.

రెండవ ఫారం చదువుతుండగా దసరా తరువాత ఒక కుర్రాడు బడికి రావడం మానేశాడు వాడి పేరు రోజూ పిలిచి మేష్టరు ఆబ్సెంటు వేస్తూ ఉండేవాడు. ఆఖరికి వాడు చదువు మానేశాడని తెలిసింది ఆవేళ అటెండెన్సు రిజిష్టర్‌లో వాడి పేరు కొట్టేసి మేష్టరు "డిస్కంటిన్యూడ్" అని రాసి ఆ ఇంగ్లీషు మాటకి అర్థం క్లాసులో చెప్పాడు. ఆనాటి నుండి కృష్ణుడు "డిస్కంటిన్యూ" అన్న మాటకు అర్థం మరచిపోలేదు. ఆ పదం జ్ఞాపకం రాగానే అతనికి దుఃఖం పొర్లుకుంటూ వొచ్చింది.

"నే నింటికే వెళ్లను" అని పునఃనిశ్చయించుకొన్నాడు.

"నేను భోజనానికే వెళ్ళను" అనుకున్నాడు.

అతని మొహం గాలికొట్టిన కొత్త ఫుట్‌బాలు లాగ దుఃఖముతో పొంగి కందగడ్డ అయిపోయింది. ముక్కు నీటితో బరువెక్కి దిబ్బడేసి పోయింది. ముక్కు ఎగబీల్చుకొంటూ పొంగుకొస్తున్న దుఃఖానికి ఆనకట్టలు కట్టి దిగమింగుతూ స్తంభానికి జేరపడిపోయాడు

మొదటి పీరీడై పోయింది. కృష్ణుడు కదలలేదు. వాళ్ళ నాన్న బజారుకి బయలుదేరేడు వరండాలో కొడుకుని చూశాడు.

"ఓరి వెధవా! చుట్టలు తెమ్మంటే ఇక్కడ దిగమారేవేం?" అన్నాడు

"చూడు!" అన్నాడు కృష్ణుడు.

"ఏమిట్రా చూడ్డం?" అన్నాడు తండ్రి.

"పాపం. కనబడదు!"

"ఏమిటిరా నీ శ్రాద్ధం?"

"నా శ్రాద్ధమే!"

"ఏమిటిరా?"

"వాళ్లంతా బడికెళ్ళారు!"

అప్పుడు తండ్రికి కొడుకు మొహంలో విచార రేఖలన్నీ కనబడ్డాయి.

"వెర్రి నాగమ్మా అదిరా!" అన్నాడు కృష్ణుడికి ఆనకట్టలు తెగ్గొట్టుకుని దుఃఖం కొట్టుకొచ్చింది. వెక్కి వెక్కి చుట్టుకుపోతూ ఏడుపు మొదలెట్టేడు కొడుకు బాధంతా తండ్రికి బోధపడ్డాది. కొడుకు బాధంతా తండ్రి పడ్డాడు.

"చదువు మానిపించానని అంత బాధపడుతున్నావా? బడి వరండాలు పట్టుకుని దేవుళ్ళాడుతున్నావా నాయనా? పద ఇంటికి!" అన్నాడు

"నేన్రాను!" అని భూమి బద్దలై పోయినంత గట్టిగా అరిచేడు.

"ఏం చేస్తావురా?"

"గోడకేసి బుర్ర బద్దలు కొట్టుకుంటాను!" అని ఇంకా గట్టిగా అరిచేడు. అంతపనీ చేస్తాడేమోనని వెళ్ళి తండ్రి కౌగలించుకొన్నాడు.

"పద నాయనా ఇంటికి!" అన్నాడు.

"బడి నాది!" అని గట్టిగా కేకేశాడు.

"నీదేనురా బాబూ!"

"బడిలోకి తీసికెళ్లు మరి"

"తల తాకట్టు పెట్టుకునేనా బళ్ళో వేస్తాను. ఇంటికి పద"

"ఇప్పుడే వెయ్యి!"

"డబ్బు చూసి వేస్తాను"

"ఇంటికెళ్ళి లేదంటావు"

"అన్నురా!"

"ఐతే పుస్తకాలు ముందు కొను!"

"వెర్రి నాయినా! వాటికి మాత్రం డబ్బొద్దూ?"

"ఒక్క పుస్తకం కొను"

"ఏ పుస్తకం కొనమన్నావు?"

"ఇంగ్లీషు పుస్తకం కొను!"

"కొందాం పద. ఏడవకు నాయినా, నేను చచ్చిపోయాను ఏడవకు!" అన్నాడు తండ్రి. తండ్రి చెయ్యిని చంకలో పెట్టుకొని గిలగిల కొట్టుకొని ఏడుస్తూ బడిలో స్టోర్సుకి తోవతీశాడు. తండ్రి దీర్ఘంగా ఆలోచించాడు. చుట్టలు మానేద్దామనుకొన్నాడు. ఎంత మానుదా మనుకొన్నా మానలేకపోతున్నాడు. చుట్టలు మానేస్తే కృష్ణుడి జీతానికి సరిపోతుంది! ఇంకో విధముగా పాలుపోలేదు.

"ఇందాకా చుట్టలకిచ్చిన డబ్బులున్నాయా పారేశావా?" అనడిగేడు కొడుకుని.

"ప....ప్ప ..ప్పారేలేదు, జేబులో ఉన్నాయి.... ఎందుకు పారేస్తాను నాన్నా?" అన్నాడు కృష్ణుడు.

# జ్యేష్ఠుడు

## వి.యస్. అవధాని

శేషుకు తన బ్రతుకంతా వర్థి తిట్లూ దెబ్బల గుణింతంలా కనబడింది. ఎంత ఆలోచించినా అమ్మా, నాన్నా, బళ్ళో పంతుళ్ళూ - వీళ్లంతా యింత నిర్దయగా ఎందుకు తనపట్ల ప్రవర్తిస్తున్నారో అతడి చిన్నబుర్రకు అర్థం కాలేదు.

తను యింటికి జ్యేష్ఠుడు. అది నిజమే. మొదట పుట్టినవాళ్ళందరు తన మాదిరిగా ఇంట్లో అమ్మచేత, బళ్ళో పంతుళ్ళచేత దెబ్బలు తినవలసిందేనా? మంచి పిల్లలను ఎవరూ కొట్టరని అంటారు. కాని మంచిగా వుండడం ఎలా? అమ్మకు మంచి పనయింది నాన్నకు మంచిపని కాదు. వీళ్ళిద్దరికీ మంచి పనులు చేసి పెడుతూంటే పాఠాలు రావు. పాఠాలు రాని పిల్లలు పంతుళ్ళకు మంచివాళ్ళు కారు. కనుక పంతుళ్లు, అటువంటివాళ్ళను తంతారు. తన్నకపోతే పిల్లలకు భయం ఉండదంటారు. శేషుకు భయం వున్నది. పాఠాలు చదవాలని కూడా వున్నది. చదివితే - అసలు చదవడానికి తీరిక కనేదంటు వుంటే, తన క్లాసులో తనకంటే ఎవరికీ మంచి మార్కులు రావు.

ఎటొచ్చీ పరీక్షలు జరిగే రోజులలోనూ పరీక్షల ముందూ తనకు ఇంట్లో యెవరూ ఏ పనీ చెప్పరు. కనుక ఆరోజులలో తనకు కొంచెం తీరిక. ఆ రోజులలో శేషు కొంచెం కష్టపడి పాఠాలు చదువుతాడు. ప్రతి సబ్జక్టులోనూ మంచి మార్కులేవస్తవి. ఇంతవరకూ యే తరగతిలోనూ తప్పిపోలేదు. కనుక తనకు చదువు రాదన్న భయం నాన్నకు లేదు. కనుక అమ్మ ఏ పని చెప్పినా నాన్న వద్దనడు. పైగా "బజారుకెళ్ళి సిగరెట్లు తీసుకురా, ఇంట్లోకి చింతపండు తీసుకురా!" అంటాడు. అయితే నాన్న ఎందుకు కొడతాడంటారా? పెన్సిళ్ళు పోతే కొడతాడు. పుస్తకాలు కావాలంటే విసుక్కొంటాడు. ఈ చిక్కులు తమ్ముడికి లేవు. చెల్లాయికీ లేవు వాళ్ళు చిన్నవాళ్ళు. వాళ్ళంటే అందరికీ యిష్టం. అదీకాక అసలు వాళ్ళచేత అమ్మా నాన్నా ఏ పనీ చేయించరు. కనుక ఆ పని వాళ్ళు బాగా చేస్తారో లేదో శేషుకు తెలియదు. చేస్తే బాగానే చేస్తారని అమ్మకూ నాన్నకూ తెలుసేమో!

అందుచేతనే వాళ్ళను కొట్టరు

ఇవి మామూలుగా శేషు నెదుర్కొనే సమస్యలు ఇవిగాక మరికొన్ని ప్రత్యేక సమస్యలున్నవి ఆ సమస్యలు వచ్చినప్పుడు శేషు ఒక్కొక్కసారి అమ్మగా మారిపోవాలి; మరొకసారి నాన్నగా మారిపోవాలి అంటే, వాళ్ళు చేసే పనులన్నీ చెయ్యాలి ఆ పనులు బాగా చేస్తే మెచ్చుకునేవాళ్ళు లేరు గాని అజాగ్రత్తగా చేస్తే దండించేవాళ్లు మాత్రం చాలామంది ఉన్నారు చివరికి చెల్లాయీ తమ్ముడూ కూడా ఎగతాళి చేస్తారు

☆ ☆ ☆

ఇంకా తెల్లవారలేదు

ఉయ్యాలలో పాప గీ పెడుతున్నది "పెద్దవాడా . పెద్దవాడా" అమ్మ పిలుస్తున్నది శేషు ఇంకా మంచం మీద నుంచి లేవలేదు అమ్మ మళ్ళీ అంటున్నది :

"పెద్దవాడా . . . ఏమిట్రా ఆ మొద్దునిద్ర లే " శేషుకు కళ్లు తెరుపుడు పడడం లేదు అలాగే కళ్లు నులుపుకొంటూ బద్దకంగా మంచం మీద నుంచి లేచాడు అంతలో అమ్మ మళ్ళీ "కాస్త ఆ దణ్ణెం మీద నల్లచీర ఇటు పడెయ్యి" అంటున్నది శేషు తలెత్తి చూచాడు. అమ్మ వరండాలో నుంచున్నది శేషుకు నిద్రమత్తు పూర్తిగా వదిలింది

శేషు నల్లచీర అమ్మ దగ్గరకు విసిరివేసి మళ్ళీ మంచం దగ్గరకు వెళుతూండగా అమ్మ అన్నది కదా :

"మళ్ళీ పడుకుంటావేంరా? కాజీ వస్తున్నది లేచి కాస్త అంట్లూ చెంబులూ బయట పడెయ్యి ఇవాళ వీరాస్వామి వూళ్ళోలేడు పాలు తియ్యాలి లే తెల్లవారిపోతోంది"

శేషు నసుగుతూ ఉయ్యాలలోనించి పాపను తీసి నేలమీద పడుకోబెట్టాడు. అమ్మ దగ్గరకు తాను వెళ్ళకూడదుగా! ఆ తరువాత నెమ్మదిగా వంటింట్లోకి ప్రవేశించాడు అంట్లూ చెంబులూ దొడ్లో పంపు దగ్గర పడేశాడు.

అమ్మ రాత్రి తోమి అలమారులో పెట్టిన చెంబులో కొంచెం నీళ్ళు పోసుకుని బర్రె దగ్గరికి వెళ్ళాడు దూడను వదిలాడు పాదుగు వంక జాగ్రత్తగా చూస్తున్నాడు ఎంత జాగ్రత్తగా చూచినా దూడ కాసిని పాలు తాగిపోతుంది. అమ్మ తనని తిడుతుంది ఎలాగో తంటాలు పడి పాలు తీశాడు ఆ తరువాత పండ్లపొడి చేతిలో వేసుకొని పండ్లు తోమడానికి పంపు దగ్గరకు వెళ్లాడు పండ్లు తోమడం ప్రారంభించాడు పండ్లు తోముకుంటూ ఆలోచిస్తున్నాడు. ఎన్ని ఆలోచనలని? ఇంట్లో పని తనెందుకు చెయ్యాలి? అందులోను ఆడపిల్లలు చేసే పని కూడా చెయ్యాలా? పిల్లలకు నీళ్ళు పోసి అన్నాలు పెట్టడం, వంట చెయ్యడం, ఇవన్నీ వాళ్ళ సుబ్బారావు చేస్తున్నాడా, పోనీ లలిత ఆడపిల్ల కదా! లలిత చేస్తున్నదా?

వాళ్ళందరూ బడి వదిలిన తరువాత ఎంత హాయిగా ఆడుకొంటారూ! తానో బడి వదలగానే ఇంటికి రావాలి. కాజాబీబీ రాకపోతే ఇంట్లోకి నీళ్లు తీసుకురావాలి అమ్మ బయట వుంటే కాలవ నుంచి మంచినీళ్ళు కూడా తీసుకురావాలి? ఇవన్నీ తనెందుకు

చెయ్యాలి? తమ్ముడు చెయ్యరాదా? చెల్లాయి చెయ్యరాదా?

అంతలో అమ్మ వేసిన కేలకు అదిరిపడి పండ్లు తోమడం పూర్తి చేశాడు. పాపకు పాలు పట్టాడు. తమ్ముడూ చెల్లెలూ అంతలో అన్నానికి సిద్ధమయినారు వాళ్ళకు అన్నాలు పెట్టాడు కుంపటి మీద నీళ్ళు పెట్టి పంచదార పానకంలాగ కాఫీ చేసి అమ్మకు తమ్ముడిచేత పంపించాడు ఆ తరువాత గబగబా పంపు దగ్గరకు పోయి నాలుగు చెంబులు నీళ్ళు పోసుకుని వచ్చాడు. అన్నం తినేటప్పటికి గోడ గడియారం ఎనిమిది కొట్టింది. ఇంకా హోమ్‌వర్కు లెక్కలు చెయ్యాలి. తెలుగు పద్యం ఒక్కసారైనా చదవాలి.

మధ్యాహ్నం తను బడి నుంచి వచ్చేలోగా పాపకు పాలో? అమ్మకు అన్నమో? అబ్బ! ఇవన్నీ ఎవరు చేస్తారులెమ్మనుకొని శేషు పుస్తకాలు సర్దుకొని బడికి బయలుదేరుతుండగా అమ్మ అన్నది :

"మధ్యాహ్నం పిల్లలేం తింటార్రా? త్వరగా పొయ్యి రాజేసి అన్నానికి ఎసరు పెట్టు. ఆ పొయ్యి అంటుకోగానే రెండో పొయ్యి అంటించి పప్పు దాని మీద వెయ్యి. ఇంకా చూస్తావేం? బడికి టైం కావటం లేదూ?"

బడి తను బడికి వెళ్ళాలి, చదువుకోవాలి ఓహ్ .. మంచి మార్కులు సంపాదించాలి.. . ఇవన్నీ తన సంగతులేనా అనిపించింది శేషుకు

"ఇంకా కదలవేం" అని మళ్ళీ అమ్మ గద్దించింది. శేషు వంట ఇంట్లోకి మళ్ళీ ప్రవేశించాడు పొయ్యి రాజెయ్యాలి. అది రాజితేగదా? అమ్మ చాలా తొందరగా పొయ్యి రాజేస్తుంది ఎట్లా? ఒక చిన్న పిడకమీద కొంచెం కిరసనాయిలు పోసి దానికి నిప్పంటించి దానిమీద చిన్న చిన్న పుల్లలు పెడుతుంది. తానూ అలాగే చేశాడు. అహ. . .. పొయ్యి రాజుకుంటేనా? ఇట్లా కాదని చిన్న కిరసనాయిలు డబ్బా తెచ్చి ఒక్కొక్క కట్టెపుల్లని అందులో ముంచి, వాటన్నింటినీ పొయిలో పెట్టి నిప్పుపుల్ల గీసి వాటికి అంటించాడు గప్పున మంట పైకి వచ్చింది. ఇంక నయం. కొంచెంలో తప్పిపోయిందిగా లేకపోతే క్రాపింగుకు నిప్పు అంటుకోవాల్సింది. ఎసరు పెట్టి వండడం ఆలస్యం అందుకని మూడుసోలల గిన్నెలో బియ్యంపోసి, కడిగి పొయ్యి మీద పెట్టాడు అంతలో మళ్లీ ఒక సంగతి గుర్తు వచ్చింది. ఎన్ని నీళ్లు పోశాడూ? అమ్మ ఏదో గుర్తు చెప్పింది అంటే ఐదువేళ్లు మునిగేవరకు నీళ్ళు పోయాలి. గిన్నె దింపి చూశాడు. నీళ్ళు అరచేతివేళ్ళవరకే వున్నవి. అమ్మయ్యో అనుకుని మళ్ళీ గిన్నెపొయ్యి మీద పెట్టాడు దాని దుంపతెగా, పొయి ఆరి వూరుకుంది. విసనకర్ర తెచ్చి విసరగా, విసరగా కళ్ళ వెంట నీరు కారగా, కారగా మళ్లీ మంట రాజింది.

అంతలో అమ్మ మళ్లీ కేక వేసింది : "రెండో పొయ్యి రాజేశావా? రాచిప్పకు మట్టి రాశావా?. . గడియారం తొమ్మిది కొట్టింది....."

  

ఇంట్లో పని తెమిలి, బడి ఆవరణంలో ప్రవేశించేటప్పటికి క్లాసులో నుంచి హెడ్మాష్టరు ఆఫీసు రూముకు వెళుతున్నాడు అంటే, మొదటి పీరియడ్ అయిపోయిందన్న మాట. అంటే హెడ్మాష్టరు చేతిలో దెబ్బలు తధ్యమన్నమాట వెధవ ఇంగ్లీషు! ఆ ఇంగ్లీషు పాఠం, ఒకసారి చదివి ఇతరులకు తాను పాఠం చెప్పగలడు బళ్ళోవాళ్లందరికీ తెలుసు హెడ్మాష్టరుకూ తెలుసు. కాని రూల్సు రూల్సే పిల్లలందరు టైముకు బడికి రావాలి.అ ట్లా రానివాళ్ళను హెడ్మాష్టరు తన్నక తప్పదు

ఆలోచిస్తూనే శేషు క్లాసు రూము బయట నుంచున్నాడు. "గెట్ యిన్" అన్నాడు లెక్కల మాష్టరు. లెక్కల మాష్టరు యెంత మంచివాడు! తనకు లెక్కలలో మంచి మార్కులే వస్తవి కాని ఫస్టు మార్కులు రావు. క్లాసులో ఎంత చిక్కు లెక్కలైనా తానొక్కడే సరిగ్గా చేస్తాడు అందుకే లెక్కల మాష్టరుకు తనంటే ఇష్టమేమో!

లెక్కల మాష్టరు క్లాసులో నాలుగు లెక్కలు చేయించి మూడు లెక్కలు హోమ్ వర్కు యిచ్చాడు అంతలో రీసెస్‌బెల్ కొట్టారు. ప్యూన్ బాలయ్య ఏదో చీటి తెచ్చి లెక్కల మాష్టరుకిచ్చాడు లెక్కల మాష్టరు శేషువంక చూచి "హెచ్ ఎం నిన్ను రమ్మన్నాడు" అన్నాడు

ఆ సంగతి శేషుకు తెలుసు. హెచ్ ఎమ్ కు తనంటే కోపం. తనంటే కాదు తన తెలివితేటలంటే కోపం. క్లాసులు ఎగవేసినా, నోట్సు సరీగ్గా రాయకపోయినా ఇంగ్లీషు సెకండు పేపరులో తనకు ఫస్టుమార్కు ఇవ్వక తప్పదు. అవకాశం దొరికితే తనను తన్నాలని ఆయన యెప్పుడూ యెదురు చూస్తూంటాడు అందులోను తానివ్వాళ మొత్తం పిరియడంతా ఎగవేశాడు ఎంత తప్పు! హెచ్ ఎమ్ క్షమించ తగ్గ తప్పా యిది!

దిగాలుగా శేషు ఆఫీసుగదిలోకి వెళ్ళాడు "ఏం ఇవాళ క్లాసు ఎగవేశారే దొరగారు" అన్నాడు హెచ్ ఎమ్ శేషు ఏం చెపుతాడు? ఏం చెప్పగలడు? చెపితే లలితా, మోహన్, సీతారామయ్య మొదలయిన వాళ్ళందరూ ఎగతాళి చేసి చంపరూ? అందుచేత మెదలకుండా నుంచుని తీరిగ్గా రెండు చేతులూ చూపి ఆయన వడ్డించినవన్నీ తిని గుడ్లల్లో నీళ్ళు గుడ్లలో నుంచి గొంతులోకి తెప్పించుకొని కాలవగట్టు మీదకు వెళ్ళి భోరున యేడ్చి మూడవ పిరియడు మొదలయి తెలుగు మేస్టరు క్లాసులోకి వెళుతుండగా శేషు కూడా తరగతిలోకి వచ్చి పడ్డాడు.

  

అకారణంగా దెబ్బలు! నిష్కారణంగా చివాట్లు! నిర్దాక్షిణ్యంగా ఎగతాళి..... ఛీ..... ఛీ..... జీవితం అనుకున్నాడు పదమూడ్లేండ్ల శేషు! సాయంకాలం ఆరు గంటలయింది.అయినా శేషు యింటికి వెళ్ళలేదు. మూడురోజుల పరీక్షల్లో బడి వదలగానే ఇంటికి రావాలి. ఇదీ అమ్మ చేసిన శాసనం ఈ శాసనానికి యెదురు లేదు.

శేషు ఆలోచిస్తున్నాడు. ఇంట్లో పని తనెందుకు చెయ్యాలి? తమ్ముడు చెయ్యరాదా? చెల్లాయి చెయ్యరాదా? అంత వాళ్ళు యెవరూ చెయ్యలేకపోతే వంట మనిషిని పెట్టరాదా?

ఇంట్లో పనిచేస్తే చదువెలా వస్తుందీ? చదువు రాకపోతే పంతుళ్లు తంతారు. పైగా నలుగురిలో అవమానం. మార్కులు సరీగ్గా రాలేదని తంతే అది వేరే సంగతి చేయవలసిన పని చెయ్యకపోతే తన్నితే అందులో అర్థం వుంటుంది కాని ఇంట్లో వాళ్లూ, బళ్లోవాళ్లు కూడా తన దృష్టిలో తనను అనవసరంగా తంతున్నారు. ఈ తన్నులు తినేదానికన్నా దేశం మీద తిరిగితే సరి ఆకలయితే అడుక్కుంటే సరి లేకపోతే ఏదయినా కూలి చేసుకుంటే సరి. శేషు కాలవగట్టు మీద ఉన్న చింతచెట్టు కింద కూచుని ఆలోచిస్తున్నాడు....

"బాబూ. .."

ఎవ [illegible] పిలుపు! శేషు అటూ ఇటూ చూచాడు. పెదనాన్న మందులసంచీ భుజాన వేసుకుని చేతికర్రతో నేలమీద పొడుస్తూ వస్తున్నాడు

"బాబూ . . ఇక్కడ కూచున్నావేం? అందరూ కులాసాగా వున్నారా...."

"పెదనాన్నా " అన్నాడు శేషు. శేషుకు తెలియకుండానే ఏడుపు వచ్చింది

"ఛీ . ఇదేమిటి బాబూ... . మగవాళ్లు ఏడవరాదు... ఏరా... నాన్న వూళ్లో వున్నాడా . అందరూ కులాసాగా వున్నారా?....."

"నాన్న కాంపుకి వెళ్ళాడు"

"అమ్మ కులాసాగా వున్నదా. "

"అందరూ బాగానే వున్నారు...." ·

"నువ్వు ఇంటికి వెళ్ళు నేను రాను"

"అదేమిటి బాబూ ఇంటికి రాని దెందుకని?"

"పెదనాన్నా - నేను ఇంటిపని ఎందుకు చెయ్యాలి?"

"చెపుతాగా. . ముందు ఇంటికి పద. చీకటి పడింది. పురుగూ పుట్రా వుంటవి పద, మాబాబు మంచివాడు"

పెదనాన్న ఎంత మంచివాడు! శేషు నెమ్మదిగా పెదనాన్న వెంట ఇంటికి వచ్చేటప్పటికి ఇంట్లో ఎవరూ దీపం కూడా పెట్టలేదు. పెదనాన్నే దీపం వెలిగించాడు. పెదనాన్నే వంటచేసి పిల్లలకి పెట్టాడు. పెదనాన్నే పాపకు పాలుకాచి పోశాడు. పెదనాన్నే పాలు పితికాడు పెదనాన్న ఎంత మంచివాడు!

రెండురోజులు గడిచిపోయినవి. మూడోరోజు సాయంకాలం శేషు బడి నుంచి ఇంటికి రాగానే స్నానం చేసి పెదనాన్న వెంట శివాలయానికి వెళ్లాడు.

పెదనాన్న తెల్లటి గడ్డం సవరించుకుంటూ ఏవేవో మంత్రాలు బిగ్గిరగా చదివాడు. ఆ పల్లెలోని వారందరూ పెదనాన్నను ఎంతోగానో గౌరవించారు. ఇంటికి వస్తూండగా శేషు నెమ్మదిగా అన్నాడు గదా.

"పెదనాన్నా-"

"ఏమిటి బాబూ"

"నేను ఇంట్లో పని ఎందుకు చెయ్యాలి?"

"మరి ఎవరు చేస్తారూ? అమ్మ వాకిట చేరిందాయె. నాన్న వూళ్లో లేడాయె. ఈ

వూళ్ళో మనవాళ్ళెవరూ లేరాయె"

"అమ్మ ఇంట్లో వున్నా నేను పని చెయాలి పెదనాన్న"

"అమ్మ ఇంట్లో వున్నా నీ చేత పని చేయిస్తుందా?"

"ఆ... నీళ్ళు తీసుకురావాలి పిల్లలందరికీ పక్కలు వేయాలి. బజారుకు వెళ్ళి ఇంట్లోకి కావలసినవి తీసుకురావాలి"

"ఇవన్నీ పెద్ద పనులా బాబూ! పెద్ద పనులయితే మాత్రం చేసుకోవద్దూ? మన పని మనం కాకపోతే ఎవరు చేస్తారూ?"

"ఏం తమ్ముడు చెయ్యరాదా? చెల్లాయి చెయ్యరాదా?"

"వాళ్లు చిన్నవాళ్ళు"

శేషు మాట్లాడలేదు. పెదనాన్న మళ్ళీ అన్నాడు గదా :

"అమ్మ జబ్బు మనిషి! బాబూ అమ్మకు సేవ చెయ్యడం దైవపూజతో సమానం. ఈ యింటికి నువ్వు జ్యేష్ఠుడివి. మీ అమ్మకు మొదట పుట్టావు, కనుక అమ్మకు నువ్వు చేదోడువాదోడుగా వుండాలి"

శేషు ఇందుకు సమాధానం ఏమీ చెప్పలేదుగాని ఏదో పరమ రహస్యం తెలిసినట్లనిపించి మనసులో అనుకున్నాడు. గదాః "ఓయి భగవాన్.... నేనెందుకు మొదట పుట్టాను" అని .. ..

మొదట పుట్టినవారందరి బాల్యం ఇలానే వుంటుందా!..... ...

# బళ్ళోకి వెళ్లాలి

జమదగ్ని

ఆపూట గోపాలం మనసు మనసులో లేదు.

ఉదయాన లేస్తూనే తండ్రి చెప్పిన విషయం అతని గుండెల్లో అలా రాయిపడ్డేసింది.

"ఒరే గోపీ! రేపను గింజలు తేవాలిరా" అంటున్నది తల్లి.

"ఇవాళ నాదగ్గర పైకం లేదు. రేపు చూద్దాం" అంటున్నాడు తండ్రి.

అయితే ఏమిటి గతి? ఇదే ప్రశ్న అందరినీ కలవరపరచింది. అప్పు గూడా పుట్టే దిక్కులేదనుకుంటున్నది తల్లి. ఇవాళకు యెలా గడిచినా యికముందు నుంచైనా ఈ బాధ తప్పుతుందిగదా అని కొడుకు మీద ఆశ పెట్టుకుంటున్నాడు తండ్రి. తండ్రి చెప్పినట్లు చెయ్యక తప్పదనిపిస్తోంది గోపాలానికి.

వాకిట్లో బక్కచిక్కిన గుఱ్ఱం ఆకలిబాధ సూచిస్తూ కాబోలు సకిలించింది.

తండ్రి చిరిగిన చొక్కా తొడుక్కొని వెళ్ళిపోతున్నాడు.

వీధిమూలనుంచి పంతులవారు బళ్ళోకి వచ్చినట్లు ప్రార్ధనపద్యం తెలియజేస్తోంది. తానక్కడ లేకపోయినా గోపాలం మనసులో పద్యం చదువుకున్నాడు. అప్పుడే పంతులుగారు నిన్నటి పాఠాలు అప్పజెప్పుకుంటున్నారు. అతని నోరు పాఠం అప్పజెప్పేస్తుంది.

"అక్కఱకు రాని చుట్టము,
మ్రొక్కిన వర మీని వేల్పు, మోహరమున దా
నెక్కిన బాఱని గుఱ్ఱము,
గ్రక్కున విడువంగవలయు గదరా సుమతీ!"

అతనింకా పద్యం పూర్తిచెయ్యనేలేదు. ఈ మూలనుంచి గొల్లుమని ఏడుపువినవచ్చింది. ఏమిటా అని గోపాలం బయటికి వచ్చాడు. మిద్దెయింటి షావుకారు భార్య వాళ్ళ బుచ్చిరామవేణుగోపాలకృష్ణయ్యను బళ్ళోకి పంపిస్తోంది. అతగాడు "నేను పోనే" అని అరుస్తున్నాడు కన్నీళ్ళతో బట్టలు తడుపుకుంటూ.

☆ ☆ ☆

స్టేషను దగ్గఱ బళ్ళస్టాండులో బండిదగ్గఱ నిలబడి వున్నాడు తండ్రి గోపాలం వెళ్ళేప్పటికి.

అప్పుడే రైలు వచ్చినట్లుంది. జనం గుంపులు గుంపులుగా దిగుతున్నారు. గోపాలం ఇంకా తండ్రిని సమీపించనే లేదు. కాని తండ్రి ముఖం చూడలేకపోయాడు గోపాలం. అంతవరకూ బాడుగ దొరకలేదు కాబోలు, డీలాపడి ఉన్నాడు తండ్రి.

ఎవరోగాని ముగ్గురు పెద్దలు ఆరు పెట్టెలు స్వయంగా మోసుకొని వచ్చి "బండి కడ్తావా?" అన్నారు.

"ఆ! బాబా!"

"కొత్తపేట కేం ఇవ్వమంటావ్?"

"తమ చిత్తం బాబయ్యా!"

"మూడణాలు ఇస్తాం"

"ఆరు మైళ్లుంది గడ్డురోజులు, తమ దయ"

"నీ ఇష్టమైతేనే కట్టు!"

మారుమాట అనకుండా సామాను సర్ది "ఎక్కండి బాబయ్యా!" అన్నాడు తండ్రి గుఱ్ఱాన్ని చూస్తున్న గోపాలం కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

అంతలో తండ్రిని సమీపించి "బాబా!" అన్నాడు గోపాలం

"వచ్చావ్! గోపీ! రా! ఎక్కువ! ఈ బాడుగ దింపి పోదాం"

"నే నడిచే వస్తాను" అంటున్న గోపాలం మాటలు వినిపించుకోకుండానే బండిలో ఒక ఆసామీ "ఇంకా ఎంతమందిని ఎక్కిస్తావు? అసలే చచ్చు గుఱ్ఱం పోనీ!" అన్నాడు.

లాగలేక లాగలేక గుఱ్ఱం లాగుతోంది.

చూడలేక చూడలేక గోపాలం చూస్తున్నాడు.

"నేనిప్పుడే వీరిని దింపి వస్తాను. నువ్వు ఇక్కడే ఉండు" అన్న తండ్రి మాటలు గోపాలానికి వినపడనే లేదు. గోపాలం అల్లా నడుస్తూనే వున్నాడు.

☆ ☆ ☆

అప్పటికి తొమ్మిది గంటలైందేమో! ఎండ ఎక్కే పొద్దు. ఇంట్లో గింజలు లేక తల్లి గంజి కూడా కాచి ఇవ్వలేదు. ప్రాణం శోష వస్తోంది. గోపాలం ఇక నడవలేకపోయాడు. దారిప్రక్కన ఒక చెట్టు ఉంటే దానిక్రింద చతికిలబడ్డాడు.

ఎండలో నుండి నీడలోకి కొత్తగా రావడంలో అతనికి కాసేపు ఏమీ కనిపించలేదు. ఆ పసిమనస్సుకు భవిష్యత్ వ్యూహాలు ఏమీ లేవు కాని అదీ అల్లా అయోమయంగానే ఉన్నది.

కూర్చుని కూర్చుని విసిగెత్తి గోపాలం నడుం వాల్చాడు. కన్ను మూశాడు. వివశమైన శరీరానికి నిద్ర వచ్చింది.

గోపాలం పాఠాలన్నీ గడగడా అప్పజెప్పాడు. చురుకుగా లెక్కలు చేశాడు. బళ్ళో మాస్టారు గోపాలంతో అన్నారు "అబ్బాయి! నీకు బాగా చదువు వస్తుంది. నువ్వు పెద్దబళ్లో

చేరి చదువుకో" గోపాలానికి పట్టరాని సంతోషం అయింది నాన్నను అడుగుదామని పరుగెత్తుకు ఇంటికి వెళ్ళాడు. వాకిట్లో నుంచే "నాన్నా!" అని కేకవేశాడు.

గోపాలానికి మెలకువ వచ్చింది. అతడు కూర్చునే "నాన్నా!" అంటున్నాడు

ఎదురుగా బండి ఆగింది గోపాలం తండ్రి కొడుకును చూచి ఆశ్చర్యపడ్డాడు. అతని తండ్రి పేవు జవజవలాడింది తిండిలేక కన్నకొడుకు కూర్చుని నిద్రపోతూ సంధిమాటలు అంటున్నాడు

"గోపీ!" అన్నాడు తండ్రి.

"నాన్నా" అన్నాడు గోపాలం.

"ఇక్కడ కూర్చున్నావేం? ఇందాకా ఎందుకు వచ్చావ్! రా పోదాం, అయ్యగారి దగ్గరకు" అన్నాడు తండ్రి

గోపాలం లేచి బండి ఎక్కాడు.

బండి పెద్దబజారు దాటింది. అప్పుడు పదిన్నర కావస్తోంది.

"ఎక్కడికి నాన్నా మనం వెళ్లేది?" అన్నాడు గోపాలం.

"ఇక్కడికే!" అంటూ బండి ఆపాడు తండ్రి.

బండిలోనుంచే గోపాలం నాలుగుప్రక్కలా చూచాడు అదే పెద్దబడి. అతనికి ఆశ్చర్యం వేసింది. బళ్లో పంతులుగారు తనతో నిద్రలో అన్న మాటలు జ్ఞాపకం వచ్చాయి.

"నాన్న ఎంత మంచివాడు!" అనుకున్నాడు గోపాలం.

గంజి తాగని నిస్సత్తువ అతని కప్పుడేమీ తెలియలేదు.

హెడ్మాష్టరు గది గుమ్మం దగ్గర కొడుకుతో నుంచొని ఉన్నాడు తండ్రి.

ఒక్కసారి బడి అంతా చూచి అప్పుడే హెడ్మాష్టరు వస్తున్నాడు.

ఆయన తలపాగ, కోటు, ఠీవి చూచి ఎంత గొప్పవాడో అనుకున్నాడు గోపాలం అతనిని బళ్లో చేర్పించడానికే తండ్రి తన్ను అక్కడకు తీసుకు వచ్చాడన్న ఊహ పాతుకుపోయింది. ముఖం కళకళలాడిపోతోంది.

"వీడేరా మీ అబ్బాయి!" అన్నాడు హెడ్మాష్టరు అతని ముఖంలో తెలివితేటలు గమనిస్తూ.

"చిత్తం బాబయ్యా! తమ దయ"

"సరే! ఇవ్వాల్టి నుంచే చేరమను"

అయ్యగారికి దణ్ణం పెట్టమని తండ్రి సైగ చేశాడు. గోపాలం పెట్టాడు.

హెడ్మాష్టరు గదిలోకి వెళ్ళిపోయాడు.

"నువ్వు ఇక్కడే ఉండు వారేం పని చెప్తే అది చెయ్యి. ఒంటిగంటకు బడి విడిచిపెడ్తారు. అప్పుడు వణ్ణానికిరా! జాగ్రత్తగా మసులుకో!" అని తండ్రి హెచ్చరించి వెళ్ళిపోయాడు.

గోపాలానికి అంతా అయోమయంగా ఉంది. అక్కడే నిలబడి ఉన్నాడు. ఏం చెయ్యాలో తెలియక.

గదుల్లో పిల్లలకు మాష్టార్లు పళ్లుకొరుకుతూ పాఠాలు చెప్పుతున్నారు.

౨

గోపాలం రోజూ హెడ్మాష్టరు ఇంటిదగ్గరే పడుకుంటాడు. రాత్రి పదిగంటలకు ఉదయాన లేచింది మొదలు నీళ్లు తోడడం, గుడ్డలుతకడం, బజారుకి పోయి సరుకులు తేవడం, ఇంటికిపోయి గంజితాగి మళ్లీ అయ్యగారింటికి అరగంటలో రావడం, ఆ పిమ్మట అయ్యగారి సైకిలు వసారాలో నుంచి దింపి పందిరిగుంజ కానించి వారికంటే ముందు బడికి పరుగెత్తుకు రావడం – ఇవన్నీ అతనికి నిత్యకృత్యాలయిపోయాయి పదమూడేళ్ళు నిండని అతనికి ఈ పని చాలా భారమే అయినా ఒకే ఒక ఆశతో ఈ రెండు నెలలబట్టీ చెయ్యగలుగుతున్నాడు గోపాలం

ఇంత కష్టాన్నీ అతని కర్తవ్యంలో ఒక్కపని వల్ల మాత్రం అతడు మరచిపోగలిగేవాడు అది గంటలు కొట్టడం

తొమ్మిదిమ్ముప్పావుకు మొదటిగంట కొట్టేవాడు ఆ గంట మోగుతున్నంతసేపూ అయ్యగారి ఇంటి పనిభారంలో అణగిపోయిన తనలోని ఏశక్తో నిద్ర మేలుకుంటున్నట్లు ఉత్సాహం పొందేవాడు గోపాలం కాసేపు ఉంటే వందలకొద్దీ తన యీడు కుఱ్ఱవాళ్లు, తనకంటే చిన్నవాళ్లూ పెద్దవాళ్లూ గూడా చదువుకోడానికి వస్తారు తాను మూడో గంట కొట్టందే ఏ పంతులూ పాఠం చెప్పడానికి వెళ్లడు. ఇంతమంది కుఱ్ఱవాళ్లను చదువుకోనిస్తున్నది తానే! తనకు గూడా చదువుకునేందుకు అవకాశం ఉంటే .... ..

అంతలో హెడ్మాష్టరు రానే వచ్చేవాడు. తాళం చెవి ఇచ్చి తలుపులు తీసి ఊడవమనేవాడు కూజాతో మంచినీళ్లు పట్టుకురమ్మనేవాడు ఏవేవో కాయితాలు ఇచ్చి అన్ని గదులకూ పోయి మాస్టర్లకు చూపించి రమ్మనేవాడు. ఒకగదిలో లెక్కలు వినపడేవి! మఱొక గదిలో పద్యాలు వినపడేవి! ఇంకొక గదిలో ఎవరో పంతులు కధలు చెప్పుతూ ఉండేవాడు. గోపాలం ఒక్కొక్కచోట అవి వింటూ అట్లాగే ఉండిపోయేవాడు. రావడం ఆలస్యమయిపోయేది. హెడ్మాష్టరు “వెధవా! షికార్లుకొడుతున్నావా? ఇంతసేపేమిటి? డొక్క చీరేస్తాను” అనేవాడు గోపాలం కళ్లనీళ్లు పెట్టుకొనేవాడు.

“ఏడుపుగొట్టు వెధవా! అవతలికిపోయి ఏడు” అనేవాడు హెడ్మాష్టరు.

ఇంటిదగ్గర తల్లీ తండ్రీ మాత్రం ఒకంత సంతోషపడేవారు గోపాలాన్ని మెచ్చుకునేవారు ఇరుగుపొరుగువారితో చెప్పుకుని. చిన్నవాడైనా బుద్ధిగా పనిచేస్తూ ఉండబట్టి తమకు అన్నానికి యిబ్బంది తప్పిందని రోజూ రెండుమాట్లు ఇంటికి అన్నానికి వెళ్ళే ఆ అరఘడియ కాలంలోనూ అప్పుడప్పుడు ఈ ముక్కలు అతని చెవిని గూడా పడేవి. ఆ మాటా నిజమే! ఇప్పుడు తానుగూడా తిండి సుఖం అనుభవిస్తున్నాడు. ఉద్యోగం చేస్తున్నాడని తల్లి కష్టపడి చేత్తోకుట్టిన మంచి చొక్కాలు రెండు ఏరోజుకారోజు ఉతికి యిచ్చేది. తమకు ఉన్నా లేకపోయినా వండిన భాగం ముందు తనకే పెట్టేవాళ్ళు తల్లీ, తండ్రీని.

గోపాలానికి ఏడవాలో సంతోషించాలో ఏమీ తెలిసేది కాదు.

☆ ☆ ☆

ఆరోజు ఆదివారం. బడిలేదు. కాని గోపాలానికి సెలవు లేదు. అతని కారోజే పని ఎక్కువ.

మామూలు ప్రకారం అన్ని పనులూ చేసి గోపాలం వసారాలో కూర్చుని ఉన్నాడు. అలసిన శరీరంతో గుంజకానుకుని కునికిపాట్లు పడుతున్నాడు.

అయ్యగారు అప్పుడే భోజనం చేసి త్రేనుస్తూ వసారాలోకి వచ్చారు. పడకకుర్చీ పిలుస్తున్నా వినిపించుకోకుండా గోపాలాన్ని కేకలు వేశారు.

గోపాలం ఉలిక్కిపడి లేచి నిలబడ్డాడు.

"ఏం పనిలేక కొట్టుకుంటున్నట్లున్నావే! అమ్మగారిని అడిగి డబ్బులు తీసుకుపోయి తమలపాకులు పట్టుకురా!" అన్నారు.

గోపాలం తలవంచుకొని వెళ్ళిపోయాడు

అతను తిరిగి వచ్చేటప్పటికి అయ్యగారు ఆరేళ్ళ చిన్న అయ్యగారిని పొట్టమీద కూర్చోబెట్టుకొని పద్యాలు చెప్పుతున్నారు.

గోపాలం మరచిపోలేదు చదువుకున్న చదువు. ఆ పద్యాలు చెవిని పడటంతోటే, ఎండలో బజారుకు వెళ్ళివచ్చిన కష్టం అంతా మరచిపోయి మనసులో అనుకుంటూ లోపలికి వెళ్లి అమ్మగారికి ఆకులు యిచ్చి, బయట వసారాలో గుంజ కానుకుని నుంచున్నాడు.

అయ్యగారు తాంబూలం వేసుకుంటున్నారు చిన్నయ్యగారు పద్యాలు అప్పజెప్పుతున్నారు. అమ్మగారు పక్కనే నించుని కొడుకు తెలివితేటలకు సంతోషిస్తున్నారు

చాలా చక్కని సమయం. గోపాలానికి ఆగబుద్ధి వేయలేదు. అడుగుదామన్న ఆతురత హెచ్చిపోయింది.

"బాబూ!" అన్నాడు మెల్లగా.

"వెళ్ళి భోంచేసి త్వరగా రా" అన్నారు అయ్యగారు విసుక్కుంటూ.

గోపాలం కదల్లేదు. అట్లాగే చేతులు నలుపుకుంటూ నిలబడ్డాడు.

అయ్యగారు చిన్నయ్యగారితో ఆడుకుంటున్నారు.

గోపాలం మళ్ళీ "బాబూ!" అన్నాడు.

"వెళ్ళమన్నాను గదరా!"

"అదిగాదు బాబూ! ఒక్క మనవి"

"మీ అయ్య అడిగిందేనా? తర్వాత చూద్దాంలే" అయ్యగారు ఉత్సాహంతో ఉండబట్టి ఆ మాత్రం మంచి మాటైనా వచ్చింది. మొదట్లో అడిగినప్పుడు "ఇక్కడ నీకోసం కొట్టుపెట్టామా?" అని చీవాట్లు పెట్టారు. తొడిగిన పాతగుడ్డ ఇవ్వడానికి. ఇవాళ ఈ మాత్రం సుముఖంగా ఉన్నారుకదా అని గోపాలానికి ధైర్యం వచ్చింది.

"కాదండి బాబయ్యా"

"ఏమిటిరా మరి?"

"నాకు గూడా చదువుకోవాలని ఉంది బాబయ్యా"

"నీకు చదువేమిటిరోయ్? ఏమైనా మతిపోయిందా?"

ఓ అంటే నా రాని అమ్మగారి దగ్గరి నుండి తొక్కు పల్కులు పల్కుచున్న చిన్నయ్యగారి వజకు ముగ్గరూ విరగబడి నవ్వారు.

గోపాలానికి ఏమనాలో తెలియలేదు. ఏం, తానెందుకు చదువుకోగూడదు? తనకంటే చిన్నవాడు చిన్నయ్యగారు చదువుకుంటూంటే అంతమంది బళ్ళోకి వస్తూ ఉంటే ఒక్క తాను మాత్రం ఏం పాపం జేసుకున్నాడు?

చిన్నయ్యగారు పద్యం చెప్పుతున్నారు "అక్కలకు లాని సుత్తము" అంటూ గోపాలం తన్ను తాను ఆపుకోలేకపోయాడు

"అక్కరకు రాని చుట్టము" పద్యము పూర్తిగా అప్పజెప్పాడు స్వచ్ఛంగా

పెద్దయ్యగారు నిర్ఘాంతపోయి చూచాడు గోపాలం వంక

గోపాలం చేతులు నలుపుకుంటూ "నేనసలు చదువుకుంటున్న వాణ్ణేనండి! మా అయ్య చదువు మాన్పించి, ఇల్లు నెట్టలేక ఈ పనిలో పెట్టాడు. తమ దయ ఉంటే మీ పేరు చెప్పుకుని చదువుకుంటాను" అన్నాడు గోపాలం

పెద్దయ్యగారు పడకకుర్చీలోంచి కష్టపడి లేచి "ఏడిశావు లేవోయ్! చదువుట, చదువు! చెప్పినపని చెయ్యలేక చతికిలబడుతున్నావు! చదువొక్కటి తక్కువైంది నీకు. చదువుకునే యోగ్యతే ఉంటే ఈ కర్మమేమిటి? ఫో ఫో! ఛోంచేసిరా! బళ్లోకి వెళ్లాలి!" అన్నారు మండిపడుతూ.

గోపాలానికి కళ్ళనీళ్లు గిఱ్ఱున తిరిగాయి. అలాగే తలవంచుకొని నట్టెండలో ఇంటిదారి పట్టాడు తన కర్మ ఏమిటో తనకే బోధపడక మనసులో బాధపడుతూ!

'బళ్లోకి వెళ్లాలి! బళ్లోకి వెళ్లాలి!' అవే మాటలు అతని చెవుల్లో గింగురు మంటున్నాయి దారిపొడుగునా.

☆ ☆ ☆

ఇప్పటికీ పాపం గోపాలం బళ్లోకి వెళ్తూనే ఉన్నాడు గంటలు కొడ్తూనే ఉన్నాడు.

# పిచ్చి దంపతులు

## కె. సభా

భగ్గుమని మండిపోతున్నది యెండ. ప్రవహిస్తున్నది తారు లావాద్రవంలాగా. ఆ వేడిలో స్వేదాలు చిందించుకొంటూ జల్లితట్టను మోస్తున్నాడా వృద్ధుడు. ఆ ముడుతలు బడ్డ ముఖంలో యెన్ని వేల భావనా స్రవంతులు యింకిపోయినవో ఎవరు చెప్పగలరు? అతని ప్రక్కనే పాదాలకు గుడ్డ పేలికలు చుట్టుకొని ప్రవహించే వేడి ద్రవంమీద గులకను పేర్చుకొంటూ వస్తున్నదా యిల్లాలు. ఆ యిద్దరి ముఖాలు వాడిపోయి వున్నా అవి ఆవేదనలను సూచించడం లేదు. సోలిపోయి వున్నా విరక్తిని ప్రస్ఫుటింపజేయడం లేదు.

ఎవరా శ్రామిక దంపతులు? అరవయ్యోపడి దాటినా ఉదర పోషణార్థం బండలను పగులగొడుతున్నారు ఎండలలో ముదిరి, నెత్తురింకి పిడుచగట్టి, ఎండిపోయిన కండలను కరిగిస్తున్నారు. నాలుగిళ్ళు అడుక్కున్నా పొట్ట గడిచిపోయే అవకాశమున్నది. ఐనా ఆత్మాభిమానంతో పౌరుషంతో బ్రతుకును సాగిస్తున్నారు.... ...

ఎవరా నిర్మాణ శిల్పులు? ఆ దారి వెంబడే వెడుతున్నవి బస్సులు ... పోతున్నవి కార్లు.... కానీ వారి వంక చూచే అవసరం... వారిని గురించి ఆలోచించే ప్రమేయం ఎవరికి కలుగుతుంది? ఎప్పుడు కలుగుతుంది? ఎవరి ప్రపంచం వారిది! ఆ ముసలాడి జీవితానికీ ఒక చరిత్ర వున్నది. అది శిబి చక్రవర్తి త్యాగానికి తీసిపోనిది. కర్ణుని ఉదారతకు తక్కువ కానిది. ఐనా నాటి త్యాగులు చరిత్రలో ఒక స్థానాన్ని ఏర్పరచుకొన్నారు. నేటి ఉదారులు శ్రామికులు ... వారికి చరిత్ర లేదు. ఉన్నా అది ప్రాంతీయ పరిమితమై పోయింది.

అసలా వృద్ధుడొక రైతు. ఆరెకరాల మాగాణి రెండు మడకల సేద్యం.... ఎందు కిలాంటి స్థితికి వచ్చాడా అని ఆలోచిస్తే అతని వ్యక్తిత్వం, అంతకు మించిన త్యాగపటుత్వం తెలుస్తుంది. ...

☆ ☆ ☆

పేరు వెంకయ్య కాపురమున్నది గ్రామమైనా ఆ ఊళ్ళో పట్టణ వాతావరణం

గూడా వున్నది. రెండెకరాల పొగ తోటలో నాలుగు రూకలు వస్తుంటాయి. మిగిలిన నాలుగెకరాలలోనూ ఏవో నాలుగు పుట్లు ధాన్యం పండుతూనే వుండుటంది. ఉన్న స్థితిని మరీ ఉన్నతంగా పెంచుకోవాలనే ఆశ అతనిలో లేదు. అందుకే లేనిపోని పేరులకు అతను పోకుండా కాలం గడుపుతూ వచ్చాడు. ఇద్దరు బిడ్డలకు పెళ్ళిళ్ళు చేయాలనుకున్నాడు అందరిలాగా కట్నాలిచ్చుకోలేక పోయినా ఏదో కలిగిన కానుకలిచ్చి పెళ్ళిళ్ళు కూడా పూర్తి చేశాడు. ఆ యిచ్చిన చోట్లు కూడా అంత శ్రీమంతమైనవి గావు గానీ కట్టా కుడువా మాత్రం లోటు లేదనే చెప్పాలి

వెంకయ్య కాపురం ఏ ఒడిదుడుకులూ లేకుండా దొర్లిపోతూ వుంది ఇద్దరు కుమార్తెలూ అత్తవారింటికి వెళ్ళిపోయారు గనుక యింటిలో వున్నది భార్యాభర్తలిద్దరే కనుక ఆర్థికంగా అట్టే ఒడిదుడుకులేవీ లేవు పైగా పొగాకులో వచ్చిన మూడువేల రూపాయలూ మిగులుగా వున్నాయి అనవసరమైన ఖర్చులు చేయడం అతనికట్టే అలవాటు లేదు గనుక ఆ డబ్బులు మిగులగలిగినై అప్పుడప్పుడూ ఏవో తోచిన దానధర్మాలు చేయడం గూడా అలవాటుగా పెట్టుకొన్నాడు భార్య రుద్రమ్మ గూడా కొంచెం ఉదారత కల్గినదే. అతని మాట కెప్పుడూ ఎదురు చెప్పేది గాదు.

ప్రకృతి చాలా విచిత్రమైంది. అదెంత సౌందర్యమైందో అంత ప్రమాదమైంది గూడా. దానికి కోపం వచ్చినపుడు మంచి చెడ్డలు లేవు మంచివారిని గూడా బాధిస్తుంది. దానికి సంతోషంగా వున్నపుడు చెడ్డవానికి గూడా చక్కని ఆనందాన్ని కలుగజేస్తుంది వెన్నెలవాన కురిపిస్తూ హాయిని గొలిపించిన ప్రకృతే కోపించింది. ప్రళయ మారుతంలో పగిలిపోయిందాకాశం. ఘనీభవించిన మేఘుడు వికటాట్టహాసం చేశాడు. వంకలు డొంకల నీడ్చుకుంటూ పచ్చని పొలాలను ఊడ్చుకొని పోయినవి చేతికందిన పంటలక్ష్మి సముద్రుని చూడ్డానికి చల్లగా పయనించింది నెత్తీ నోరు మొత్తుకొన్న రైతాంగం ఉత్త కడుపులతో మిగిలిన చెత్తా చెదారాలను కుప్ప చేర్చుకొని మిత్తివాతపడ్డ గొడ్డూ గోదాలను తలంచుకుంటూ గోడుగోడుమంటూ విలపిస్తున్నది.

వెంకయ్య ఒకసారి తన పొలాన్ని చూసి వచ్చాడు. మిరపపాదులు వున్న పోలికే కనిపించలేదు. దొండపాదుల్లో వున్నవి ఎక్కడినుండో కొట్టుకు వచ్చిన ముళ్ళకంచెలు ఒక్క నిమిషం నిట్టూర్చి యింటికి మళ్ళుకున్నాడు. వస్తూ వస్తూ అతని దృష్టి గ్రామంలో పాఠశాల మీద పడింది బడిపిల్లలందరూ వెలుపల నిల్చున్నారు. పై కప్పు కూలిపోయింది. లోపల రికార్డులన్నీ బాగా తడిసిపోయాయి బల్లలు విరిగి గుల్లలై పోయాయి. కూలిపోయిన విద్యాలయం ముంగిట గూడులేని పిట్టల్లాగా నిల్చున్నారు పిల్లలు. వారి ముఖాలు అతి విషాదంగా వున్నవి. ఉపాధ్యాయులున్నారు గానీ వారిలో చైతన్యం సడలింది. కూలిన కొయ్యలను ఎత్తి పేర్చడానికి ప్రయత్నిస్తున్నారు. ఆ పిల్లలకు గ్రామానికి జరిగిన నష్టం మీద ధ్యాసలేదు. ప్రతివాని పొలమూ మునిగిపోయింది. ప్రతివాని పరువులూ కొట్టుకు పోయాయి కానీ – ఆ లేత హృదయాలకా నష్టం తెలిసి రాలేదు. బడి కప్పు కూలిపోయిందనే భావం, అదొకటే పెద్ద నష్టమనే నమ్మకం వారిలో ఏర్పడ్డట్లున్నది. అందుకే ప్రతి ఒక్కని

ముఖంలోనూ ఆవేదన అంగలు వేస్తూ వున్నది.

వెంకయ్య ఆ విషాదపూరిత వదనాలను తిలకిస్తూ అట్టే మ్రాన్పడి నిలిచిపోయాడు ఐదు నిమిషాలు. ఆ వెనుక మెల్లగా కూలిన కప్పును లాగుతున్న ఉపాధ్యాయులను పలకరించాడు విలువైన చిత్రపటాలు పాడుపడ్డాయి. అవి బురదలో నానిపోయినై. అమూల్యమైన గ్రంథాలను దాచి పెట్టిన రెండు బీరువాలు ముక్కలై పోయినై. వెంకయ్య మెల్లగా పలుకరించాడు. పరీక్షలిక నెలరోజులే వున్నాయట. బడిని యిక్కడ ఏ విధంగా నడపాలో అర్ధం గాదన్నారు. గ్రామంలో సాయం చేసేవారెవరైనా వున్నారా అంటే అందరికీ గొడ్డలిపెట్టుగా దాపురించిన ఈ తుఫాను బాధ ఫలితంగా అలాంటిదేమీ జరిగే అవకాశం లేదని తేలిపోయింది ప్రభుత్వం కొంతవరకే సాయపడవచ్చు. కానీ పునాదులంటుకొని కూలిపోయిన భవనాన్ని కొత్తగా కట్టించే శక్తి వున్నా వెచ్చించే అవకాశం లేదని తెలిసింది. ఇక బడి జరగడం ఎలాగా? ఆరు వందల మంది బిడ్డలు నిరాశ్రయులుగా కనిపించారు వెంకయ్య దృష్టిలో గ్రామంలో ఎవరి కొంపను వారు సరి పెట్టుకుంటున్నారు. ఎవరి గుడిసెకు వారేదో కష్టపడి కప్పు వేయించుకుంటున్నారు. అందరికీ సంబంధించిన సాంఘిక క్షేమం కోసం, అభ్యుదయం నిమిత్తం అవతరించిన విద్యాలయాన్ని బాగుచేసే ఆలోచన యింకా ఎవరికీ పుట్టలేదు.

వెంకయ్య అక్కడ నుండి సరాసరి యింటికి వెళ్ళాడు. తన యిల్లు తన నాన్నగారి హయాంలో కట్టింది. గట్టి పునాదులతో లేచిన యిల్లయినా కప్పు చెదిరిపోయింది. రుద్రమ్మ క్రింద రాలిన పెంకులను వూడ్చి పోస్తున్నది. ఇంటి ముంగిట్లో పదిమంది కూలీలు కాచుక్కూచున్నారు. వెంకయ్య వుదారత వారికి తెలుసు గనుక సాయం కోసం వచ్చారు. వారితో మెల్లగా ఆ గుడిసెలవైపునకు వెళ్ళాడు ఏమున్నది? సర్వం కడిగేసినట్టుంది. అసలే అవి మేకపిల్లలకు వేయబడిన గుడిసెల్లాంటివి. ఆ చిన్ని గుడిసెల్లో తొట్టెడు సంసారాలు. ఏడుస్తున్నారు పిల్లలు ఆకలికి. వెంకయ్య యింటికి వచ్చిందే పుట్టెడు ధాన్యాన్ని కొలిచాడు రెండు వందల రొక్కం యిచ్చాడు. రుద్రమ్మ బదులు చెప్పలేదు. చెప్పే స్వభావం ఆమెలో లేదు. ఆ సాయం కాలమే యిద్దరు అల్లుళ్ళు మనుష్యులను పంపించారు చెరో నాలుగు వందలిచ్చి పంపేశాడు రుద్రమ్మ అటకాయించలేదు

ఆ రాత్రి సన్నగా వెన్నెల కాస్తున్నది. బడి వైపునకు వెళ్ళాడు. ఒక గ్రుడ్డి దీపాన్నుంచుకొని కూలిపోయిన కొంప ముందు చలిమంట వేసుకుంటున్నాడు నరసయ్య సౌందర్యాలను విరజిమ్ముతూ విజ్ఞాన వికాసాలతో కళకళలాడే విద్యాలయం స్మశానవాటికలాగా కనిపించింది వెంకయ్య చూడలేక యింటికి వచ్చాడు.

అతణ్ణి ఏదో మహిమాన్విత శక్తి ప్రేరేపించింది. కరుణ రసాన్ని ప్రవహింపజేసింది. త్యాగశక్తిని పుంజీభవింపజేసింది. లేచి కూచున్నాడు. ప్రక్కనున్న రుద్రమ్మ గూడా లేచి కూచున్నది.

'రుద్రీ! మనం ఏనాటికైనా చచ్చిపోతాం గదూ!" అన్నాడు వెంకయ్య. ఈ మాటలు విన్న రుద్రమ్మ ఉలిక్కిపడింది.

"ఏం ఎందుకలా అంటున్నారు?" ప్రశ్నించింది రుద్రమ్మ.

"ఊరకనే . . ఈ లోకంలో ఏముంది మనకు స్వంతం?"

"ఇదంతా వేదాంతంలాగుంది. నాకేం తెలుసు?"

"అవును. నాకూ తెలియదు. కానీ మనం ఏదైనా మంచి పని చేసి చచ్చిపోదాము."

"ఇప్పుడు చేస్తున్నవి మంచి పనులేగా?"

"కావచ్చు అది నలుగురికీ ఉపయోగపడే పనిగా వుండాలి. నేనేం చేసినా ఎదురు చెప్పవు గదా?"

"నేనెప్పుడైనా చెప్పానా? చిన్నతనం నుండి మీ యిష్టం మీదనే గదా నడిచిపోతున్నా"

"ఇప్పుడలాగ అన్నంత మాత్రంలో చాలదు మనం అవసరమైతే పస్తులు గూడా ఉండాలి"

"ఇంతవరకూ దేవుని దయవల్ల పస్తులేదు. ఉండవలసి వస్తే వుంటేనేం? ఎందరో పస్తున్నారు గదా?"

"ఐతే పడుకో" అంటూ పడుకున్నాడు వెంకయ్య రుద్రమ్మ కేదీ అర్థం కాలేదు. ఐనా ఏముందిలే అనుకొని పడుకొన్నది

☆ ☆ ☆

ఆ మరునాటి ఉదయం ఇరవైమంది కూలీలతో వెళ్ళి దిగాడు వెంకయ్య బడి ఆవరణలో. పిల్లలకా విషయం తెలిసిందే పరమానందభరితులయ్యారు. గ్రామం గ్రామంగా ఆశ్చర్యంలో మునిగిపోయింది కోటికి పడగెత్తే కోటీశ్వరులు లేకపోయినా లక్షలార్జించిన లక్ష్మీ పుత్రులకు కొదువ లేనిదా పల్లెసీమ. అలాంటి మత్తేభులున్న పల్లెలో గులకలు మోయడం అలవరచుకొన్నది రుద్రమ్మ. ఇలాంటి పవిత్ర కార్యానికి ఎవరూ ముందంజ వేయకపోయారు. వెంకయ్య నడుంకట్టి త్యాగరంగంలో దుమికాడు.

పునాదులను త్రవ్వి వున్న రాళ్ళను కుప్ప వేయించాడు. తానూ కూలీలతో పని చేస్తూనే వున్నాడు. రుద్రమ్మ కూలీలకు బువ్వ చేసి పెడుతున్నది. చక్కని ప్లాను తయారైంది. రెండు కూటాలు. ఎనిమిది తరగతి గదులు, ఒక రీడింగు రూము, ఒక ఆఫీసుగది ఒక లేబరేటరీ..... మూడు పాయఖానా దొడ్లు కాంపౌండుతో చేరి ఎన్ని వేలవుతుందో అంచనా వేశారు. ఇరవై వేలతో ముగించవచ్చునన్నారు. ఉన్నవి రెండువేలు మాత్రమే. ఉన్న పొలంతో సగంవంతు అమ్మితే సరిపోవచ్చు. ఐనా వెనుకాడ కూడదని నిర్ణయించుకొన్నాడు వెంకయ్య. రుద్రమ్మ మారు చెప్పలేదు. అతనికెదురుగా మాట్లాడ్డం ఆమె జీవితంలో లేదుగా!

పునాదులు వేయకముందే సగం పొలాన్ని అమ్మివేశాడు. పదేనువేల రొఖ్ఖం చేతిలో పడింది. పని ప్రారంభమైంది. త్వరగా జరిగిపోతున్నది పునాదులు పడి గోడలు పైకి లేచినై. రొఖ్ఖం అయిపోయింది. ఉన్నవి రెండువేలు మాత్రమే మళ్ళీ పొలాన్ని అమ్మవలసిందే. పని ఇంతటితో ఆగిపోతుందనుకున్నారు కొందరు. దేనికైనా మంచిదని గ్రామస్థుల్లో ఒకరిద్దరి శ్రీమంతులను పలుకరించాడు అందులో ఒకాయన ఘాటైన సమాధానం యిచ్చాడు.

ఇంత మాత్రానికెందుకు ప్రారంభించాలన్నాడు.

వెంకయ్యకా ఒక్క మాట శూలం పోటులాగా గుచ్చుకొన్నది ఆ రాత్రి నిద్రపట్టలేదు. పొలాన్ని అమ్మాలనుకున్నాడు. రుద్రమ్మను పల్కరించాడు. ఆమె బదులాడలేదు. వెంటనే పొలాన్ని అమ్ముతున్నాని నలుగురితో చెప్పాడు ముందు పోటీలు పడ్డారు కొనడానికి. కానీ యీ మారు ఎటు దిరిగీ అమ్మక తప్పదని నలుగురూ కూడబలుక్కున్నారు. చివరికి పొరుగూరి వారికి అమ్మేద్దామనుకున్నాడు. ఈ విషయం తెలిసి ఊళ్లోవాళ్ళే ఒకరికి తెలియక మరొకరు పోటీలు పడ్డారు. అదృష్టం కొద్దీ మరో మూడువేలు అధికంగానే వచ్చింది. పద్దెనిమిది వేలు చేతిలో పెట్టుకొన్నాడు ఇకనేం పని ప్రారంభమైంది. ఇనుము ధర ఆకసంలో నృత్యం చేస్తున్నది. సిమెంటు ధర కూడా విపరీతంగా పలుకుతున్నది. కావలసినవి కొన్నాడు. ఆశ్చర్యమేమంటే పై మిద్దె కప్పు దగ్గరకు వచ్చేలోగా డబ్బు చాలకపోయింది ఇక పని ఆగిపోవలసిందేనా? ఆ మధ్యాహ్నం కూలీలకు అన్నానికే తగరార్రై పోయింది. సాయంకాలం కూలీలకు రేపిస్తానంటూ పంపివేశాడు.

ఆ రాత్రి మళ్ళీ ఆలోచనలో పడ్డాడు. ఉదయం కూలీలు వస్తారు. వారికి డబ్బులివ్వాలి. లోకం తన్ను యింకా పరీక్షిస్తూనే వున్నది. తానీ పరీక్షలో నెగ్గవలసి వున్నది.

"రుద్రీ" పలకరించాడు.

"ఏమండీ" సమాధానం.

"ఏం చెయ్యాలో తోచడం లేదు"

"పడుకొని నిద్రించండి ఉదయం చెబుతాను"

"ఏముంది చెప్పడానికి"

మామిడిపిందెల దండ వుందిగా? పోయిందిగా సమస్తం. ఇది మాత్రం ఎవరిని ఉద్ధరించడానికి పని పూర్తి చేస్తే చాలు అంతవరకూ నాకూ నిద్రపట్టదు"

'ఆఁ... నిజంగా యిస్తావూ?"

"ఎందుకివ్వనండీ? అది మీ సొమ్మేగదా. మీ సొమ్ము మీకివ్వడంలో ఆశ్చర్యం లేదుగా."

"నీకు పిచ్చా. అది నా సొమ్ము మాత్రం ఎలా అవుతుంది? దానిని ఖర్చుపెట్టకుండా నా వద్దనే వుంచుకుంటాననుకో నేను చచ్చినపుడది నాతో వస్తుందా? పైగా నేను చస్తే ఏమౌతానో నాకే తెలియదు. అయితే చావడం మాత్రం సత్యమని తెలుసు. ఆ సొమ్ము నాదని చెప్పడానికి నాకు హక్కున్నా యోగ్యత లేదు. ఆధారమున్నా అవకాశం లేదు. ఇంతకూ మనల్ని పిచ్చివాళ్ళనుకుంటున్నారు కొందరు పడుకో" అన్నాడు వెంకయ్య.

ఉదయం బస్తీకి వెళ్ళి మామిడి పిందెల పేరును అమ్మివేశాడు. పదేను వందలు వచ్చాయి. పని అభ్యంతరం లేకుండా సాగిపోయింది. వెల్ల వేయించాడు గూడా. ప్రారంభోత్సవం జరిగిపోయింది పిల్లలు నవ్వు ముఖాలతో బడిలో ప్రవేశించారు. వారు తాతయ్యతో ఫోటోలు తీయించుకున్నారు

ఆ రాత్రి ఆనందంతో నిద్ర పట్టలేదు వెంకయ్యకు. రుద్రమ్మ కూడా మాట్లాడుతూనే

వుండిపోయింది.

☆ ☆ ☆

కట్టలేని చెరువు, చెట్టులేని చేను యెంతో కాంపౌండు లేని కట్టడం కూడా అంతే ప్రాకారం లేని భవనానికి అందం లేకుంటే మానెగానీ భద్రత కూడా వుండదు అది కంచెలేని చేనులాగా పరిగిలిపోతుంది. బడికి కట్టడం వుంటే చాలదుగా? నాలుగు పూలమొక్కలుండాలి అప్పుడే అందంతోపాటు విశాలత్వాన్ని కూడా ఇవ్వగల్గుతుంది.

ఓనాడు సాయంకాలం వెంకయ్య బడివైపు వస్తుంటే బడి చుట్టూ పశువులు గెంతుతున్నాయి పిల్లలు తరుముతున్నారు. ఆ పక్కనే చిన్న గుడిసెలో గంపెడు సంసారం కాపురమున్నది తానూ ఒక పెద్ద పెంకుటింటిలో కాపురమున్నాడు ఉన్నవి రెండే ప్రాణాలు. ఎక్కడుంటేనేమనిపించింది కానీ యింటిని అమ్మడమా? రైతు పొలాన్ని అమ్ముకోగలడు. రైతాంగన కూడా అందుకు అతి కష్టంగా ఓర్చుకుంటుంది. కానీ "ఇల్లు లేనమ్మ ఈనం చెడె మగడు లేనమ్మ మానంచెడె" అనే లోకోక్తి పల్లెల్లోనే పుట్టింది. గనుక ఇంటిని అమ్మడానికెలాంటి పరిస్థితుల్లోనూ ఆమె ఒప్పుకోదు

అంతే జరిగింది గూడా త్యాగానికి కూడా ఒక పరిమితి ఉండాలిగా పొలం పోయినా కూలో నాలో చేసి గూడు చేరుకోవచ్చు. ఆ గూడు కూడా లేకుంటే కూడు దొరికి మాత్రం ఏం లాభం?

రుద్రమ్మ ఒప్పుకోదని తెలిసినా వెంకయ్య అడిగేశాడు. రుద్రమ్మ నిరాకరించింది. కానీ నాలుగైదు రోజులుగా వెంకయ్య పడుతున్న ఆవేదనను చూచి అంగీకరించింది. ఐదువేల రూపాయలకు ఇంటిజాగా ధర చెప్పాడు. నాలుగు వేలకు బేరం కుదిరింది.

వెంకయ్య డబ్బులెత్తుకొని పని ప్రారంభించాడు. కావలసింది డబ్బులేగా. పైకం చేతిలో వుంటే జరుగని పనంటూ ఏదైనా వుందా?

ఈ దఫాలో మాత్రం గ్రామంలో చాలామందికి మనస్సు మారింది. కానీ ఆ మార్పు ఇల్లును అమ్మక ముందైతే ఎంత బావుండేది? వెంకయ్య తాను పట్టిన పనిని పూర్తి చేయాలనుకున్నాడు. పూర్తి ఐపోయింది గూడా. పని ముగిసిన నాటి రాత్రి పండు వెన్నెలలో ఒక్కసారి భవనాన్ని చూచాడు.

ఆ రాత్రి రుద్రమ్మతో చెప్పాడు. ఇక మన జీవితంలో సాధించగల్గిందేమీ లేదన్నాడు. ఉదర పోషణం కోసం బెంగ పడవలసిన అవరం కూడా లేదు. రాతిలో వున్న కప్పకు కూడా ఆహారం దొరుకుతున్నపుడు నేలమీద యిందరి ప్రజల మధ్య మనం బ్రతుకలేక పోతామా అంటూ ధైర్యం చెప్పాడు.

ఆ మరునాడు సాయంకాలం రుద్రమ్మ బడివైపు వెళ్ళినది. రేడియోలో పాట వినిపిస్తున్నది.

"తండ్రి సుఖానికి గాంగేయుడు తన
పెళ్ళి మానుకోలేదా?
కర్ణుడు కవచం బీలేదా?
శిబి మై కండల నీలేదా?"

పిల్లలు హాయిగా బంతులాడుకుంటున్నారు. ఆమెను చూచి ప్రధానోపాధ్యాయుడు దగ్గరికి వచ్చి లోపలికి పిలుచుకొని వెళ్ళాడు ప్రతిగదీ చూపించాడు. హాలులో వెంకయ్య చిత్రం నిలువెత్తున వ్రేలాడ గట్టబడింది. ఎంత బావున్నదా బొమ్మ.

"దేవుడుంటే, స్వర్గం వున్నది నిజమైతే మీ దంపతులక్కడ శాశ్వత స్థానంలో వుంటారమ్మా" అన్నాడు ఒక పంతులు.

"ఆ స్వర్గానికంటే ఈ బడిలో వుండడమే ఎంతో బావున్నది" అన్నది రుద్రమ్మ నవ్వుతూ

అవును పాపం! కానీ బడిని చూచుకొంటూ వుండిపోతే జీవనం ఎలా జరుగుతుందో ఆమెకు తెలియదుగా!

వెంకయ్య కూలిచేయడం అంటే ఎంత ఆశ్చర్యమో రుద్రమ్మకు తెలుసు. రుద్రమ్మ పొలంపని చేయడం క్రొత్త గాకపోయినా కూలిచేయడమంటే ఎంత సంకటమైన సంగతో వెంకయ్యకు తెలుసు.

అమాయకులు, నిజంగా పిచ్చి మనుష్యులు. ఒకరి కష్టాల కొకరు నొచ్చుకుంటారు. గానీ స్వీయ కష్టాల గురించి ఆలోచించరు.

నలుగురిలోనూ బాగా బ్రతికిన కాపురం గనుక కూలీ చేయడం కొంచెం లోకువగా కనిపించవచ్చు సంఘంలో. ఐనా వెంకయ్య అందుకు జంకడం లేదు. పొలం పనులు లేని సమయంలో గూడా ఏ కాలువలు త్రవ్వడమో, రోడ్డు పనులో దొరికితే చాలు వెడుతుంటాడు.

☆ ☆ ☆

త్యాగానికీ ఒక పరిమితి వుంది అనే వాదం వెంకయ్య విషయంలో ఓడిపోయిందనే చెప్పాలి. అన్నివిధాలా తగిన యిల్లాలు రుద్రమ్మ. బహుశా వాల్మీకి గానం చేసిన సీతమ్మ త్యాగం గూడా ఈమెతో సరితూగకపోవచ్చు. ఆమె రాణి గనుక వనవాసం చేసిన ఘట్టాన్ని తలంచుకొని జాలిపడుతుంది మానవ హృదయం. అలాంటి సీత సహితం శ్రీ రామునిపై తిరుగబడిన సంఘటనలు లేకపోలేదు. లక్ష్మణునిపై గయ్యాళిలాగు విరుచుకొని పడిన రోజులు లేకపోలేదు. పైగా ఆమె ఎక్కడా కూలీ చేయలేదుగా. రుద్రమ్మ విషయం అలా కాదు ఆమె రోడ్డు కూలీలతో చెట్ల క్రింద కాపురం చేయడం నేర్చుకొన్నది. మగనితో పాటు వృద్ధాప్యంలో కాలే యెండలలో గులకలు మోయడం అలవరచుకొన్నది. జానెడు పొట్ట కోసం ఆమె యింత కష్టపడవలసిన అవసరం లేదు. ఉన్న యిద్దరు కుమార్తెల్లో ఏ ఒక్కరైనా ఆమెను పూలలో పెట్టి పూజిస్తూ పోషించుకోగలరు. కానీ ఒక విధంగా వారికి చెందవలసిన ఆస్తిని దానంచేసి పైగా వారికి భారంగా వెళ్ళి కూచోరాదని ఆమె నిర్ణయం. వెంకయ్య ఆలోచన గూడా అంతే.

ఆశ్చర్యమేమంటే ఆ సంపాదనలో గూడా దానధర్మాలు యదాతథంగా జరిగి పోతున్నాయి. కూలీల బాగోగులను చూడడంలో దంపతులిద్దరికీ యెంతో శ్రద్ధ. వెంకయ్య పెద్దరికం వారికెంతో బాగా నచ్చింది. ఇందుకు ప్రధాన కారణం లేకపోలేదు. రోడ్డు కూలీలకు పెద్దగా వుండేవాడెపుడూ పనిచేయడు. మేస్త్రీతో బాతాఖానీ చేస్తూ

కూచుంటాడు. ఇందుకు ఫలితంగా ఒకటిన్నర రెట్లు అదనంగా కూలీ తీసుకుంటాడు. వెంకయ్య అలా కాదు. అందరితో పాటు నడుం వంచి పనిచేస్తాడు అందరికీ యిచ్చి చివర కూలీ తీసుకొంటాడు అందుకే అతణ్ణి అందరూ అమితంగా ప్రేమిస్తారు.

ఇంతకూ వెంకయ్య అమాయకుడు. నిజంగానే పిచ్చివాడు. ఈ ఇరవయ్యో శతాబ్దంలో యీలాంటి వ్యక్తి కాగడాలు పెట్టుకొని గాలించినా ఈ దేశంలో కనిపించరని చాలామంది అనుభవజ్ఞులే అనగలరు. అంటున్నారు గూడా. ఇందులో గూడా ఆశ్చర్యం లేదు బడికని గుడికని లక్షల రూపాయలు ప్రోగుచేసి అందులో సగం మ్రింగిన రాబందులున్నారు మనలోనే. అక్కడికి నయం అసలు మొత్తాన్ని జీర్ణించుకొన్న మహానుభావులున్నారుగా!

అలాంటి హేమాహేమీలున్న ఈ సంఘంలో రుద్రమ్మ వెంకయ్యలు తమ విలువైన ఆస్తిని త్యాగం చేసి చివరికి యింటిని గూడా అమ్ముకొని కూలీ చేసుకొని బ్రతుకుతున్నారంటే లోకం నమ్ముతుందా?

అవును లోకం నమ్మదు. కానీ వెంకయ్య బడిలో చదువుకుంటున్న పిల్లలు నమ్ముతారు అక్కడ పాఠాలు చెబుతున్న ఉపాధ్యాయులు నమ్ముతారు. అతని త్యాగానికి అబ్బురపడి కావ్య కన్యలను కృతులిచ్చి భక్తితో అంజలి ఘటించిన మహాకవులు నమ్ముతారు. ఆ కృతులు చదివిన పాఠకులు నమ్ముతారు. అంత చాలుగా!

ఒక సమయంలో లోకం నమ్మినా వారాస్తి పాస్తులను అమ్మి దానం చేశారని ఋజువు కనబడినా వారు పిచ్చి దంపతులంటుంది. నిజమే. వారు పిచ్చి దంపతులే, వారి అలాంటి పిచ్చి అందరికీ వుంటే సంఘం యిలాగా పుచ్చిపోతుందా? సంస్కృతి యీ విధంగా చచ్చిపోతుందా లోకంలో!

# పాడులోకం! పాడు మనుషులూ!

## బలివాడ కాంతారావు

నీలకంఠం, తోడి గుమాస్తా పెళ్లాం పోయినప్పుడు అన్నాడు "ఆరోజు వస్తే ఎవరూ ఆపలేరు అయినా నువ్వింత యిదిగా ఉండటం బాగులేదు. చచ్చేవాళ్ళతో మనం చచ్చిపోతామా?" పొరుగింటాయన పెద్దకొడుకు కళ్లు మూస్తే "చావంటే మాసిన బట్టను వదలి కొత్తది వేసుకోవడమేగా! ఆత్మకు చావులేదని తెలుసుకోరేం?" అనుకున్నాడు. ఆ వీధిలో ఒక యింటిలో వారంరోజుల వరకూ ఒక చావుకు మిగిలినవారు ఒకటే యేడుపు "చావుకు యేడ్చే మనం ముస్లింలు క్రైస్తవులు కంటే యెంత వెనుకబడ్డాం!"

నీలకంఠం ఎంత తేలిగ్గా అన్నాడో, అనుకున్నాడో చావు గురించి అంత చులకనగా అభిప్రాయపడ్డాడు.

పాతికేళ్ల పరిచయం ఉన్న భార్య గతించిదీనాటికి. నీలకంఠంకు ఒక కాలు విరిగినట్లు, ఒక చెయ్యి తెగినట్లు, గుండె బీటలు దేరినట్లయింది.

చావు–భయం, భయంకరం–విషాదం! రోజంతా కడుపున నింపుకున్న దుఃఖాన్ని కటికచీకటిలో డాబామీద కన్నీటిగా కొంత కార్చాడు.

ఉండటానికి ఇల్లు సంపాదిస్తాననీ, భార్యకు పట్టుచీరలు కొంటానని, ఒంట నగలు నింపుతానని పెళ్ళయిన మొదట్లో అనుకోవటమే కాదు, – పెళ్లాంతో చెప్పాడు కూడాను. చెప్పటమే కాదు ప్రయత్నించాడు. ఆ ప్రయత్నం ఊహాలోనే జరిగింది. "అదృష్టం ఉంటే అవే వస్తాయ్" అని ఆమె అన్ననాడు నవ్వుకున్నాడు.

తొమ్మిది మాసాలు నిండేవరకు తను ఎవరైనా ఒకటే అనుకున్నా కూతురు పుట్టగానే "ఇంటికి లక్ష్మీకళ" – ఉత్సాహంతో ఊగులాడాడు. ఆ కూతురుకు వీణ నేర్పిస్తాననీ, విద్యల సరస్వతి చేస్తాననీ యెగిరాడు.

"దానిరాత ఎలా వుందో? అప్పుడే ఎందుకనుకోవాలి" అన్న భార్య మీద చిరాకు పడ్డాడు. రాత–రాత– మనుష్యులు సోమరులవటానికి, చేతకాని వాళ్ళవటానికి ఈ పిచ్చి అంటుకుంటుందని అభిప్రాయం వెలిబుచ్చాడు.

ఈ కూతురు పెళ్ళి ఘనంగా చెయ్యాలనీ, గొప్ప ఆఫీసు అల్లుడవ్వాలనీ, అనుకున్నాడు. అందుకు సర్వ ప్రయత్నాలు మనోభావాలతో చేశాడు.

ఒక కూతురు ఒక కొడుకైతే చాలు హాయిగా ఉంటుందనుకుంటే రెండో సంతానం కూతురే!

మూడోసారి తప్పక కొడుకే అనుకున్నాడు. దేవుని యొక్క నిజాయితీ చూదామని భార్యతోపాటు తనూ ఒకటి రెండుసార్లు ఉపవాసమున్నాడు. శివాలయానికి వెళ్ళాడు కొడుకని కలలు గన్నాడు. కొడుకు చదువెలా వుండాలో వ్యూహించుకున్నాడు ఒకరిద్దరితో యీసారి కొడుకు తప్పదని చెప్పుకున్నాడు కొడుక్కీ తనకూ మధ్య యెలాంటి తగాదాలు ఉండవనీ, తను రిటైరై కొడుకు వల్ల సుఖపడతానని తలచాడు కానీ యీసారీ కూతురే! ఆ నిముషం నుంచీ దేవుని మీద భక్తి గౌరవాలు తగ్గాయి. పూజలు పునస్కారాలు బూటకం అనుకున్నాడు.

మూడో పిల్లకు తల్లి ఎంతో గర్వంగా ముగ్గురు పేరంటాళ్ల పేర్లు కలిపి 'వెంకట సీతామహాలక్ష్మి' అని పేరు పెట్టింది నీలకంఠం ఈ సన్యాసి ఎక్కడ పుట్టిపోయిందని సన్యాసమ్మ అని పిలిచేవాడు. చివరకు ఆ పేరే నిల్చిపోయింది

పిల్ల యెప్పుడూ యేడుపే. నీలకంఠంకు ఎంతో చిరాకెత్తేది ఛస్తే పీడాపోయేదని ఆలోచించినా అలా ఆలోచించటం పాపమని మళ్ళీ సర్దుకునేవాడు

సన్యాసమ్మ ఫస్టుఫారం చదువుతో చాలించమంటే యేడ్చి యేడ్చి ఒకరోజు అన్నం కూడా మానివేసింది. భార్య "పోనీ దాని సరదా యెందుకు చంపాలని" బ్రతిమాలటం వల్ల థర్డుఫారం వరకూ వూరుకున్నాడు.

తనకు ఆడవాళ్ళ చదువు గురించి నిశ్చితమైన అభిప్రాయం యీనాటికీ లేదు. ఏమైనా యీనాటి చదువులు ఆడవాళ్లకి పనికిరావని మాత్రం నిష్కర్షగా చెప్పగలడు. సీత, సావిత్రి, శకుంతల నేర్చిన చదువులాంటిది తన అమ్మాయిలకు కూడా చెప్పించాలని, అదే అసలైన చదువని తన అభిప్రాయం. ఆ సిలబసు చెప్పమంటే చెప్పలేదు. చాలామంది చదువుకున్న అమ్మాయిలు పెళ్ళి చేసుకోకపోవడమో, పెళ్ళి చేసుకున్నా మొగుడు చెప్పినట్లు వుండకపోవటం, డొంక తిరుగుళ్లు తిరగటం, గర్వం అహంభావంతో ఎగిరిపోవటం – యిలా యెన్ని దృష్టాంతాలైనా తన వాదనను బలపరచుకోడానికి చెప్తాడు. ఎవరైనా "నీ చిన్నమ్మాయిని యెందుకు చదివిస్తున్నా" వంటే తనకు తెగ కోపం వచ్చేది. వాళ్ళా ప్రశ్న వేశారని కాదు. ఆ అమ్మాయంటేనే కోపం.

సన్యాసమ్మ యిక చదవటం కల్లో మాట. ఏడుపు యిక పని చెయ్యలేదు. నాన్న జీతం భద్రంగా అమ్మ పెట్టిలో పెట్టడం చూసింది. ఆ మరుచటిరోజు యింట్లో పెద్ద రభస జరిగింది. 'సరే! మరేం చేస్తాం పోనీ చదవనియ్యండ'న్న పెళ్ళాం మీద నిజంగా ఈ ఒక్కసారే కోపం వచ్చింది. దొంగతనం చేసి స్కూలు జీతం కట్టిన కూతుర్ని సమర్థించినందుకు భార్యమీద యెగిరిపడ్డాడు.

తరవాత తనేదో తప్పు చేశాననుకున్నాడు. భార్యకు తనిచ్చిన వాగ్దానాలు

జ్ఞాపకానికొచ్చాయి అందులో వెయ్యోవంతైనా తను తీర్చడం లేదు. అయినా ఆమె తనని కనిపెట్టుకొని వుంది. అప్పుడప్పుడూ తను దురదృష్టవంతుడనని అసమర్థుడనని తన భార్య సమర్థురాలనుకోవటం తనకు సరదా!

"ఏమీ అనుకోవద్ద'ని అన్నాడు.

"మీరేమైనా అనకపోతే యింకెవరంటారని" నవ్వుతూ అంది.

అలాంటి భార్య యీనాడు చచ్చిపోయింది.

కొడుకు కావాలన్న ఆశ.... ఆరాటమై.... నిరాశై. .. చివరకు కూతుర్లు యెదుగుతుంటే మంచి పెద్ద హెూదాలోవున్న అల్లుళ్ళు కావాలన్న కోర్కె హెచ్చయింది.

ఈ కోర్కె తీర్చుకోవాలనే ఆరాటంలో –

సంఘం పాడై పోయిందనుకున్నాడు. కట్నాలు రక్తం పిండినట్లు పిండుతున్నారు. ఆడపిల్లలుండటం నేరం! ఉదాహరణలుగా యెన్ని కుటుంబాలనో వేలెత్తి చూపిస్తాడు చాలా సంబంధాలున్నాయని తెలుసు. అవెందుకో తనకు నచ్చవనుకుంటాడు. వాళ్ళతో తనకు పొత్తు కుదరదు. మంచి మనసుకలవాళ్ళయితే ముందుకే వచ్చేవారు!

ముఖ్యంగా తన పెద్దకూతురు పెళ్ళే మనసులో యిర్వై నాలుగ్గంటలూ వుండేది. ఆమెను ఒక చక్రవర్తికిచ్చినా తన ఋణం తీరదు. ఆ కూతురు కడుపులో ఉన్నప్పటినుంచీ గర్వించాడు. రాను రాను పలవరించాడు. రోడ్డు మీద యెవరైనా అందమైన కుర్రాడు కనిపిస్తే తేరిజూచేవాడు ఒక్కొక్కసారి నా కూతురికి తగినవాడీ లోకంలో లేడేమో అనిపించేది అందం వుంటే గుణం పూజ్యం, గుణం వుంటే అందం తక్కువ!

ఒక్కొక్కసారి అనుకొనేవాడు "ఈ కుర్రాడు చాలా మంచివాడు కట్నం లేకుండా పెళ్ళి చేసుకోవాలని పట్టుదల. కానీ తండ్రి వేల మీద ఉన్నాడు. ఈ సంఘర్షణలో పాపం నలిగిపోతున్నాడ"ని విచారించేవాడు.

ఇంకో ముసలాయనని చూసి "ఈయన రెండువేపులా ఖర్చులు భరించుకొని వున్న ఒక కొడుకును పేదింటి పిల్లనిచ్చి పెళ్ళి చేద్దామనుకుంటున్నాడు గానీ పెళ్ళాం కొడుకు కాదంటున్నారు" "ఉద్యోగం అయ్యాకగానీ, పెళ్ళి చేసుకోనని" చెప్పేవాళ్ళు చాలామంది తన వూహకు వచ్చేవారు. ఈ వూహలో వచ్చినవాళ్ళలో పెళ్లయినవాళ్ళు, పిల్లలున్నవాళ్లు కూడా వుండేవారు

తన వూహ ఒక్కసారే నిజమైంది. బాగా డబ్బున్నవాళ్ళే. ఆ అబ్బాయిని చూడగానే కమ్యూనిస్టనుకున్నాడు. అక్షరాలా నిజమైంది. ఆ తండ్రి ఆ కొడుకు కోసం పడ్డ ఆరాటం! తండ్రినే దొంగలా చూస్తాడేం ఆ కొడుకు? నీలకంఠం తనకు ఆ కుర్రాడు అల్లుడు కాకూడదనుకున్నా రెండురోజులవరకు విచారించాడు. ఈ లోకంలో ప్రజలు యెందుకు యిన్ని పార్టీలుగా విడిపోతారో తనకు అర్థం కాలేదు. తనకు మొదటినుంచి యిప్పటికీ ఒకటే దృక్పథం. తను ఆరోజుల్లో ఖద్దరు కట్టాలనీ, సత్యాగ్రహం చెయ్యాలనీ, జైలుకు వెళ్ళాలనీ, త్యాగ పురుషుడవ్వాలనీ ఎంతో వుబలాటపడ్డాడు. ఏదీ జరగలేదు కాని తనకు కమ్యూనిజమంటే పూర్తిగా తెలియకపోయినా మనిషిని కమ్చీతోకొట్టి పనిచెయ్యిస్తుందని

అసహ్యంగా చూస్తాడు.

అయినా యీ ప్రజలు ఒకరినొకరు అసహ్యించుకోవటం తనకు గిట్టదు. తన చిన్నకూతురు మీద తనకు అసహ్యం అంటే ఒప్పుకోడు కూతురంటే అభిమానమే కూతురు గుణాలంటే నచ్చవు కాని. ఈ లోకంలో ఎవరికి తగ్గ కష్టాలు వాళ్ళకి ఉన్నాయి డబ్బుకోసం ఒక తెగ కష్టపడితే, మానసికంగా మరికొందరు బాధపడతారు – అంతే భేదమని చెప్తాడు.

అల్లుళ్ళకోసం ప్రయత్నించింది తక్కువ – ఆలోచించింది యెక్కువ మనసులో బాధపడింది బ్రహ్మాండం!

ఆఫీసులో తను డబ్బు రాబట్టుకోగల సీటులోనే ఉండేవాడు ఈ కూతుర్ల పెళ్ళి ఒక్కొక్కసారి మనసును ఆ విషయంవేపు త్రిప్పేది. ఎంతోమంది పుచ్చుకుంటున్నారు కదా, తను ఎందుకు పుచ్చుకోకూడదని పొరపాటున అనుకున్నాడు పని అయ్యేవరకు బ్రతిమాలి డబ్బు చేతపెట్తారు. తరువాత శాపాలు కురిపిస్తారు. అంతేకాకుండా డబ్బు పుచ్చుకుంటే తన్ను తానే తిట్టుకోవాలి! అనుమానించాలి లోకం యెన్నికయిన మనిషిని అనదు దొంగని చూపించినట్లు వ్రేలితో చూపిస్తుంది. తను వృత్తి గాలిబుట్టవలె తేలిపోతాడు. లంచాలు పుచ్చుకున్న తోడి గుమాస్తా పెళ్లాం చచ్చిపోయిందే! తనలా చేస్తే తన పెళ్లాం పోతుంది. వద్దువద్దని వందసార్లు అనుకున్నాడు. ఈ బ్రతుకే చాలు. . ఈ పెళ్ళామే మహాలక్ష్మి!

పెద్ద కట్నం యెరచూపలేని తను పెద్దకూతురు పెళ్లినాడు ఎంత బాధపడ్డాడు! ఈ సంఘం మీద యెంతగా యేడ్చాడో. తను అనుకున్నదల్లా జ్ఞప్తికి వచ్చి గుండె పగిలిపోయింది అందం నెమ్మది ఆభరణాలుగాగల యీ కూతుర్ని ముందూ వెనుక యెవరూలేని తనలాంటి గుమాస్తాకే యిచ్చారు!

ఈ పెళ్లయినా తను యేవగించుకున్న పెళ్ళాం పిసినారితనం వల్లనే జరిగింది!

గుండెలో పుండు యింకా మానలేదు. గునపం పోటులా తగిలింది. విద్యల సరస్వతిగా వీణావాణిగా యింకా వూహలో నిలిచిన కూతురు విధవై కూర్చుంది! దేవుడు గుడ్డివాడని యేడ్చాడు.

విధవా వివాహాలంటే తనకు ప్రీతి. వీరేశలింగంగారంటే భక్తి. ఎవరైనా అలాంటి వివాహాలు చేశారంటే ముచ్చట పడతాడు. కానీ తన కూతురుకు మళ్లీ పెళ్లి చెయ్యటమంటే గిట్టనిపని!

ఆడవాళ్లు పవిత్రులనీ వాళ్ల పాతివ్రత్యమే మన సంఘాన్ని సాంప్రదాయాల్ని యీ దొరలు రాజ్యం చేసినా నిలిపిందనీ తన గట్టి నమ్మకం. తన భార్య ఎప్పుడూ నాకిది కావాలని అది కావాలని కోరలేదు. తన మాటకు యెదురాడలేదు. బాధపడటానికి జంకలేదు. అన్నిటికీ తల ఒగ్గింది. ఈ నరకాన్ని స్వర్గం చేసుకుంది.

అచ్చంగా ఆమెలానే కూతుర్లూ వుండాలని కాంక్షించాడు నీలకంఠం. అందుకే మొదటి యిద్దరు కూతుర్లంటే తనకు తెగ అభిమానం. భార్యకు వీళ్ళకు తేడా – భార్య

ఉత్తరం వ్రాయలేదు – వీళ్ళిద్దరు వ్రాయగలరు.

ఇన్ని కష్టాలూ పంచుకున్న భార్య పోయింది. ఆలోచించాడు. ఆమెతో వున్న కాలమంతా నెమరు వేసుకున్నాడు. ఏకాకిగా యేడ్చాడు. ఆ వయసులో వాళ్లెవరూ అంతగా యేడవనట్లు యేడ్చాడు. అంతేకాదు, ఆ భార్య చివరి ఘడియలు జ్ఞప్తికి వస్తే యీ పాతికేళ్ళూ దగ్గరగా వున్నవాడు ఆమెకు దూరమైనట్లు అనిపించేది. ఆ ఆలోచన రాకుండా వుండాలని ప్రయత్నించేవాడు.

"ఆమె స్వంతలాభం చూసుకుంది. ఆమె జీవితంలో ఒక్కసారే – అదీ చనిపోయే ముందు" నీలకంఠం దృష్టిలో! యింత కల్లోలంగా వున్న యింటిని చూసి ఎలా విడిచి వెళ్ళింది? పుణ్యస్త్రీ చావు రావాలని కోరుకుందే? ఏమిటో పిచ్చి! అంతమంచి మనిషి యేం కోరుకుంటే అది రాదూ? భార్య యింకా బ్రతుకుతానని కోరుకుంటే నీలకంఠం దృష్టిలో బ్రతికేదే!

ఆమెతో ఇల్లు సంపాదిస్తానన్నాడు ఆమె అద్దె యింటిలోనే చనిపోయింది. ఒంట నగలు నింపుతానన్నాడు మంగళసూత్రంతోనే మాయమైపోయింది. పట్టుచీరలు కొంటానన్నాడు. మాసిన బట్టలతోనే చనిపోయింది! అయినా ఆమె యివేవీ లేకపోయినా "నాకేం లోటు" అంటుండేది!

ఇదే తలపుకు వచ్చి మరీ కళ్ళు నులుపుకున్నాడు!

ఇటు మనసులో మూలుగుతూ అటు పెద్దమ్మాయి లిద్దరివేపూ చూస్తుంటే గుండె తరుక్కుపోయేది!

ఇద్దరూ ఆ తల్లిని తల్చుకుని యేడుస్తారు. వాళ్ళని తను ఓదార్చాలనుకున్నా ఓదార్చలేడు! తను అసమర్థుడని అనుకోవటం కన్నా లోకం తనకు అన్యాయం చేసిందని ఎవరితోనూ చెప్పుకోలేకపోతున్నాడు. తన ప్రస్తుత పరిస్థితులలో రెండో అమ్మాయి పెళ్ళి వూహించడానికైనా వీలులేనిదని స్ఫురించింది.

అంత నమ్రతతో బతికిన యిల్లాలికి తను యెంతైనా ఋణపడియున్నాడు. ఆ ఋణం తీర్చుకోడానికి కార్యానికీ మాసికాలకు రూపాయికు నెలకూ అణా వడ్డీలకు అప్పు వాడటానికి జంకలేదు ఒక మిత్రుని దయవల్ల ఒక షావుకారు దగ్గర యెటువంటి హామీ లేకుండా యీ మూడువందల చిల్లర దొరికింది! అలా దొరికిందీ అంటే ఆ భార్య మంచితనమే అనుకున్నాడు.

నెలనాడు ఇరవై రూపాయలు వడ్డీ కట్టాడేకాని మనసు భయంతో నిండిపోయింది. అన్నమాట నిలపటం తన విధి. తను గంజి తాగైనా అప్పు తీర్చాలి అని అనుకున్నాడు – ఆ విషయం అహోరాత్రాలు ఆలోచించేవాడు.

ఈ ఆలోచనతో నీరసించటం అలా వుంచి, చిన్న కూతురొక సమస్య తెచ్చి పెట్టింది. తల్లిపోతే బెంగపెట్టుకొని కుమిలిపోవలసింది! నిజానికి ఆ తల్లి మిగతా యిద్దరికన్నా, యీ చిన్నకూతుర్నే బాగా చూసింది. వాళ్ళలా యీ కూతురు క్రుంగిపోకపోవటం చూసి యెంత కృతఘ్నురాలని అసహ్యపడ్డాడు!

ఇంటరులో చేరుతానని పట్టుపడితే తను పట్టలేని కోపంతో మాటాడలేక పళ్లు పటపటలాడించాడు. స్నేహితురాళ్ళు సహాయం చేస్తామంటున్నారు మీరేమీ అడ్డుపెట్టకండి అంటే వెటకారంతో యీసడింపు మాటలాడాడు దీనితో కూతురు యింట్లో మిగతా యిద్దరిలా దేవతా విగ్రహంలా పవిత్రంగా వుంటుందనుకున్నాడు

సన్యాసమ్మ యింటరులో చేరింది! ఎప్పుడూ లేనిది నీలకంఠం కళ్ళు తడుపుకొని తన కోపాన్ని దుఃఖంతో మిళితం చేసి మిగతా కూతుళ్ళ దగ్గర వెళ్లగ్రక్కాడు భార్య ప్రయత్నం లేకుండానే జ్ఞాపకం వచ్చింది.

కాలేజీ నుంచి ఇంటికి వచ్చిన చెల్లెలిని యిద్దరూ మందలించారు నాన్న కష్టాన్ని చెప్పారు!

సన్యాసమ్మ తనను కాదన్నట్లుగా వూరుకొని మళ్ళీ స్కూలుకు పోతూ అంది! "నాన్నకా దొంగతనం ఎందుకు? నన్నేమైనా అనాలని వుంటే నా యెదురుగా అనకూడదేం?"

అసలు మన సంఘంలో యే యింటిలోనూ జరగనిపని జరిగిందని నీలకంఠం బాధపడ్డాడు!

దాని ప్రతిఫలం ఆ మరుచటి నెల తను వూహించినట్లే కనపడింది ప్రయివేట్లు కూతురు చెప్పటం చూశాడు. ఒకనాడు ఆఫీసు నుంచి వస్తూ గోడల మీద రాతలు చూసి కళ్ళు పొడుచుకోవాలనుకున్నాడు. తన పెళ్లాన్ని తలుచుకొని మనసు నింపుగా దుఃఖాన్ని నింపుకున్నాడు ఆ కోపంతో వచ్చి "చూడండమ్మా! మీ చెల్లెలు పేరు గోడలెక్కిందే! కర్మ!" అంటూ తల బాదుకున్నాడు.

ఇద్దరు కూతుళ్ళ కళ్ళలో నీటి పర్యంతం వచ్చింది రెండో అమ్మాయి ధైర్యం చేసుకొని చెల్లెల్ని మందలించింది.

"ఎవరో తెలివితక్కువ వెధవలైతే నేనెందుకు బాధపడాలీ? రాయటమే కాదు - పేపర్లు కూడా పంచి పెట్టనీ" అంది ఈ మాటలు ఒక చెవిని వింటున్న తండ్రికి ఒళ్ళంతా జరజరలాడింది.

ఇంకో నెలలో కూతురు జోడు వేసుకోవటం చూశాడు. మడమలు కొద్దిగా ఎత్తుగా ఉన్నాయ్. ఏదో బ్రహ్మాండం బ్రద్దలైనట్లనిపించింది. అది మన సంస్కారానికి తగనిదనిపించింది. ముఖమెత్తుకొని రీవీగా నడిచే ఆడవాళ్ళని గౌరవించటం తను నేర్చుకోలేదు ఇన్నాళ్లూ ఆగాడు. కూతురు ఒకనాడైనా ఒక కానీ అడుగుతుందేమో యని. అడగకపోవటంతో తను యింటికి పెద్దననే విషయాన్ని గమనించలేదని యేవగించుకున్నాడు. చిన్న కూతురికి ముఖం చూపించడమన్నా ఆమెతో మాట్లాడడమన్నా అసహ్యమైనపని - తన మనసు ససేమీరా ఒప్పుకోలేదు. దీనికింకో కారణం కూడా వుంది. ఆ వీధిలోనే కొందరు కాలేజీ కుర్రాళ్లున్నారు. ఒక నెల అవసరానికి ఒక కుర్రాడ్ని అడిగి అప్పు తీసుకుందని తెలిసిపోయింది. ఆ కుర్రాళ్ళంటే తనకు అసహ్యం, వాళ్లు తన పిల్లల కోసం చప్పరిస్తుంటారని! అలాంటి తెగలో వాడిని అడిగింది!

ఈ కోపం ఉంచుకోడానికి మనసులో చోటులేక వెళ్ళగ్రక్కాడు. "ఆడవాళ్ళ ప్రతి

చిన్న విషయంలో మగవాళ్ళు మహా తెలిసినట్లు జోక్యం చేసుకోవడం అంత మంచిపని కాదక్కా! ఆడవాళ్ళ బుర్రలో మట్టిలేదుగా. ప్రతీ దానికీ నాన్న మీదనే ఆధారపడమంటావ్! కన్నందుకు కడుపునిండా తిండి పెడుతున్నారు చాలదా?"

ఈ సమాధానముతో యిద్దరూ నోరు మూసుకున్నారు.

సన్యాసమ్మకు చదువిచ్చిన సంస్కారం నడకలోనూ, వేషభాషల్లోనూ కనిపిస్తూనే వుంది. అందమైన ఆ ముఖానికి మెరుగు పెట్టిందీ చదువు. మాటల్లో ముత్యాలు రాలతాయి. నవ్వకుండానే మోదాన్ని గొలిపే ముఖం చిరునగవు వెలబోస్తే చూచేవాళ్ళు చాలసేపటివరకూ, మనసు నుండి తుడిచి వెయ్యలేరు. యౌవనం ప్రతి అవయవంలోకి చొచ్చుకొనిపోయి విజృంభించినది.

ఇలాంటి కూతుర్ని తను ఎంత స్వేచ్ఛగా విడిచిపెట్టాడు? లోకం ఏమనుకుంటుంది? ఆమెకు చిన్ననాడు వచ్చిన జబ్బులు తలపుకు వచ్చాయి. అనుకోకుండానే డ్యాక్టరుని ఎందుకు పెట్టానని తికమకపడ్డాడు.

ఈ కూతురు మనస్సుకు యిచ్చే ఆవేదనతోపాటు అటు డబ్బుకు కూడా చిక్కులు పడుతున్నాడు. ఇదివరకు ఒకరిదగ్గరకు వెళ్లి చేయిచాపే అవసరం తన భార్య కలగనివ్వలేదు. ఇపుడు తెచ్చిన డబ్బు ఖర్చు పెట్టడం కూడా తనకు తెలియడం లేదు. తను ఒకసారి హెచ్చు ఖర్చు పెట్టేస్తున్నాని, యింకొకసారి పిసినారినై పోతున్నానని అనుకున్నా తనకు యెన్నడూ లేనిది డబ్బున్న వాళ్ళ ఖర్చులతో తన ఖర్చులు, వాళ్ళ నిజాయితీతో తన నిజాయితీ వాళ్ళ కష్టాలతో తన కష్టాలు పోల్చుకోవటం అలవాటయ్యింది. ముఖ్యంగా నెలకు వడ్డీ కట్టిననాడు మనస్సెంతో అలమటించిపోయేది ఆ బాధతో ఎందరో తనలాంటి గుమాస్తాల గురించి, కుటుంబాల గూర్చి, కడుపు సొదతో అలమటించే అడుక్కొనే వాళ్ళ విషయం ఆలోచించేవాడు ఆ రాత్రంతా నిద్దర వుండేది కాదు. రష్యాలో అంతా ప్రభుత్వమే చూస్తుందట – మనదేశంలో అలాంటి ప్రభుత్వం లేదే అనిపించేది. మిగతా డబ్బు యింట్లో చాలక యే స్నేహితుడినో అడిగితే వాడు లేదన్నప్పుడు మెడకు వురిపోసుకుకోవాలన్నంతగా మనస్సు చచ్చిపోయేది.

రానురాను ఆర్థికంగా కష్టం వూహించటమే కాకుండా అనుభవించటం జరుగుతోంది. రోజుకు రోజు మనిషి బెంగతో నీరసించి పోతున్నాడు. తనెందుకా అప్పు తీర్చాలని కూడా ఆలోచించకపోలేదు. మధ్యను ఒక్కడ్ని పెట్టాడే – అందులో ఆ డబ్బు భార్యకోసం వినియోగించాడే – మాటపోదూ?

తనకు యిదివరకులా దృఢంగా వుండే నమ్మకాలు కూడా చెదరజొచ్చినయ్. నిజాయితీ యేమిటనుకున్నాడు తన తహశీల్దారు రెండు కుక్కలను పెంచుతున్నాడే – తన హెడ్ గుమాస్తా స్వంత మేడలో ఉంటున్నాడు? తనకు తెలిసిన వాళ్లలో నిజాయితీ ఉన్న వాళ్ళెవరూ కనపడలేదు. తనలా బాధపడ్డ వాళ్లెవరూ లేరు. తను నిజాయితీగా ఉండి మాత్రం ఏం సుఖపడ్డాడు? తన పెళ్ళామా పోయింది. తన కూతురా విధవైంది – తనకా మగ సంతానం లేదు. ఆడపిల్లలు కన్నందుకు బాధ్యత తీర్చుకోలేకపోయాడు.

ఇదే నిశ్చయానికి వచ్చి తనకు డబ్బిచ్చేవాళ్లెవరూ అగుపడలేదు. ప్రతిదానికీ మీదనున్న వాళ్లే తడుముకుంటుంటే తనవరకూ వచ్చేదేమిటి? బేడకూ పావలాకు కక్కుర్తిపడే బదులు వూరుకుంటే ఉత్తమం. డబ్బున్నవాళ్లు మరింత పెరగడానికి, పేదవాళ్ళ మీద సవారీ నిజంగా చేస్తారని వాళ్ళ మానసిక బాధలకి ఈ సవారీ సరిగ్గా చెయ్యలేకపోయామనేదే కారణమని తోచింది. ఇన్ని పార్టీలుగా ప్రజలు విడిపోవటంలో బేసబబు యేమీ లేదనిపించింది. సుఖం లేనిది ప్రజలంతా ఒకతాటిని ఎలా నడుస్తారు? కొందరి కడుపులు మాడుతుంటే మరికొందరి కడుపులు నిండుగా ఉంటాయ్ – కొందర్ని చూచి మరికొందరు అసహ్యించుకుంటారు. . ... ఒకరి నీడ ఇంకొకరు చూడలేరు పేపర్లలో పెద్దపెద్దవాళ్లు ప్రపంచ శ్రేయో ప్రభుత్వమనీ ప్రజా ప్రభుత్వమనీ ఇలా పెద్దగా యిచ్చే ఉపన్యాసాలు చూస్తుంటే ఇదివరలా తను యిప్పుడు ఆసక్తి చూపించలేకపోతున్నాడు సంస్కృతి గురించి ఎవరైనా మాటాడితే ఇదివరలా చెవియొగ్గలేకపోతున్నాడు ఆకలితో ఉన్న కడుపుకి అన్నమే సంస్కృతి. బాధపడే మనిషికి సుఖమే సంస్కృతి..... ఈ సుఖం కమ్యూనిజంలో వస్తుందని విన్నాడు. దానిగురించి కొంత తెలుసుకున్నాడు. ఎలక్షన్‌లో ఆ పార్టీకే ఓటు వేశాడు రాజకీయ చైతన్యం లేకుండా బ్రతకకూడదని తోచిందతనికి. తను రిటైరయ్యేలోగా ఈ దేశంలో అంతా ప్రభుత్వం చూసుకునే పరిస్థితి వస్తే ఎంత అదృష్టం -అనుకున్నాడు.

ఈ డబ్బు విషయంలో తప్ప మిగతా విషయాల్లో రష్యా సాధించిన అభ్యుదయాన్ని తను కోరలేదు. రష్యాలో స్త్రీలు గద్దెక్కి మాటాడతారు సైకిళ్ళు తొక్కుతారు. విమానాలు నడుపుతారు. మొగాళ్ళతో సరిసమానంగా ఉంటారు – వాళ్ళ పనిని పంచుకుంటారు; అది ఈ దేశానికి పనికిరాదని నీలకంఠం నిశ్చితాభిప్రాయం. మన బతుకులు వేరు, యేమైనా మన జీవితాశయం వేరు. ప్రపంచంలో మన మతానికి ఒక విశిష్టమైన స్థానం మనకు గొప్ప సాంప్రదాయాలు వున్నాయి. ఆడది పూజింపదగ్గ పవిత్ర వస్తువు వాళ్లు గృహలక్ష్ములు భర్తయందు గౌరవం..... నవ్వుతూనే కష్టాలు అనుభవించే సహనంగల వాళ్లీ దేశపు స్త్రీలు!

ఆర్థిక సంబంధమైన ఆశయాల్లో మార్పు వచ్చినా, నీలకంఠం నిజ స్వరూపం అట్టే మారలేదు. అంచేతనే తనకూ, చిన్నకూతురుకూ తగాదా వచ్చింది.

ఈసారి అనుకోకుండానే కూతురు మీద విజృంభించాడు.... సన్యాసమ్మ వెంటనే జవాబు చెప్పకుండా తరవాత తండ్రికి వినిపించేటట్లు పెద్దక్కతో అంది. "అభ్యుదయం అనేవాళ్ళే అలా తీసుకుంటే నేనేం చేస్తాను! మనుషుల నాలుకకు హృదయానికి పోలిక లేదెప్పుడూ. వాళ్లని నాన్న పెద్ద మనుష్యులుగా భావించడమెందుకో?"

ఈరకమైన మాటలు తనకు మరింత వెర్రెత్తించాయ్. ఏం లేకపోతే లోకం వూరికే అనదు. తన కూతురు ఆ డిమాన్‌స్ట్రేటరు వలలో చిక్కుకుందనే దృఢమైన వూహ తనను వూరుకోనియ్యలేదు. కాలేజీ కుర్రాళ్లు తనను చూసి అనలేదే! వాళ్లు దారంట పోతూ అనుకుంటుంటే తను విన్నాడు; కూతుర్ని రేపట్నించీ కాలేజీకి వెళ్లొద్దన్నాడు.

"చాల్లేద్దూ యీ చదువు" అంది రెండో అక్క. సన్యాసమ్మ నెమ్మదిగా "నాకు

తెలుసు. చదువుకుంటే ఆడదాని శీలం చెడుతుందని యీరకం వాళ్ళ వుద్దేశం! అమాయకురాలిగా కనపడని ఆడదాన్ని గౌరవించలేని వాళ్లు ఆత్మవంచన చేసుకుంటున్నారు. అందుకే యేమైనా అంటారు. ఆ డిమాన్‌స్ట్రేటరుకు జవాబు చెప్పకుండా వుంటేయెంత గర్వం అనేవాళ్లూ లేకపోరు!" అంది.

ఇంకా కూతురు చలించకుండా కళ్ళలో నీరు లేకుండా మాట్లాడటం నీలకంఠం కోపం రెట్టింపు కావడానికి ఆధారమైంది. ఇంక యిల్లు కదలితే కాలు విరగగొట్టానని అరిచాడు. కళ్ళలో కోపం నీటిని గిరగిర త్రిప్పింది. ఎవర్నైనా క్షమించగలడు కాని శీలంలేని ఆడదాన్ని క్షమించలేడు. నేను చదువు మాననని కూతురు వెంటనే జవాబు చెప్పటంతో పళ్ళు పటపట కొరుక్కొన్నాడు పెదాలు కరచుకున్నాడు. ఈ కూతురు ఎవరితోనో లేచిపోయి తను వురి పోసుకొనేటట్లు చేస్తుందనుకున్నాడు.

ద్విగుణీకృతమైన కోపముతో సిగ్గుదెచ్చుకోమని యింకా నానామాటలూ అన్నా సన్యాసమ్మ అక్కడ నుంచి జవాబివ్వకుండా కదలిపోయింది. యిద్దరు అక్కలూ నాన్న కాళ్ళ మీదపడి క్షమాపణ కోరుకో అన్నట్లుగా చూస్తుంటే చివరకు నెమ్మదిగా అంది "చస్తానుగానీ . . "

ఈమాట స్పుటంగా చెవులో పడగానే నీలకంఠం మనస్సు అదోలా అయిపోయింది. ఆ రాత్రి పడుకుందామన్నా ఆ మాటే మనస్సులోనుంచి కదల్లేదు. తెల్లారి లేవగానే చావు మనసులో తిరిగింది. గబగబ అద్దంలో చూసుకున్నాడు. తనెంతగా చిక్కిపోయాడు? నిజంగా సగానికి సగమయ్యాడు. బలంలేనిది బ్రతుకేమిటి? తను అప్పులతోనే క్రుంగిపోతున్నాని ఆ వడ్డీలు పుచ్చుకొనేవాళ్ళు తనని పిప్పి చేస్తున్నారని, వాళ్లనెందుకు తను పోషించాలని యిలా యెంతో వూహించటం జరిగింది.

ఆవేళ పేపరల్లో చావు గురించి పడిన వార్త చదవటానికి జంకాడు ఆ మరుచటిరోజు యేదో శవం వెళిపోతుంటే తలదించి ప్రక్కరోడ్డు గుండా వెళ్ళిపోయాడు.

చిన్న కూతురునిచూస్తే తనకేదో భయం ఆవరించింది. ఆమెను ఒక అసహ్యపు ముద్దగా పరిగణించాడు. ఈ రోజుల్లో యెంత ఆలోచించకూడదనుకున్నా మనసులో ఆ చావు విషయమే తిరుగుతోంది. రోజుకు రోజు ఆ భయం పోతోందని అనుకోవాలనుకున్నా అది హెచ్చు అవుతోంది.

అబ్బబ్బ! ఏమిటే యింత పిరికి! అనుకున్నా - అమ్మో! నేను యిలా యెండిపోయానే యే నిమిషంలో ఒంటికేమొస్తుందో నన్న భయం ఈ అప్పుల భయంతోపాటు నరాలన్నిటినీ పీకేస్తోంది!

తను చిన్న దగ్గు దగ్గినా, చిన్న రొంప చేసినా పెద్ద కూతుర్లిద్దరివేపు జాలిగా చూసేవాడు. ఒకనాటి రాత్రంతా వాళ్ళిద్దరి గురించే ఆలోచించాడు. ఆ రాత్రి తను త్వరగా చచ్చిపోతానన్న అనుమానమే తన్నలా క్రుంగదీసింది!

ఆ మరుచటిరోజు నుంచీ తను శ్రమపడకుండా వుంటే బ్రతుకుతానని అనుకున్నా శ్రమపడుతూనే వున్నాడు జీతం అందుకొని వడ్డీ కడుతూనే ఉన్నాడు. తను అన్నం

కొద్దిగానే తింటున్నాడు.

రాను రాను ఒక దెయ్యంలా యీ చావు భయం తన్ను బాధిస్తూనే ఉంది. తన నీడనే చూసి భయపడేవాడు. ఏ రాత్రి మీద తెలివి వస్తే అరుంధతి చుక్క కనిపిస్తోందో లేదోనని చూసేవాడు. ఒక్కొక్కసారి కనిపించేదికాదు. దానితో మనసు వికలమయ్యేది! తన భార్య చావు జ్ఞప్తికి వస్తే - ఇదివరలా ఆ చావు తలచుకోలేకపోయేవాడు!

తన యిద్దరి కూతుర్ల మీద అభిమానమే తన నింతగా భయపెట్టోందనుకున్నా ఆ అభిమానం రోజురోజు రెట్టింపవుతోంది ఒక్కొక్కసారి ఆలోచనలు చాలా దూరంగా వెళిపోయేవి! తను చచ్చిపోతే - వాళ్ళు అడుక్కుంటారు - అడుక్కుంటే? ఎవరు కానీ వేస్తారు? యిచ్చినా యెన్నాళ్ళు!

నిజంగా తనకు ఒకనాడు జ్వరం వచ్చింది. కూతురే అంది జ్వరం వచ్చింది ఆఫీసుకు వెళ్లవద్దని. తనకు జ్వరం వచ్చిందనుకోవటం యిష్టం లేదు ఏమీలేదని మొండికెత్తి ఆఫీసుకు వెళ్ళాడు. త్రోవలో తల తిరిగిపోతూంటే లోకం, వ్యక్తులు, వ్యవహారాలూ అంతా ఒక బూటకం అనిపించింది. తహశీల్దారు నుంచీ బంట్రోతు వరకూ లంచగొండులుగాను, కుర్రాడి దగ్గరనుంచి ముసలాళ్ళ వరకూ స్వలాభపరులుగానూ కనిపించారు. చివరకు తన్ను తానే అసహ్యించుకోజొచ్చాడు తనొక పచ్చి అసమర్థుడని తోచటమే కాదు, నిర్ధారించుకున్నాడు ఇలా తను అనుకోగలిగాడంటే ఆ కూతుర్ల మీద నున్న అనురాగమే!

చిన్నమ్మాయి డాక్టరుకి చూపిద్దామంటే కోపం వచ్చింది. లంఖణాలు చేసినా మనిషి మరింత నీరసించిపోయాడు గాని జ్వరం తగ్గలేదు. ఇల్లు కదల్లేని పరిస్థితి వచ్చింది. మంచం యెప్పుడైతే యెక్కాడో ప్రతిక్షణం బలంలేని మనస్సుకు చావు తలపు బాగా అంటుకుంది!

నాలుగురోజులు గడిచాయి. జ్వరం తగ్గే అవకాశాలేమీ కనపడలేదు. ఏ నిముషంలో తను చచ్చిపోతానో అనుకొనేవాడు. గుండె ఆగిపోతున్నట్లనిపించేది. తనకు దేవుని మీద భక్తి పూర్తిగా చచ్చిపోలేదు. ఇలాంటప్పుడు తను గంటల తరబడి ప్రార్థించాడు. తను దేవునికి పూజా పురస్కారాలు చేయకుండా అపరాధం చేసినా, తన పెళ్ళాం, యిద్దరు పెద్ద కూతుర్లు అపరాధం చెయ్యలేదు. అంచేత వాళ్ళిద్దరికోసం తను చచ్చిపోకుండా వుండే వరం ప్రసాదించమన్నాడు. చావు రాదు రాదనే కోరిక ప్రతిక్షణంలో నింపుదామనుకొనే అధైర్యాన్ని నింపుకుంటున్నాడు.

ఇద్దరు కూతుర్లూ దగ్గర వాడిన ముఖాలతో కూర్చుంటే కడుపులో కత్తితో పొడిచినట్లయ్యేది. అవును - తనొక్కడే యీ లోకంలో అసమర్థుడు!

ఎంత సంక్షోభం చెందినా ఆ మాట తను బయటకు అనలేకపోయాడు. కూతుర్లు తెగించి అంటారని కాంక్షించాడు. కానీ వాళ్ళు తల్లి శరీరంలో బాగు లేనప్పుడెలా యేడ్చారో అలానే యిప్పుడూ యేడుస్తున్నారు. వాళ్ళ యేడుపుకు కారకుడు తనేగా? వాళ్ళకు యీ రక్తమాంసాలతో తప్పించి యింకేమి వుంచాడు?

ఒక్క మూలుగు బాధతో మూలిగాడు కూతుర్లిద్దరూ మరీ దగ్గరకు జరిగారు. ఇద్దరి చేతులు పట్టుకొని కళ్ళల్లో నీరుబికి ప్రవహిస్తుంటే యిద్దరూ వెక్కి వెక్కి యేడుస్తున్నారు. "సరమ్మా - సరి - మీ అమ్మదగ్గరకు వెళిపోతాను..... మీ గతి....!"

ఉధృతంగా వచ్చే దుఃఖం మాటలను రానియ్యలేదు. కూతుర్ల నోటి వెంబడి మాట విందామని మహా వుబలాటపడుతున్నాడు.

నిమిషాలు దాటిపోతున్నాయి. ఏడుపు తప్పించి ఒక్క మాటా రాలేదు. ప్రతిక్షణం యిదే ఆఖరుక్షణం అనుకుంటూనే ఆ ఒక్క మాటా విందామని నిరీక్షణగా చూస్తున్నాడు. కాలం దొర్లుకపోతోంది. తన కాంక్ష క్రుంగిపోతోంది. నిరాశతో నిట్టూర్పులను విడుస్తున్నాడు. రాను రాను "మాకేం నాన్నా" అనైనా యీ కూతుర్లు అంటారేమోనని, ఆ మాట వినైనా చచ్చిపోదామని యెదురు చూశాడు!

మళ్ళీ అన్నాడు "పాడు మనుషులు-యీ పాడు లోకంలో.. . మీరు బ్రతకడానికి..... యేమీ వుంచలేదమ్మా! ఎలా వుంటారో?"

ఈ మాటలకు మరింత యేడుపు తప్పించి మాటలు రాకపోవటంతో చిరాకు, దుఃఖం, కోపం, జాలి అన్ని అనుభూతులూ ఒక్కసారిగా కల్గాయ్.

తన భార్య చావు జ్ఞప్తికి వచ్చింది! ఎంత హాయిగా చచ్చిపోయింది! తనకా అదృష్టం లేకపోయింది. యీ జన్మ ఉత్తి పనికిమాలినదైందని తలపుకు వచ్చింది. తను చచ్చిపో తున్నాడు. . ఏడుస్తూ చచ్చిపోతున్నాడు .. ఆ క్షణంలో తనకు తను విడిచి పెట్టున్న యీ లోకంలో అన్నీ అసహ్యించుకున్నవే. .. తన యిద్దరి పెద్దమ్మాయిలు కూడాను!

కళ్ళు నిలబెట్టి అలా చూస్తుంటే కూతుర్లిద్దరికీ భయంవేసి కావుమన్నారు. చిన్న కూతురు లేచి గబగబ వచ్చింది తండ్రి మంచం మీద కూర్చోగానే నీలకంఠం ముఖం ప్రక్కకు త్రిప్పివేశాడు.

సన్యాసమ్మ యేడుస్తున్న యిద్దరి అక్కలవేపు తీక్షణంగా చూసింది. నాన్న వంటిమీద చెయ్యివేసి "ఇంకేమీ రాదక్రా మీకు! ఇలా యేడుస్తూ నాన్నని అధైర్య పరచకండి! ఊరుకుంటారా లేదా?" అంటూ ఒక్క గసురు విసరే సరికి యిద్దరూ, చెల్లెలివేపు చూశారు.

ఈ మాటలు తను వినకూడదనుకున్నా విన్నాడు. ఏమీ అనుకోకూడదనుకున్నా అనుకున్నాడు. తను నిజంగా చచ్చిపోతున్నాడా లేక తన అధైర్యమే తను చచ్చిపోతున్నానని అనుకోనిస్తోందా?

చిన్న కూతురు "నాన్నా నాన్నా....." అని పిలిచింది. అనుకోకుండానే వూఁ అని మూలిగాడు. "అధైర్య పడకండి! డాక్టరు చెప్పాడు. నీరసం తప్పించి యింకేంకాదని! నాలుగురోజుల్లో లేచి కూర్చుంటారుగా! కొద్దిగా నోరు తెరవండి.... బార్లీనీరు పోస్తా!"

తనకు జబ్బు లేదూ! తను చచ్చిపోవడంలేదూ? అబ్బబ్బే! తను చచ్చిపోతున్నాడే?

కూతురు నోటిలో బార్లీ పోస్తుంటే త్రాగకూడదనే గుటక వేశాడు. గుటక వేశాక తను గుటక వేయగలిగానని, తను బ్రతుకుతానని కొద్దిగా ఆశ కలిగింది.

చిన్న కూతురు అంతతో చాలించలేదు. ఆమె గొంతుక విప్పితే తనకేదో కొత్త అనుభూతి కలుగుతోంది! అసహ్యం అధైర్యాలనే మంచుకొండల్లో తను కప్పబడ్డాడు! ఆమె మాటలు సూర్యరశ్మిలా వాటిని కరిగిస్తోంది!

అయినా ఆమె వేపు కన్నెత్తి చూడలేదు. లోలోనే యెన్నెన్నో అనుకుంటున్నాడు!

సన్యాసమ్మ కల్లోలంలో ఒక చల్లని కబురు చెప్పింది. తను కలలోనైనా యీ మాట తన కూతురు నోటి వెంబడి వస్తుందని వూహించలేదు. కాలేజీ మానివేస్తానని కూతురు చెప్పగానే మనిషి ముఖం నిగనిగలాడింది. పోయిన ప్రాణాలు తన బొందికి చేరుకుంటున్న ట్లనిపించింది కూతురు తియ్యగా అన్నది! "మీరధైర్య పడకండి నాన్నా! ఈ అప్పులు తీరవని బెంగపడకండి. ఇప్పుడెలా ప్రయివేట్లు చెప్తున్నాగా, చదువు చాలిస్తాను మరికొందరికి చదువు చెప్పొచ్చు! ఉద్యోగం దొరికేవరకు యిలా కానిస్తాను!"

ఈ ముక్కల్లో వెయ్యోవంతు కాంక్షించి నిరాశ జెందిన నీలకంఠంకు లేచి కూర్చోవాలనిపించింది చిన్నకూతురు అంతతో వూరుకోలేదు! "ఇద్దరి జీతం యేం చేసుకుంటాం నాన్నా? చిన్నక్క పెళ్ళిచేద్దాం! అంత ముందుకొచ్చే మగాడుంటే పెద్దక్క పెళ్లి కూడా చేద్దాం! మనకేం? మన డబ్బు ఒకరు తినే పరిస్థితి వస్తుంది!"

నీలకంఠం కళ్లల్లో నీరు వుబికింది. ఒక్కసారి శరీరమంతా వుబ్బినట్లయింది ఏడుస్తూనే నవ్వుతున్నాడు! తన కూతురు పుట్టే ముందు, కొడుకని పడ్డ ఆరాటం మనసులో తిరిగింది దేవుడు తనకు కొడుకు కంటే హెచ్చయిన రత్నాన్నిచ్చాడు. దేవుని దూషించి నందుకు యీ కూతుర్ని అసహ్యంగా చూసినందుకు విచారించాడు. తన భయంతో తను మెడలో వేసుకున్న వురిని యీ కూతురే తప్పించింది!

అయ్యో! తను జీవితంలో ఎంత తెలివిలేని పని చేశాడు? తన పెద్ద కూతుర్లిద్దరిని చదివించవలసిందే!!

# పుత్రోత్సాహం

## మధురాంతకం రాజారాం

మీరు నా అభిప్రాయంతో ఏకీభవించకపోతే అది మీ దురదృష్టం. నా ఉద్దేశమేమిటంటే ఈ అచ్చు యంత్రమనేది రావడముంది. చూచారా యిది దేశానికి పెద్ద బెడదై పోయింది.

వంట చెయ్యడం ఎలా? అందుకొక పుస్తకం. పెరట్లో కూరగాయలు పండించడం ఎలా? అందుకొక పుస్తకం. ఆఖరుకు 'మీ బిడ్డల్ని మీరు పెంచడమెలా?' ఇందుకున్నూ ఒక పుస్తకమే! ఏమండీ, నాకు తెలియక అడుగుతాను. మన స్వంత బిడ్డల్ని మనం పెంచుకోడానికి కూడా మనకింకొకడి బోడి సలహాలు కావలసివచ్చాయా?

ఆ పప్పులు మా దగ్గరుడకవు. మా వూళ్ళో మేము బిడ్డల్ని పెంచే పద్ధతే వేరు. ఇది మిగిలిన లోకులకంతా ఆదర్శప్రాయమని నా గట్టి నమ్మకం. కానీ దీన్ని గురించి లోకానికి తెలియవద్దా? తప్పకుండా తెలిసి తీరాలి. అందువల్ల లోక కల్యాణం నిమిత్తం ఈ పనికి పూనుకోడమైంది.

ఒకనాటి ఉదయం మావూరి బడిగంట మ్రోగింది. టంగుటంగున మ్రోగింది. అని నేను చెప్పలేదు. ఇందులోని ఆంతర్యాన్ని మీరు శ్రద్ధగా గమనించాలి. కొండవూట నీళ్లు త్రాగడం వల్ల రాచిపోయిన గొంతుకలా బడిగంట తుస్సు తుస్సున మ్రోగింది. అందుకు కారణం 'బెల్‌సుత్తి' మాయం కావడం! ఉదయం తొమ్మిది గంటలకు ప్రారంభమయ్యే బడికి చాలామంది పిల్లలు ఏడింటికల్లా వచ్చేస్తారు. వచ్చింది మొదలు ఏ మాత్రం ఆలస్యం చెయ్యకుండా ప్రహరీ మొండిగోడలపైన, చెట్ల కొమ్మలపైన, పూరింటి దూలాలపైన చక్కగా సర్కస్‌ఫీట్లు అభ్యాసం చేస్తారు. గంట తొమ్మిది కావచ్చేటప్పటికి బెల్ కొట్టే మహదవకాశాన్ని చేజిక్కించుకోడం కోసం మా పిల్లలు చేసే వ్యక్తిగత ప్రయత్నాలవల్ల 'బెల్ సుత్తి' మాయమై పోతుంది. ఎవడి దగ్గరుంటుందో అంతుపట్టదు. బడిలో నేను హెడ్మాస్టర్ని గదండీ! (బడి బయట నాకు చాలా హోదాలున్నాయిలెండి). "రేయ్, గంట కొట్టండ్రా. అని నేనరుస్తాను. అప్పుడు బెల్‌కు చేరువగా వున్న కుర్రాడు చేతికి దొరికిన కంకర

రాయితో దాన్ని వాయించేస్తాడు పాపం, గంట టంగుటంగున మ్రోగమంటే ఎలా మ్రోగుతుంది? అదండీ విషయం!

గంట మ్రోగిన తర్వాత ఆనాటి ఉదయం మా బడిలో ప్రార్ధన అనే తతంగం కూడా జరిగింది. ప్రత్యేకత ఏమీ లేదు. అన్నిరోజులూ ఎలా జరుగుతుందో ఆ రోజున్నూ అలాగే జరిగింది. గంట కొట్టడానికి, ప్రార్ధన చేయడానికి అట్టే తేడా వుండవలసిన అవసరం లేదని మా పిల్లల నిశ్చితాభిప్రాయం భక్తినీ, సంగీతాన్ని మైనస్ చేసి ప్రార్ధనా గీతాన్ని ఒక సామూహిక ఘోషగా వినిపించడం చిరకాల సాధనవల్ల వాళ్లకలవడిన కూసువిద్య

ప్రార్ధనానంతరం హాజరు పట్టీ చేత బట్టుకుని నేను క్లాసు రూంలోకి జొరబడ్డాను జొరబడ్డానికిదేమైనా ఆహవరంగమా అని మీరనుకోవచ్చు ఇంచుమించుగా అంతేనండీ! జనాభా పెరగడం వల్ల ధరలు పెరగడం వల్ల నిరుద్యోగులు పెరగడం వల్ల దరిద్రం పెరగడం వల్ల మానవ జీవితం పరిసరాలతోనూ, పరిస్థితులతోనూ ఒక అనివార్యమైన పోరాటంగా పరిణమించింది గదా! మా పిల్లలు పెరిగి పెద్దవాళ్ళయ్యేటప్పటికి పరిస్థితులు మరింతగా విషమించవచ్చు అందువల్ల దూరదృష్టితో భావి జీవితానికి అవసరమైన తరిఫీదునంతా మేము కుటుంబస్థాయి నుంచీ, పాఠశాల స్థాయి నుంచీ, వాళ్ళకందిస్తున్నాము అసలింత వరకు ముందు 'క్లాస్ రూం' అన్నాను కదండీ! అది వట్టి అర్ధంలేని మాట! క్లాసు కొక్క రూమయితే అది క్లాసు రూము. అన్ని క్లాసులూ ఒక రూములోనే ఉంటే దాన్ని క్లాసు రూం అనడం ఎలా పొసుగుతుంది? మధ్య గోడలేని అయిదంకణాల పూరిండ్లు రెండింటిని కలిపి దానికి మేము 'ప్రాధమిక పాఠశాల' అని బోర్డు తగిలించాము నేమ్‌బోర్డు వ్రేలాడుతూ వుంటుంది కనుక అది పాఠశాల కాదని నిరూపించడం మీ తరం కాదు మేకల మందను దడిలోకి తోలినట్లుగా రెండువందల యాభై మంది పిల్లల్ని మేము అందులోకి తోలేస్తాము క్లాసుకు క్లాసుకు మధ్య హద్దులేవీ కనిపించకపోతే, అది వర్గరహిత సమాజానికి మేము వేస్తున్న పునాది అని మీరనుకోవాలి. అయితే మా కొండ గుర్తులేవో మాకున్నాయనుకోండి! ఆగ్నేయ మూలలో ఒకటో క్లాసు, నైరుతి మూలగా నాలుగో క్లాసు వాయవ్యం ఈ అయిదు ఈశాన్యంలో రెండు... అబ్బ, ఎంత తొందరండీ మీకు! మూడో తరగతి కూడా వుందిలెండీ! అయితే అది నాలుగ్గోడల మధ్య వుండదు. టీచరు లేకపోవడం మూలాని అది స్వేచ్ఛావాయువులు పీల్చుకుంటూ హాయిగా బడి వెనుక చెట్ల క్రింద వుంటుంది. విధిగా అక్షరం ముక్కలు నేర్చుకు తీరాలన్న పట్టింపు మా పిల్లలకు గానీ, ఎట్లాగైనా వాళ్ళకు చదువు వచ్చేటట్లు చూడాలన్న కక్కుర్తి మా ఉపాధ్యాయులకుగానీ లేదని హెడ్మాస్టర్నిగా నేను సాధికారంగా చెప్పగలను. పరీక్షలనే వాటికి పూచిక పుల్లంత విలువైనా లేదనీ ప్రతీరోజూ బడిని పావనం చేస్తూ వుండే పై తరగతికి వెళ్లడం ఖాయమనీ గ్రహించలేని అజ్ఞానులేం కాదు మా కుర్రవాళ్ళు. ఒకవేళ ఏదైనా గ్రహపాటువల్ల ఒకరో అరో అక్షరం వచ్చినప్పటికీ ఆ చదువును పూర్తిగా విస్మరించడానికి వీలుగా పై తరగతులకు వెళ్ళినప్పుడు చదువుల మకిలి సోకి వాళ్ళ మనసులు మలినం కావడానికి వీల్లేకుండా మూడో తరగతి పిల్లలకి విధంగా మేము ఆరుబయలు చెరసాల ఏర్పాటు చేశాము.

తొడతొక్కిడిగా వున్న పిల్లల్లో నుంచి దారి చేసుకుంటూ వెళ్ళి నేను అయిదో తరగతి కుర్చీలో కూచున్నాను హాజరు వేయడం కోసం రిజిష్టరును తొడపైన పెట్టుకున్నాను. టేబిలు సంగతి అడక్కండి! టేబిలును గురించి మా స్కూలు ఉపాధ్యాయులకు తెలిసిందల్లా దాని స్పెల్లింగు మాత్రమే. వరుసగా పేర్లు పిలుస్తున్నాను. పదకొండో పేరు దగ్గర కలం ఆగిపోయింది.

"రాంబాబు లేడుసార్! రాలేదు సార్!" అంటూ పదిపన్నెండు కంఠాలు ఒక్కుమ్మడిగా ఉద్ఘోషించాయి.

రాంబాబు స్కూలుకు రాకపోవడం విడ్డూరమే! బడికి రెగ్యులర్‌గా వచ్చే అబ్బాయి రాంబాబు విద్యను కోరివచ్చే వాడు కాదు గనుక 'విద్యార్థి' అని పేర్కొనడం బాగుండదు. 'క్రీడార్థి' అంటే ఆ మాట సత్య సమ్మతంగా వుంటుంది. ఉదయం ఏడు నుంచి తొమ్మిది దాకా, మధ్యాహ్నం పన్నెండున్నర నుంచి ఒకటిన్నర దాకా, సాయంకాలం నాలుగు నుంచి బాగా చీకటి పడేదాకా ప్రతిరోజూ మూడంచెల్లో జరిగే కబాడీ ఆటలో ఒక జట్టుకు తిరుగులేని నాయకుడు రాంబాబు పప్పులేని పెళ్ళిలా, రాంబాబులేని స్కూలేమిటి?

హాజరు గుర్తించడంతోనే, నేను సాధారణంగా ఒక అత్యవసర కార్యక్రమంలో పాల్గొనవలసి వుంటుంది పాఠాలు చెప్పడం కాదు. నేరాలు విచారించడం. సుబ్బారాయుడిగా రబ్బాయి మేదర గంగన్న కొడుకును మురికినీటి గుంటలో పడద్రోసి వుంటాడు మునసబుగారి మనుమడు మునగచెట్టు వీరయ్య కొడుకును వెదురుబెత్తంతో బాది వుంటాడు. సర్పంచి గారి సుపుత్రుడు నత్తి కిష్టిగాణ్ణి నెత్తురొచ్చేటట్టుగా కొరికేసి వుంటాడు. ఇలాంటి క్రిమినల్ కేసులేగాక పుస్తకాలు కనిపించకపోవడం, కలాలు గల్లంతు కావడం తావులు దురాక్రమణ చెయ్యడం మొదలైన సివిల్ కేసులు మరెన్నో! కోర్టు వ్యవహారాలంటే ఏమిటో తెలియని దురవస్థ ఏర్పడకుండా భావిపౌరులకి శిక్షణ బాగా ఉపకరిస్తుందని మా విశ్వాసం. పైగా న్యాయమనేది అందరికీ ఒకేవిధంగా గాక, ఆస్తి, అంతస్తు పలుకుబడీ మొదలైన వాటిని బట్టి విభేదిస్తూ వుంటుందన్న వాస్తవిక పరిజ్ఞానం పిల్లల్లో నెలనాటుకునే టట్లుగా తీర్పులివ్వడంలో కూడా వెనక జాగరూకత వహిస్తాము. ఈ జరూరు విషయాల అలజడిలో పడిపోయి రాంబాబు గైర్‌హాజరు కావడం గురించి నేను తాత్కాలికంగా విస్మరించాను

ఇంటర్వెల్లో నేను వీధికొసన వున్న పోస్టాఫీసుకు వెళ్ళి వచ్చేటప్పటికి పాఠశాల వాలకం కోలాహలం ఉద్భవించినప్పటి క్షీరసాగరాన్ని తలపిస్తూ వుంది. పులిదిండి సుబ్బరాజు భార్య కనకమ్మ ఎత్తయిన బండపైన నిల్చుని, అధికార పక్షాన్ని దుయ్యబట్టే ప్రతిపక్ష సభ్యురాలిలా తలత్రిప్పుతూ, చేతులూపుతూ మాట్లాడేస్తోంది. చుట్టూ మూగి బడిపిల్లలు ఎంతో బుద్ధిగా ఆసక్తిగా ఆమె ప్రసంగాన్ని వింటున్నారు. గ్రామప్రజలు కొందరు ప్రత్యేకాహ్వానితుల హెూదాలో విచ్చేసి సభను జయప్రదం కావిస్తున్నారు.

"ఏమయ్యో నేనొక మాటడగతా! ఓ కుర్రాడు బడికి రాకపోతే ఎందుకు రాలేదని అయ్యవారు తెలుసుకోవద్దా? ఇంట్లో వుండి రాలేదా? ఇంట్లో లేకరాలేదా? ఒంట్లో

బాగుండక రాలేదా? ఒంట్లో బాగుండి కూడా రాలేదా? రాకపోతే ఏమయ్యాడు పోనీ అదంతా తెలుసుకునే ఓపిక లేకపోయిందేననుకో! ఇంటికైనా చెప్పి పంపొద్దా. ఇప్పుడు నేనున్నాను. రాంబాబు తల్లిని. బిడ్డ ఇంట్లోనూ లేక బడిలోనూ లేకపోతే నేనేమనుకోవాలి? ఏ గంగలో దూకాలి? ఇంతకూ ఈ స్కూల్లో అయ్యవార్లు మేలుకున్నట్టా? నిద్రపోతున్నట్టా? వచ్చిన గొడ్డును కట్టెయ్యాలనిగానీ, రాని గొడ్డును వెదుక్కోవాలని గానీ, తెలియకపోయాక యింక వీళ్ళకు గవుర్మెంటు జీతాలిచ్చే దెందుకంట?"

పిల్లలకు చదువు చెప్పడం కోసం గవర్మెంటు మాకు జీతాలిస్తోందని నేను కనకమ్మకు బదులు చెప్పి వుండొచ్చు కానీ అలా చెప్పడంలో పొంచి వున్న ప్రమాదమేమిటో నాకు తెలుసు ఏదీ మా అబ్బాయి కొక అక్షరం ముక్కయినా రాలేదేమని నిలదీసి అడిగితే అప్పుడిక ఆమెకు జవాబు చెప్పడం కష్టం. అందుకని నేనామెతో యుద్ధానికి దిగదలచలేదు. సంధికే పూనుకున్నాను

"అమ్మా, కనకమ్మా! నీకు కోపం రావడము సబబే! ఒప్పుకుంటున్నాను గదా! నాది పొరబాటై పోయింది రాంబాబు స్కూల్లో లేకపోవడం వల్ల ఇంట్లో వుండి వుండొచ్చు ననుకున్నాను నువ్వు వాడినెక్కడికైనా పంపించి వుంటావనుకున్నాను. లేకుంటే వాళ్ల నాన్న వాడికేదైనా పని పురమాయించేడేమోననుకున్నాను. రాంబాబును గురించి ఆచూకీ తీయకపోవడానికి యింతకుమించిన దురుద్దేశమేదీ లేదు అయినా యిప్పుడు మించిపోయిందే ముంది? నా దగ్గర మెరికల్లాంటి కుర్రాళ్లున్నారు వాళ్లు తోపులూ దొరువులూ, వాగులూ, వంకలూ అన్నీ గాలించి రాంబాబు ఎక్కడున్నా పట్టుకొస్తారు. నీ కొడుకును నీకు పువ్వుల్లో పెట్టి అప్పగించే పూచి నాది! కానీ ఆ పనికి పూనుకోడానికి ముందు, రాంబాబు తల్లివిగా నువ్వు నీ సహకారం కొంత మాకందివ్వాలి" అన్నాను.

నా చాణక్యనీతి ఎదుట కనకమ్మ చిత్తు చిత్తయిపోయింది గాలితో పోట్లాటకు తలపడిన మల్లయుద్ధ వీరుడిలా బిక్క చూపులు చూడసాగింది.

ఆ సందర్భాన్ని మెలకువగా ఉపయోగించుకుంటూ నేను అసలు సిసలైన పత్తేదారీ సరళిలోకి దిగేశాను. "ఏమమ్మా కనకమ్మా! నువ్వు కడపటిసారిగా రాంబాబును చూచిందెప్పుడు! అప్పుడు వాడేం చేస్తున్నాడు?"

గుప్పిట్లో చిక్కిన మిడతలా కనకమ్మ గుడ్లు మిటకరించింది. "నేనా! రాంబాబునా? నిన్న మధ్యాహ్నం భోజనానికి వచ్చాడు గదా! అదేనయ్యా నేను వాణ్ని చూడ్డం!

"మరైతే నిన్న రాత్రి కూడా వాడింటికి రాలేదన్న మాట! ఎక్కడ భోంచేశాడో?"

"అబ్బే వచ్చే వుంటాడు. నేనింట్లో లేనే! మా మేనత్త కూతుర్ని యింటికి పిల్చుకునే శాస్త్రమైతే దానికి నేను, మా ఎగురింటి మంగమ్మ పిన్ని మిద్దింటి కామాక్షమ్మ యింకా అయిదారు మందిమి కలిసి తిప్పరాజుపేట కెళ్లిపోయాము. తిరిగొస్తూ రుద్రవరంలో రెండో ఆట సినిమా చూచుకుని మూడు గంటల బండి మన స్టేషనులోకి వచ్చేటప్పటికి యిల్లు జేరుకున్నాము...."

"పోనీ అప్పుడైనా నువ్వు రాంబాబు యింట్లో వున్నదీ, లేనిదీ గమనించి వుండొచ్చు

గదా?"

"అయ్యో. యింటి దగ్గర పడుకునే అలవాటు వాడికెక్కడిదండీ అయ్యగారూ! నడివీధిలో మా ఆడపడుచు నిచ్చాంగదా! గ్రామచావడి దగ్గర మా చిన్నత్తావాళ్లున్నారుగదా! ఇంకా వూరంతా బంధువులా మరేమన్నానా? కుర్రాడు తన సావాసకారులతో కలిసి ఎక్కడ పడుకుంటాడో ఏమో! కుర్రాడెక్కడ పడుకుంటే నేమిలే అని మేమూ పట్టించుకోము. ఎక్కడ పడుకున్నా వాడు తెల్లవారాక చద్దన్నం కోసం యింటికొచ్చేస్తాడు...."

"మంచిదేనమ్మా! ఊళ్లో యిళ్లన్నీ మనవేననుకోడం. ఎక్కడ నిద్రొస్తే అక్కడ పడుకుని నిద్రపోవడం ఎంత బంధువులైనా దూరి తినడం బాగుండదు గనుక భోజనానికి మాత్రం యింటికి రావడం యిదంతా చాలా బాగుంది. అయితే, ఈ రోజూదయం చద్దన్నకోసం యింటికొచ్చినప్పుడైనా వాడు నీకు కనిపించి వుండాలిగదా!

"సరేసరి! ఇంట్లో కూచుంటే నాకెట్లా జరుగుతుందండీ అయ్యగారూ! జెర్సీ ఆవుకు గడ్డి తేవాలిగదా! ఆవేళప్పుడు నేనింట్లో వుండనే!"

"అవునమ్మా! నువ్వింట్లో లేకపోతే వాడికి చద్దన్నం పెట్టేదెవరు?"

"ఒకరు పెట్టాల్సిన పనేముంది! చక్కా వస్తాడు. ఇంటి చూరులో మేము తాళం చెవిని దాచిపెట్టే చోటొకటి వుంది లెండి! దాంతో తాళం తీసి వాడిపాటుకు వాడు కంచం పెట్టుకుని అన్నం తింటాడు మళ్లీ తాళం వేసి, చెవిని చూరులోనే పెట్టి బడికొచ్చేస్తాడు"

ఇంకేమని అడగాలో తోచకనేను కొద్ది క్షణాలు మౌనంగా వుండిపోయాను. చింతలపల్లిలో సరిగంధం వాళ్లింటి ఆడపడుచు కనకమ్మ, మా వూళ్ళో పులిదిండి వాళ్ళింటి కోడలుగా వచ్చింది. అటూ యిటూ గూడా బంధువుల బలగం హెచ్చు. ఒక వూళ్ళో అమ్మాయిని యింటికి పిలుచుకునే శాస్త్రం. ఇంకొక ఊళ్ళో ఉగాది సాంగ్యం. ఒకచోట పురుడు ఇంకొకచోట పుట్టు వెంట్రుకలు తీయడం. చాలని దానికి పెండ్లిండ్లు. ఈ బంధు కార్యాలన్నింటికీ వెళ్లవలసి వుండడం వల్ల కనకమ్మ వరసగా నాలుగురోజులు యింట్లో వుండడం కుదరదు. ఇంట్లోవున్న రోజుల్లో తెల్లవారగానే ఆమె గడ్డికోసం వెళ్లడం తప్పనిసరి. అమ్మలక్కలతో పిచ్చాపాటి కింక మిగిలినవి మధ్యాహ్నం వేళలే! పదేళ్ల కొడుకు రాంబాబూ రాత్రుల్లో యింటి దగ్గర పడుకోడు. ఉదయం వాడు వచ్చేసరికి కనకమ్మ యింట్లో వుండదు. ఈ లెక్కన తల్లిని కొడుకు, కొడుకును తల్లీ చూడకుండా రోజులకు రోజులే గడిపెయ్యవచ్చునని నాకప్పుడు బోధపడింది. కానీ కొంచెం పునరాలోచన చేసి చూచుకున్నాక కనకమ్మ కథనంలో ఎక్కడో ఒక 'లింకు' సరిగ్గా అతకడం లేదని నేను గ్రహించాను. చటుక్కున అదిగూడా స్ఫురించింది. అన్నట్టు యింట్లో వున్నది తల్లీ కొడుకులిద్దరే కాదుకదా! ఆ మూడోవ్యక్తి ముఖ్యమైన వ్యక్తి కూడా. అతడి మాటేమిటి?

"చూడమ్మా, కనకమ్మా మీ ఇంటాయన అయినా రాంబాబును చూచి వుండొచ్చుగదా! ఆయన్నొకమాట అడగలేకపోయావా?" అన్నాను.

"అయ్యో, రాత! అంతమంచి ముఖానికి అర్ధసేరు పసుపు కూడానా! ఆయన యింటిపట్టున వుండేవాడైతే నాకేం తక్కువ! అంతా నేనడిగొచ్చిన వరంలెండియ్యగారూ!"

విసవిసా వీథిలోకి వెళ్లిపోయింది కనకమ్మ.

తానడిగొచ్చిన వరంలో భర్తకు సంబంధించిన అంశంలో మాత్రం పెద్ద లొసుగేదో వుందని కనకమ్మ అభిప్రాయం. అతడయినా దుర్మార్గుడేమీ కాదు. నాలుగెకరాల మాగాణి అయిదెకరాల మెట్టా, సాలీనా అయిదారు వేలదాకా ఆదాయం వచ్చే మామిడితోటా ఈపాటి వెసులుబాట్లతో అతడు తలుచుకుని వుంటే సంసారం పూలతెప్పను కాలప్రవాహంపైన సాఫీగా, సరదాగా నడిపివుండొచ్చు. కానీ ఏ పూర్వజన్మ పుణ్య పరిపాకం వల్లనో అతడి పాలిటికి సంసార సుఖాలన్నీ చాలా నిస్సారమైనవిగా కనిపిస్తాయి. ఎవరెవరికి ఎక్కడెక్కడ ఆత్మానందం లభిస్తుందో ఎవరు చెప్పగలరు? అర్ధాంగి సాన్నిధ్యంలో అనుభవానికి రాని జీవన మాధుర్యం అతడికి చతుర్ముఖ పారాయణంలో లభ్యమవుతుంది. పుత్రగాత్ర పరిష్వంగంలో అనుభూతికి రాని మహదానందం పేకముక్కల స్పర్శలో లభిస్తుంది. ఎక్కడ ఫలానా సోపు వుండునో అక్కడ ఆరోగ్యముండును అని గదా ప్రకటన! 'ఎక్కడ పేకముక్కలు డబ్బులు చేతులు మారుచుండునో అక్కడ సుబ్బరాజుండును' అని వివరణ.

రెండు మూడురోజులు అహోరాత్రాలూ 'ఆట'లో పాల్గొన్న తర్వాత చుట్టపుచూపుగా ఒకసారి యింటికి వచ్చి వెళడం సుబ్బరాజు రివాజు. స్నానం చేసి దుస్తులు మార్చుకోడానికన్నది బాహ్య కారణం. పైకం సర్దుకోడానికన్నది ఆంతరంగిక కారణం. బహుశా అలాంటి ట్రిప్పుపైన ఊరిముఖం చూచినట్టున్న సుబ్బరాజు రాంబాబు కనిపించకుండా పోయిన నాటి సాయంకాలం భజనగుడి సందులో నాకెదురయ్యాడు

"నమస్కారం సార్! ప్రొద్దున్నే మా ఆవిడ స్కూలు దగ్గరకొచ్చి పెద్దగా కారుబారు చేసిందంటగదూ? ఆ మనిషంతేలెండి! మీరు మరేమీ అనుకోవద్దు దేవళ్ల చెరువులో రామమ్మ తిరణాల జరుగుతూ వుందిగదా! మావాడక్కడికే వెళ్లుంటాడు. ఆ వూళ్ళో మాకు దగ్గర బంధువులు గూడా వున్నారులెండి! వస్తాడు లెండిసార్! రాకెక్కడికిపోతాడు?"

అప్పటికి ఆజాపజా లేకుండా మాయమైన కుర్రాడు స్వయానా నా బిడ్డ అయినట్టు, దిగులు పడకుండా ఉండడం కోసం ఎవరో పరాయి పెద్దమనిషి ఒకతను నాకు ధైర్యవచనాలు చెబుతున్నట్టు సుబ్బరాజు మాటల్లో ధ్వనించడం వల్ల నా గుండె కాస్త తేలికపడింది

రెండురోజులు గడిచిపోయాయి. దేవళ్ల చెరువులో తిరణాల గూడా ఆపాటికి ముగిసి వుంటుంది. మధ్యమధ్యలో నేను రాంబాబును గురించి వాకబుచేస్తూనే వున్నాను. ఎప్పుడడిగినా 'లేదు, తెలియదు'లాంటి జవాబులే వినిపిస్తూ వచ్చాయి.

మావూళ్ళో మేము సాయంకాలపు షికార్లు వెళ్ళడానికి అనువైన చోటు స్టేషన్ ప్లాట్‌ఫారమే! దక్షిణాది నుంచి వచ్చే ఆరుగంటల బండి స్టేషనులో ఆగి తిరుపతి వైపు సాగిపోయింది. రైలు వచ్చి వెళ్ళిపోయిన అయిదు నిమిషాలకల్లా మావూరి స్టేషన్ నిర్మానుష్యమై పోతుంది. అప్పుడు మసక చీకటిలో నేను ప్లాట్‌ఫారంపైన నడిచి వస్తుండగా సీమబాగి చెట్టు బోదె చుట్టూ నల్లటి ఆకారమేదో తారట్లాడుతున్నట్టు తోచింది. నా దృక్పథం నుంచీ మరుగైపోవడం కోసం అది బోదె చాటుకు జారుకుంటున్నట్టు తోచడంతో

అనుమానం అతిశయించి "ఎవరక్కడ? రేయ్ ఎవడ్రా నువ్వు? ఇవతలికి రారా" అని గద్దించాను.

"నేన్సార్, రాంబాబుని" అని, అంతటితో ఊరుకోక 'ఇహిహి' అని వాడు పళ్ళుగూడా యికిలించాడు.

"నువ్వట్రా అడ్డగాడిదా! ఓరి నీ యిల్లు బంగారంగానూ, ఎంత పని చేశావురా? ఎక్కడికెళ్ళావురా? మూడురోజులుగా ఎక్కడున్నావురా? మాటమాత్రమైనా చెప్పకుండా నీ ఇష్టమొచ్చినట్లు వెళ్ళిపోతావా? ఉండు నీ పని చెబుతాను. అయినా యిప్పుడెక్కడి నుండి ఊడిపడ్డావురా నువ్వు" అంటూ కొంచెం ఘీంకారం సలిపి చూచాను.

"ఇందాకట్నే బండి దిగాన్సార్! మీరు నన్ను చూళ్ళేదులే! నేన్మాత్రం మీరక్కడుండడం చూశా!"

"ఘనకార్యం చేశావులేరా బడుద్దాయి వెధవా? ఇటు వైపెవరున్నార్రా నీకు ఎక్కడికెళ్ళొస్తున్నావు?"

రాంబాబు మాటల్ని యధాతథంగా ఉదహరించాలంటే తెలుగులో 'షార్ట్‌హేండ్ అయినా వచ్చి వుండాలి, లేకుంటే టేప్ రికార్డరయినా అందుబాటులో వుండాలి. ఆ సదుపాయాలు రెండూ నాకు లేకపోవడం వల్ల వాడి యాత్రావృత్తాంతాన్ని నా మాటల్లోనే చెప్పేస్తున్నాను. రాంబాబు పెద్దతల్లి కొడుకొకడు 'ఇంటరు'లో చేరి కొత్తగా తిరుపతిలో మకాం పెట్టాడు. రాత్రి ఎనిమిది గంటల బండికి వచ్చి తనను కలుసుకోవలసిందిగా వాడు పంపిన ఆహ్వానాన్ని పురస్కరించుకుని వీడు వెళ్లి స్టేషనులో దిగాడు. దొంగబండి ఎక్కడం, పురవీధుల్లో బలాదూర్లు తిరగడం, సినిమాలు చూడడం యిదంతా రాంబాబుకు కొట్టిన పిండే! కానీ ఈసారి వీడు వెళ్లేసరికి రమ్మన్నవాడు స్టేషనులో లేడు.

వాడి గదెక్కడో వీడికి తెలియదు. పోనీలెమ్మని వీడు స్టేషనుకు దగ్గరగా వున్న థియేటరుకు వెళ్ళి నయనానందకరమైన ఓ హిందీ స్టంటు సినిమా చూచాడు. ఆట వదిలిపెట్టాక మళ్ళీ స్టేషన్లోకే వచ్చేశాడు. రెండుగంటల బండి బయల్దేరడానికి సిద్ధంగా వుంది. అరగంటసేపట్లో ఊళ్ళోవాలొచ్చుగదా అని పెట్టెలోకెక్కి బెంచీపైన కూర్చున్నాడు. అంతవరకూ వాడిది సదుద్దేశమే! ఎటొచ్చి వాడు కూర్చున్న బెంచీ ఖాళీగా వుండడమే ప్రమాదమైపోయింది. బద్ధకంతో మేనువాల్చడమే వాడి పొరబాటు. ఒళ్లు తెలియకుండా నిద్ర పట్టింది. లేచి చూసేటప్పటికి భళ్లున తెల్లవారిపోయింది. అదే స్టేషనో ఏమిటో తెలిసిన ముఖం ఒక్కటీ కనిపించడం లేదు. అంతా కొత్తగా వుంది. బోర్డులో తనకు చిరపరిచితాలైన తెలుగక్షరాలకు బదులుగా మరేదో వంకరటింకర గీతలు కానవస్తున్నాయి. కొందరిని పలకరించడానికి ప్రయత్నిస్తే 'పోడా'పో అని విసుక్కున్నారు. బ్రిడ్జి ఎక్కి దిగి కాలుగాలిన పిల్లిలా ఊరంతా చెడతిరిగాడు. ఆ వూరిపేరు 'కాట్పాడి' అని తెలుసుకునేసరికి వాడి తల ప్రాణం తోకకొచ్చింది. ఆకలికి తట్టుకోలేక ఒక నాస్టాకొట్టులో నాలుగిడ్లీలు మాత్రం తిని, బస్‌స్టాండు సెంటర్లో తిరుగుతుండగా వీడొక పోలీసు కంటబడ్డాడు. 'ఆంధ్ర' నుంచి దిగిన తాజా పిక్‌పాకెట్రై వుంటాడని భావించి ఆ పోలీసాయన వీణ్ణి స్టేషనుకు

పొక్కెళ్లాడు. ఆ పగలూ రాత్రీ గూడా వీడు పోలీస్‌స్టేషనులోనే 'రెస్టు' తీసుకున్నాడు. వదిలిపెడితే తిరిగి చూడకుండా స్వంత వూరు చేరుకుంటానని వాగ్దానం చేసిన మీదట అరవ పోలీసులు కరుణించి వీణ్ణి వదిలేశారు నాణెంపైకి ఎగరవేస్తే బొమ్మే పడితీరాలన్న నియమమేమీ లేదు. బొరుసు కూడా పడొచ్చు. రాంబాబు సురక్షితంగా స్వగ్రామానికే తిరిగి వచ్చేశాడంటే అది కేవలం యాదృచ్ఛికం. ఇంకొక ప్లాట్‌ఫారంలో గనుక రైలెక్కి వుంటే వాడు తిరువణ్ణామలై యో, విల్లుప్పురమో వెళ్ళి మరింత లోకజ్ఞానం సముపార్జించుకోగలిగి వుండేవాడు!

"బండి దిగిన వాడివి ఇంటికి వెళ్లక! యిక్కడెందుకు తచ్చాడుతున్నావురా?" అని గదమాయించాను

"మరి... . మరేమోసార్. ... మా అమ్మా, నాన్నా కొడతారేమోనని.

నాకు పొట్టచెక్కలయ్యేటట్టుగా నవ్వాలనిపించింది. "ఓరి పిచ్చి కుంకా! ఆ సందేహమెందుకొచ్చింది నీకు? భయమేమీ వద్దు. నేరుగా యింటికి వెళ్లు నూటికి తొంభై పాళ్లు మీ అమ్మ యింట్లో వుండదు. ఇక మీ నాన్న సంగతి నీకు తెలియందేముంది. తాళంచెవి చూరులో వుంటుంది. తలుపు తీసి శుభ్రంగా భోంచెయ్యి. నీకెట్లాగూ యింట్లో పడక పొందదుగదా! వెళ్లి ఎవరింట్లోనైనా పడుకో. బాబ్బాబూ! నీకు పుణ్యముంటుంది. రేపుదయాన్నే తప్పకుండా బడికొచ్చేయ్. నువ్వు కనిపించకపోవడంవల్ల నీతోడి కబాడీ ఆటగాళ్లు దిగులు పడిపోతున్నారు" అన్నాను.

☆ ☆ ☆

"బిడ్డ ఎంతదూరం వెళ్లి తిరిగొచ్చేశాడో తెలుసా! ఆ వూరుండడం మన యిస్టేట్‌లో గూడా కాదటమ్మా! అక్కడందరూ అరవమే మాట్లాడతారట! తీసుకెళ్లిన డబ్బుగూడా అంతంత మాత్రమే! అయినా ఎట్లాగో చలాయించుకొచ్చేశాడే! అష్ట తెలువులమ్మా వాడికి" అని కనకమ్మా,

"మావాడేం సామాన్యుడా! ఉక్కుపిండం కదటయ్యా! నువ్వు బుట్టలోపెట్టి బావిలోకి దిగవిడువు. వాడు చేంతాడు పట్టుకుని చక్కా పైకెక్కి రాకపోతే నన్నడుగు" అని సుబ్బరాజూ.

పదిమందిలోనూ చెప్పుకోడం విని 'ఆహా! పుత్రోత్సాహమంటే యిదే కాబోలునని నేను ఆనందంతో పులకించిపోయాను.

# చదువు

## దాశరథి రంగాచార్య

ఎంకటికి కడుపులో పేగుల్లేవు. వంట్లో కండలేదు. కళ్ళలో వెలుగు లేదు. చెంపల్లో నునుపులేదు అయినా బతుకుతున్నాడు. అంతేకాదు పని చేస్తున్నాడు.

ఎంకటిని డాక్టర్లు చూడలేదింతవరకు. చూసి ఉంటే ఆశ్చర్యపడిపోయేవారు. అతను వయసుకు తగిన ఎత్తులేడు. బరువు లేడు. అతని ఆహారంలో విటమిన్లులేవు. ప్రొటీన్లులేవు. అసలు ఆహారం లేదు. ఆశ్చర్యం కాదూ మరి డాక్టర్లకు. అతను జీవిస్తున్నందుకు! అంతేకాదు పని చేస్తున్నందుకు!

ఎంకటి పెద్దవాడు కాదు. పసివాడు. పదేళ్ళవాడు. పాలబుగ్గలతో ఉండాల్సినవాడు. బడిలో చదువుతూ ఉండాల్సినవాడు. ఆటలలో పోటీ పడాల్సినవాడు స్నేహితులలో తిరగాల్సినవాడు. తలిదండ్రుల గారాబం నోచుకోవలసినవాడు.

ఎంతటి భావి భారత పౌరుడు. సామాజిక శాస్త్రజ్ఞులు అతణ్ణి చూడలేదు. చూస్తే చెప్పేవారే అతను సమాజానికి భారం అవుతాడని. నేరాలు చేసి జీవిస్తాడని. మరొకర్ని బతకనివ్వడని తాను బతకడని!

ఎంకటి పదేళ్ళకే సకల బాధ్యతలూ నిర్వహిస్తున్నాడు. ఎంకటి ఎదగలేదు. ఎడదగడానికి తిండిలేదు. పొట్టిగా, కురచగా ఉంటాడు. ఎంకటి వంట్లో కండలేదు. కండ పెరగడానికి తిండిలేదు. ఎంకటి బక్కగా ఉంటాడు. ఎముకలకు చర్మం తొడిగినట్లుంటాడు. అతనికి డొక్క ఉన్నట్లు కనిపించదు. అది లోతుగా వెళ్ళిపోయింది. వీపుకు అంటింది. బహుశా వెన్నూ డొక్కా ఒకటేనేమో అనిపిస్తుంది. అతని వంటిమీద బట్టలుండవు. నడుముకు ఒక నిక్కరుంటుంది. అది అతనిది కాదని చూస్తేనే తెలిసిపోతుంది. తలకు ఒక చింపిరి గుడ్డ చుట్టుకుంటాడు. తలమీది వెంట్రుకలు ఎర్రగా ఉంటాయి. కళ్ళు పీక్కుపోయాయి. ఎండిన చెరువుల్లా ఉంటాయి. చెంపల్లో మాంసం లేదు. డొక్కోబోయి ఉంటాడు. అతని ముక్కు పెద్దది.

ఎంకటి దొరకు బానిస. దొర లెక్కడున్నారని మీరడగొచ్చు నైజాం నవాబుతోనే పోయారని మీ అభిప్రాయం కావచ్చు. మీరు పొరబడ్డారు చాలామందికి వలెనే మీకూ వాస్తవాలు తెలియవు. దొరతనాలు పోయినాయి. దొరలు పోలేదు. బానిసలు ఇంకా ఎక్కడున్నారని మీకు భ్రమ కలుగవచ్చు. బానిసత్వం పోయింది. బానిసలు పోలేదు.

ఎంకటి దొర పశువులను కాస్తాడు ఉదయమే వస్తాడు. పేడ తీస్తాడు. పశువుల పాలు తీస్తాడు. కసవు వూడుస్తాడు పశువులను విప్పుతాడు. పగలంతా అడవిలో కాస్తాడు సాయంకాలం వాటిని తోలుకుని వస్తాడు. కట్టేస్తాడు మేత వేస్తాడు పాలు తీస్తాడు. నీళ్ళు తోడ్తాడు కుడితి కలుపుతాడు తాగిస్తాడు పాలు పిండుతాడు ముగ్గుతో లాంతర్లు తుడుస్తాడు వెలిగిస్తాడు. ఇంటికి పోతున్నట్లు దొరకు చెపుతాడు. దొర మిగిలిన పనులు పురమాయిస్తాడు. అప్పుడు తలగుడ్డ విప్పి నేలమీద పరుస్తాడు ఎంకటి. దొర సోలెడు గింజలు అందులో పోస్తాడు. అప్పుడు ఇంటిదోవ పడ్తాడు ఎంకడు

ఎంకటికి జీవితం లేదు.అ తను గానుగ ఎద్దు. కాదు గానుగ దూడ. దూడల్ని గానుగలకు కట్టరు. గమనించండి. మనుషులకు ఆ సూత్రం వర్తించదు

ఎంకటి మనిషి!

ఎంకటి ఒకనాడుల లాంతర్లు తుడిచాడు వెలిగించాడు దొర ఆదేశించాడు. ఎంకటి లాంతరు పట్టుకున్నాడు. లాంతరు వెలుగుతుంది ఎంకటి చీకట్లో ఉన్నాడు. చీకటి వెలుగూ నడిచాయి గదిలో ప్రవేశించాడు. గదిలో బల్ల ఉంది. రెండు కుర్చీలున్నాయి ఒక కుర్చీమీద దొర కొడుకు కూర్చున్నాడు. ముద్దుగా వున్నాడు. బొద్దుగా వున్నాడు. మరో కుర్చీలో పంతులు కూర్చున్నాడు. బల్లమీద పుస్తకం వుంది బల్లమీద లాంతరు పెట్టాడు ఎంకటి. వెలుగొచ్చింది. పంతులు చెపుతున్నాడు. దొరబిడ్డ చదువుతున్నాడు.

ఎంకటి చూస్తున్నాడు, వింటున్నాడు.

"చదువులో సకలం వుంది. చదువు నేర్చినవాడు గొప్పవాడు కావచ్చు విద్యలేనివాడు వింత పశువు".

ఎంకటి తదేకంగా వింటున్నాడు. తన్మయుడై వింటున్నాడు. ఏకాగ్రంగా వింటున్నాడు. అతనికి బాహ్య ప్రపంచం తెలియడం లేదు. దొర వచ్చి గద్దించేదాకా అతడీ లోకంలో లేడు. దొర తరుముతే బయటపడ్డాడు.

ఎంకటి గుడిసెకు చేరుకున్నాడు. కుక్కి మంచంలో తీసుకుంటూంది తల్లి ముత్తమ్మ. ఇంట్లో దీపం మిణుకు మిణుకు మంటూంది? అవి ఏవీ గమనించలేదు ఎంకటి.

"అవ్వా! చదువుకుంటానే" అన్నాడు.

అవేవీ గమనించలేదు ముత్తమ్మ. ముత్తమ్మ మీద పిడుగు పడ్డట్లయింది.

"నీకేమన్న పోయేకాలం వచ్చినాదీర! మీ తాత చదివిండా? మీ అయ్య చదివిండా! మనం బాంచోళ్ళం బిడ్డా! బాంచోళ్ళంగానే బతకాలె! నువ్వు సదువు కుంటవ్. బాగనే వున్నది. నా గొంతుల గంజెవరు పోస్తడు? దొర గొడ్లనెవడు కాస్తడు?"

"అవ్వ దొర కొడుకు చదువుకుంటాండె నాకు సదవాల్నని ఉన్నది"

"కొడకా! దొరలెక్కడ? మనమెక్కడ? దొరలు దొరలే – బాంచలు బాంచలే – గింజలెత్తెచ్చినవా?"

వాస్తవంగా గింజలు తేలేదు. ఎంకటి వెనక్కు ఉరికాడు. గింజలకోసం మళ్ళీ గదిలో చూచాడు పంతులు చెప్పుతున్నాడు. దొర కొడుకు చదువుతున్నాడు. ఎంకటి ప్రాణం తపతప కొట్టుకుంది. దొర గద్దించాడు మళ్ళీ గింజలు పోశాడు తలగుడ్డలో. గింజలు తీసుకొని బయల్దేరాడు ఎంకటి. ఎంకటికి గింజల ఉత్సాహం లేదు. చదువు వినలేదని బాధ ఉంది.

బువ్వతాగి తల్లీ కొడుకులు ముడుచుకున్నారు. ఎంకటికి నిద్ర పట్టడం లేదు. పంతులు చదువు చెపుతున్న దృశ్యం, దొరబిడ్డ చదువుతున్న దృశ్యం వెంటాడుతున్నాయి.

"అవ్వా! సదుకుంటే ఏమైతది?"

"దొర నీ పానాల్తీస్తడు. మీ అయ్య దొరకు నిన్ను అమ్మిండు. నీ పానం దొర చేతులున్నది ఇన్నావా? నువ్వు చచ్చినంక నేనాడ బతుకుత?" ముత్తమ్మ ఖంగు ఖంగున దగ్గుతూ విలవిల్లాడింది. ప్రాణంపోయి మళ్ళీ వచ్చినంత పనయింది.

ముత్తమ్మకు క్షయ. అలా అని వాళ్ళకు తెలియదు. వైద్యశాస్త్ర పురోగతి పట్నాలుదాటి పయనించదు. ముత్తమ్మకు తెలిసింది అది మాయదారి రోగమని. ఎప్పుడో ఎత్తుకుపోతుందని.

ఎంకటికి ఆ రాత్రి నిద్రపట్టలేదు. పంతులు చదువు చెప్పడం. దొర బిడ్డ చదువుకోడం. తల్లి పిచ్చిదనుకున్నాడు. తాను చదువుకుంటే దొరకేం నష్టం? దొరను అడుగుదాం అనుకున్నాడు. దొర వప్పుకుంటాడనే అతని భ్రమ.

తెల్లవారింది. మామూలు కార్యక్రమాల్లో మునిగిపోయాడు. సాయంకాలం అయింది. ఎంకటి లాంతర్లు తుడిచాడు. ముట్టించాడు. లాంతరు పట్టుకొని దొరముందు నుంచున్నాడు. తల వంచుకున్నాడు. ఏదో అడగాలనుకుంటున్నాడు. అడగలేకపోతున్నాడు.

"ఏందిర, ఏమో నసుగుతున్నావు. ఏడవరాదు" అన్నాడు దొర సిగరెట్టు వెలిగించుకుంటూ.

"దొరా, నేన్సదుకుంట"

"ఓర్లంజకొడుకు చదువుకుంటాడటనే" అని గొల్లుమని నవ్వాడు దొర. "చదువుకొని దొరతనం చేస్తావుబే, ఫో... ఫో... లాంతరాడ పెట్టిరా ఫో. ఇంట్ల మీ అవ్వ చస్తది" అన్నాడు.

ఎంకటి అక్కడ్నించి కదల్లేదు.

"చెప్పితే ఇనపడ్తలేదు – పోరా గాడ్డి కొడక! పంతులొచ్చుంటాడు"

"దొర! నాకు సదుకోవాల్నని ఉన్నది"

దొర ఉగ్రుడయిపోయాడు. "నీయవ్వ చదువుకుంటావు గాడ్డికొడక" అని కర్ర అందుకొని బాదేశాడు ఎంకణ్ణి దొర. ఎంకటి చేతిలోని లాంతరు నేలమీద పడింది. పగిలిపోయింది. ఎంకటి వళ్లు పేలిపోతూంది. గదిలో కూర్చున్న పంతులు ఉరికి వచ్చాడు. దొరకొడుకు వచ్చాడు. దొర్సాని వచ్చింది.

ఎంకటి వళ్ళు చిట్లింది. రక్తం కారుతూంది.

"అదేంది పోరని పానం తీస్తవా? వాడు ఛస్తే మనమీదికొస్తది" అన్నది దొర్సాని. కర్ర విరిచి పారేశాడు దొర. "లంజకొడుకు! చుదవుకుంటడట చదువు" అని పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ ఇంట్లోకి వెళ్ళిపోయాడు దొర.

ఎంకటి ఏడవలేదు. గాయాలతోనే లేచాడు. మెట్లు దిగాడు. చీకట్లో వెళ్ళిపోయాడు

"సార్! నాయనెందుక్కొంటిండు ఎంకణ్ణి"

దొర కొడుకు అడిగాడు.

"ఎంకడు చదువుకుంటనన్నడట"

"మరి నేను చదువుకుంటున్నగద?" అని పసివాని అమాయక ప్రశ్న పంతులు దానికి జవాబు చెప్పలేదు - కాదు - చెప్పలేడు.

తల్లిని చూచాడు ఎంకటి దుఃఖం దాగలేదు తల్లిమీద పడ్డాడు. హోరుమన్నాడు.

తల్లి కొడుకును చూచింది. కారుతున్న రక్తం చూచింది. చెప్పిన కధ విన్నది మాత్ర హృదయంలో అగ్నికొండ బద్దలయింది. లావా పొంగింది ఉప్పెన లేచింది తుఫానులు చెలరేగాయి. అగ్నిమంటలు లేచాయి. అతనిని దగ్ధం చేసేవే. కాని ఆమె బానిస గులాము ఆమెకు గుండె ఉందని ఆమె సైతం గుర్తించదు తానే కాలి కూలింది ఏడ్చింది. అంతే, కనీసం శపించలేదు.

ఆ రాత్రి ఇద్దరూ ఉపవాసం.

తెల్లవారినంక అయిన వంటితోనే పనిలోకి వెళ్ళాడు ఎంకటి. లాంతరు గదిలో పెట్టే పని తొలగించాడు దొర. ఇచ్చే గింజలు సగానికి తగించాడు. అరసోలెడు గింజలు చెంబులో పోస్తే గుడ్లల్లో నీళ్లు నిండాయి ఎంకటికి దొరను జాలిచూపుల్తో చూశాడు. ఆ చూపులకు మనిషి అవుతే కరిగి, నీరై, పారేవాడే చూపుల భాష బలం అయింది. దొర కరగలేదు.

ఎంకటి దొర కాళ్ళమీద పడ్డాడు ఏడ్చాడు. "దొరా! నేన్సదుకోను" అని. కన్నీళ్ళతో కాళ్లు కడిగేశాడు. చదువుకంటే గింజలు గొప్పవని తెలిసి వచ్చింది ఎంకటికి. దొరకు ఆ విషయం మొదటి నుండే తెలుసు. అందుకే అతడు అరసోలెడును సోలెడు చేయలేదు

ఎంకటి జీతం చేస్తూనే వున్నాడు తప్పదు. కాని అతనికి ఒక వాస్తవం తెలిసింది. దొరకు చదువంటే బెదురు. కాబట్టి తాను చదువుకోవాలి. ఆ తపన అతన్ని వదలడం లేదు. పసిగుండెలో పరితాపం.

ఎంకటి ఒకనాటి రాత్రి పంతులు ఇంటికి వెళ్ళాడు. తలుపు తట్టాడు. పంతులు తలుపు తీశాడు. ఎంకటిని చూచి ఆశ్చర్యపోయాడు.

"దొర పిలిచిండా?" అడిగాడు.

"కాదండి నేనే వచ్చిన"

"ఏమిటి సంగతి?"

"సదుకోవాల్నని ఉన్నదండి. సదువు చెప్తరా? రాత్రిళ్లు వస్త. దొరకు తెలుస్తే పానం తీస్తడు"

పంతులు గుండె కరిగింది. ఎంత తపన ఉంది చదవాల్నని. ఇతనికి చదువులేదు. ఎంత చెప్పినా రాదు దొర కొడుక్కు. వాడికి చదువు చెప్పాలి. వింతగా వుంది స్థితి.

"దొర కొట్టింది మరిచినవా?"

•"దొరకొట్టిండు గన్కనే సదుకోవాల్నని ఉన్నదండి చెప్పుతరా–రాత్రిళ్ల వస్త?"

"ఎంకటీ బస్తీకి పోరాదు. చదువు చెప్తరు – పైసలిస్తరు – ఏమంటావ్?"

"ఎట్ల పోతనుండి – మా అయ్య అమ్మ పోయిండు దొరకు నన్ను. ఇగ చచ్చేడిదాక బానిసోన్ని? ఎట్లపోత?"

"వెంకటీ! కొత్త ఖానూను వచ్చింది ఇన్నవా? ఎట్టి చేయించుకోటం నేరం. నీ బాంచదనం పోయింది. నువువ విడుదలయినవు. ఇక దొరేం చేయలేడు నిన్ను."

"ఏమన్నవు పంతులూ! దొర బలం పోయినాది? నేను బాంచను కానా? నన్నేం చెయ్యలేడా దొర? పంతులూ నీ కాల్మొక్త నువ్వు దేవునివి" అని స్తుతించాడు ఎంకటి.

ఎంకటి ఉరికాడు తల్లి దగ్గరికి – కేకవేసి చెప్పాడు. "అవ్వా! మనం బాంచలం కాం. ఖానూనొచ్చింది. మనం బస్తీ పోదం. నేన్సదుకుంట."

ముత్తమ్మ కళ్ళల్లో వెలుగులు కనిపించాయి. స్వేచ్ఛలో ఎంత వెలుగుందో కనిపించింది "నిజమా కొడకా! మనం బాంచలం కామా? దొరబలం చచ్చిందా?" ఆ మాటల్లో ఉన్న ఆనందం అక్షరాలకు అందేది కాదు.

తెల్లారి పలకా పుస్తకం పట్టుకొని దొర ఇంటికి వెళ్ళాడు ఎంకటి. దొర నిర్విణ్ణుడయినాడు.

"దొరా! నేను సదుకోనీకి పోతున్నా బస్తీకి" ఎంకటి మాటల్లో గర్వం కనిపించింది.

దొరలో పడగ నేలకు కొట్టుకుంటున్న పాము కనిపించింది.

# లేత మొలకలు

## అరిగే రామారావు

మబ్బుల గొంగళిని వొకింత ప్రక్కకి వత్తిగిలించి చూచి, 'అరే చాలా ప్రొద్దెక్కిందే!' అనుకుంటూ సూర్యుడు బద్ధకంగా వళ్ళు విరుచుకున్నాడు.

ఎండ చురుక్కుమనేసరికి నరిసిమ్మకు గబుక్కున మెలకువ వచ్చింది. ఆవిలిస్తూ నులకమంచం దిగాడు. బద్ధకంగా వళ్ళు విరుచుకున్నాడు.

బయటికి వచ్చి గుడిశ ముందున్న మొండి గోడమీద కూర్చుంటూ "ఓలప్ప కూసిని టీనీళ్ళు పెట్టే!" అన్నాడు

తుమ్మ చెట్టు క్రింద బొచ్చెలు తోముకుంటున్న రావులమ్మ "ఇదేవన్నా మీ బెజాడనుకున్నావా? మాం టీనీలూ కాపీనీలూ ఎట్టుకోవూ తాగమూ!" అంది నిర్మొగమాటంగా.

"ఓలబ్బ గొప్పేలేవే! నాను నీ తోడబుట్టినోడ్ని, సుట్టపోడ్నిగ ందే! అప్పను సూడాలని బెజాడ నుంచి వచ్చాగందా, కూత్తంత మరేద సెయ్యడం లేదా?" దర్జాగా కాలువూగిస్తూ అన్నాడు.

"మాలావు సుట్టం వచ్చావులేగాని, ఒకేసారి వన్నం వండుతా, తిని బేగి బస్సెక్కి ఎల్లిపో!" అని విసుక్కుంది.

"మొత్తానికే మోసంగా వుందేః" అని గొణుక్కుంటూ వీధిలోకి వచ్చాడు.

టీ నీళ్ళకోసం వూరికే నాలిక పీకుతూంది. ఏటి సెయ్యటమా? అని బుర్ర గోక్కుంటుంటే వాళ్ళ సీతాలప్ప గుర్తుకు వచ్చింది. సీతాలప్ప వాళ్ళ చిన్నాయన కూతురు.

అక్కడ్నుంచి నేరుగా సీతాలప్ప గుడిసెకెళ్ళాడు.

నరిసిమ్మని చూచి "బత్తీమండెప్పుడు వచ్చావురా నర్సిమ్మా! బత్తీలో ఏం సేత్తున్నావు ఏంవదీ కతా?" అని ఆప్యాయంగా పలకరించింది.

"ఆ కతంతా సెప్పాలంటే శానా వుందిగాని, బావయ్య ఏడీ కానరాటంలేదే?" అన్నాడు.

"కామందోరు కాడకు పోయ్యాడ్లేగాని కూకో!" అంటూ కుక్కి నులకమంచం వాల్చింది.

అటూ ఇటూ చూస్తూ యికిలిస్తూ సకిలిస్తూ "సీతాలప్ప, బత్తీతమ్ముడుకి టీనీళ్ళూ, కాఫీనీళ్ళూ ఏవీ లేవా?" అన్నాడు.

"ఏదో గంజినీళ్ళు తాగోళ్ళం! ఆ టీలూ కాపీలూ మాకేం తెలుత్తాయిరా తమ్ముడూ? అస్సలయ్యి ఎట్టా ఎట్టుతారో కూడా తెల్దే మాకు?" అమాయకంగా అంది.

"ఓ అదా, ఎట్టా ఎట్టాలో నేసూపిత్తాలేగాని ముందు టీ పొడీ గట్రా తెప్పించు!" అన్నాడు.

అంతలోకే సీతాలు ఏడేళ్ల కొడుకు కొండడు ముంజికాయ చిప్పతో తయార్జేసిన బండిని తాడుతో లాక్కుంటూ క్రిందకు జారిపోతున్న చెడ్డీని మాటిమాటికి పైకి లాక్కుంటూ వచ్చాడు

క్రొత్త మనిషిని చూచి నిలబడిపోయాడు గడ్డం క్రింద చెయ్యి వేసుకుని సరిసిమ్మ వంక ఆశ్చర్యంగా చూస్తూ నిలబడ్డాడు.

"వీడెవ్వడే సీతాలప్పా?"

"నీవెవరూ?" అని ఎదురు ప్రశ్న వేశాడు కొండడు.

"మా పోరడు. మాకుంది వీడొక్కడే!" అంది మురిపెంగా కొడుకు వంక చూస్తూ.

"వీడ్ని సూడంగానే అనుకున్నా వీడు మా మేనల్లుడని. నీ పేరేంట్రా అల్లుడూ?" నవ్వుతూ అన్నాడు.

"కొండడు మరి నీ పేరేంటి?" అన్నాడు.

"ఓర్నీయమ్మ, ఈడు పెద్దోళ్ళకి పెద్దోళ్ళత్తున్నాడే? ఓస్సప్పో, నీ కొడుకు గట్టోడేనే!' అన్నాడు.

సీతాలు కొడుకును దగ్గరకు తీసుకొని ప్రేమగా తల నిమురుతూ చిన్నగా నవ్వింది.

"అల్లుడూ నీకు కోవటి కొట్టు తెల్సుంటరా?"

"బంగారు ప్పాన్ను బంగారయ్య కొట్టు నాకెరికే!"

"ఓలప్పో! ఈడు శానా వుశేరుగా వున్నాడే! మీ అమ్మకాడ డబ్బులు దీస్కోని ఆ బంగారప్పాన్నోడి కొట్టుకెళ్ళి ఒక టీపొట్లాం, సెటాకు పంచదారా – పంచదార లేకపోతే గింత బెల్లం గడ్డా తీసుకురా! ఆ సేత్తోనే సిన్న గలాసుడు పాలు కూడా పట్రా! ఇయ్యాళ మనం బెమ్మాండంగా టీసేద్దాం బేగెళ్ళిరా!" అని వుషారు చేశాడు.

కొండడు వాళ్ళమ్మకాడ డబ్బులు అడిగి పుచ్చుకొన్నాడు. చిన్న కారున్న స్టార్టు చేస్తోన్నట్టు ఎడంచేత్తో ముందుకూ వెనక్కి జరిపి కుడిచేత్తో హారన్ మ్రోగిస్తున్నట్టు 'పాయ్ పాయ్' అని అరుస్తూ నోటితో వింత వింత శబ్దాలు చేస్తూ వుషారుగా లగెత్తాడు.

"అరేయ్ అల్లుడూ ఆ సేత్తోనే నాకు బీడీ కట్టకూడా పట్రా!" వెనకనుంచి కేక పెట్టాడు.

ఇంతలో సీతాలు పొయ్యి రాజేసింది.

ఆపాటికి కొండడు కోవటి కొట్టుకాడున్నుంచి సరుకులన్నీ తెచ్చాడు.

... నరిసిమ్మ ప్రక్కన కూర్చొని సూచనలిస్తుండగా ఒక పెద్ద గిన్నెడు టీ తయారైంది.

నరిసిమ్మ ఆబగా టీ త్రాగుతూ కబుర్లు చెప్పసాగాడు. కొండడు గొంతుక్కూర్చొని చొక్కాతో టీ గ్లాసు పట్టుకొని నోటితో 'వుఫ్ వుఫ్' మని వూదుకుంటూ త్రాగుతున్నాడు

వాడ్ని చూచి నవ్వుతూ "సీతాలప్పా, నీ కొడుకు సేకులాగా వున్నాడు ఈడ్ని బళ్ళో కంపడం లేదా?" అన్నాడు

ఆ గూడంలో కాదుగదా, అస్సలా పల్లెలోనే బడిలేదు. బడికెళ్ళాలంటే ఆరు మైళ్ళకవతల వున్న 'కొత్తవూరు' వెళ్ళాలి. కొండడే కాదు ఆ గూడెంలో ఎవరి పిల్లలూ చదువుకోడం లేదు. ఆ గూడేన్ని ఆ సరస్వతీ దేవి కూడా వెలివేసింది!

కొండడి ఈడు పిల్లలందరూ బర్రెల్ని కాస్తారు. కొండడు కూడా వాళ్ళయ్య పన్జేసే కామందుగారి గొడ్లను రోజూ అడివికి తోలుకుపోయి సాయంకాలం వరకు మేపి, సాయంత్రం వాట్ని చెర్వులో బాగా తోమి కడిగి తీసుకువస్తాడు. అదే వాడి దినచర్య! చదువూ చట్టుబండలూ లేవు!

"సేకులాంటోడ్ని సదువూ సందల్లేకుండా బర్రె గొడ్డుల్ని కాపిస్తున్నావా సీతాలప్పా! ఈడ్ని నా వెంట బస్తీకి పంపు. బస్తీలో బెమ్మాండంగా సదివిస్తా! ఏరా, నా ఎంట బత్తీకొచ్చి ఆడ సదువుకుంటావా అల్లుడూ?" అని అడిగేడు

కొండడు వుషారుగా "ఓ" అన్నాడు

"అమ్మా నానూ బత్తీబళ్ళో సదుకుంటానే!" అని వాళ్ళమ్మ దగ్గర మారాం మొదలు పెట్టాడు.

"మనకెందుకురా కొండా ఈ సదువులు?" నిర్లిప్తంగా అంది.

"ఏంటప్పా అట్టా గంటావు? పేడలో పుట్టామని బతికినంతకాలం మనం, మన పిల్లలూ, ఆళ్ళ పిల్లలూ ఈ పేడే పిసుక్కుంటూ ఈ బర్రెల్నే కడుక్కుంటూ ఈ పేడ బతుకులే బతకాలా? నేను బెజాడలో సూత్తున్నానుగా! ఆడపిల్లలందరూ సదువుకునేవాళ్ళేగాని సదువుకోనోళ్ళు ఎవళ్ళూ వుండరూ! నా మాట విని కొండడ్ని కూడ బత్తీకి పంపించి సదివించు. అందరిమల్లే ఆడూ సదువుకుంటాడు. పెద్ద ఆపీసరు అవుతాడు...."

నరిసిమ్మ ఇలా చెప్పుతూంటే సీతాలు ఎక్కడో ఆలోచిస్తోంది.

కొండడు మళ్ళీ "అమ్మా ఓలమ్మా! నానూ సదువుకుంటానే:" అని గొడవ చేయసాగాడు.

"మీ అమ్మ అట్టాగే అంటుందిగానీ నువ్ నాతో వచ్చేయరా కొండా!"

"నేనెల్తా నేనెల్తా!" కాళ్ళూ చేతులూ రపరపా కొట్టుకుంటూ గొడవ చేయసాగాడు.

"ఓరుండరా అట్టాగే ఎల్దువుగాని! నరిసిమ్మా, నాకు తెలియక అడుగుతాగానీ బత్తీలో ఈడేడ వుంటాడు? ఏడ తింటాడు? ఆ కర్సు మన కలిమయ్యే దేనా?" బోలెడు అమాయకంగా అడిగింది.

"ఒప్పదా నీ సంకోసం? ఇదివరకు మల్లే కాదప్పా! గవర్నమెంటోళ్ళు మనలాంటోళ్ల పిల్లలు సదుకుంటానికి బత్తీలో ఆట్టాళ్ళు పెట్టించారు. రెండు పూటలా తింటానికి కూడూ, సదుకోటానికి పుత్తకాలూ కట్టటానికి బట్టా కాక పై కర్సులకు నెలనెలా ఇంతని డబ్బూ అన్నీ ఆళ్ళే యిత్తారు."

"ఎట్టా?" నోటిమీద వేసుకుని ఆశ్చర్యంగా అంది.

"అవునే అప్పా! మన సేతికర్సు పైసా కూడా పెట్టక్కర్లేదు. కొండడ్ని నాతో పంపిత్తే సాలు. పెద్ద పెద్ద సదువులు సదివి సూటూ బూటూ వేసుకొని మళ్ళీ ఆడు దొరబాబులాగా తిరిగి వత్తాడు. గంతే!"

"సర్లేరా, ఆళ్ళయ్యను కూడా కనుక్కోని అట్టాగే పంపిత్తా!"

"అయ్య వద్దంటాడే! అయ్యకి నీవ్వే సెప్పే! ఓలమ్మా నన్నంపే, బత్తీలో సక్కగా సదువుకుంటానే!" అంటూ వాళ్ళమ్మ భుజం మీద వాలి మారాం మొదలు పెట్టాడు.

"ఓరట్టాగే ఎల్దువుగాన్లేరా!" అంటూ కొడుకును వళ్ళోకి లాక్కోని ప్రేమగా ముద్దు ఎట్టుకుంది

"ఇయ్యాళ సాయంకాలం బస్సుకే నేవెళ్ళిపోతున్నా సీతాలప్పా! ఈ లోపల బావయ్యతో సెప్పి బుడ్డోడ్ని రెడీ సెయ్యి! మర్నేవొత్తా! వొత్తా అల్లుడూ, నువ్వు లెడీగా వుండు!" అని నరిసిమ్మ వెళ్ళిపోయాడు.

వళ్ళో పడుకున్న కొడుకు తన చిన్న చేతుల్తో తన గడ్డం పట్టుకొని "అమ్మా, నేనెల్తానే నన్నంపే!" అని బ్రతిమాలుతూ ఉంటే సీతాలు ఆలోచన్లో పడింది.

అప్పుడెప్పుడో చావేళ్ళు క్రింద పోలేరమ్మ జాతరకు కొత్త వూరెళ్ళినప్పుడు అక్కడ డేరా హాల్లో ఒక సినిమా చూచింది. ఆ సినిమాలో కూడా పాలేరుతనం చేసే చిన్న కుర్రాడు బస్తీకెళ్ళి చదువుకుంటాడు. తెల్లటి బట్టలు వేసుకొని సంచి భుజానేసుకుని బూట్లేసుకుని బడికెళ్ళుతాడు. మళ్ళీ అంతలోనే పెద్దోడు అయిపోతాడు. సూటూ బూటూ వేసుకుంటాడు. పెద్ద ఆఫీసరయిపోతాడు. కొడుకును చూచుకొని వాళ్ళమ్మ ఎంతో సంబరపడిపోతుంది. తన జన్మ ధన్యమై పోయినట్లు పొంగిపోతుంది. "అమ్మా!" అంటూ తల్లిని కౌగలించుకుంటాడు. అప్పుడా తల్లి తన నెత్తిన బంగారు కుండలలో పై నుంచి దేవతలు అమృతం పోసినట్లు పరవశించిపోతుంది. ఆ సినిమా చూస్తున్నప్పుడు అనుకుంది తనకు పుట్టే కొడుకును కూడా అలా చదివించి గొప్పోడ్ని చెయ్యాలని. ఆ తర్వాత ఆ సంగతే మర్చిపోయింది. మళ్ళీ ఈరోజు ఈ నరిసిమ్మ వచ్చి చెప్పాక ఆ పాత 'వూసు' మళ్ళీ యిప్పుడు గుర్తుకు వచ్చింది. ఆ పాతకోర్కె మళ్ళీ తన గుండెల్లో జవజవలాడింది.

.... బ్రతిమాలీ, బామలీ, తగువులాడీ ఎలాగైతేనేం మొగుడ్ని వప్పించి ఆ సాయంకాలమే కొండడ్ని నరిసిమ్మ వెంట బస్తీకి పంపించింది. విడిగా మరో చొక్కా లాగూ ఒక తుండు గుడ్డలో మూటకట్టి కొడుకు చేతికి యిచ్చింది. మొన్న తొలి ఏకాదశికి కొట్టిన పేలపిండిని ఒక కాగితంలో పొట్లం కట్టి 'ఆడ తినరా కొండా!' అని ఆ మూటలో పెట్టింది.

కొండడి తండ్రి బిచ్చాలు షావుకారుకాడ అప్పుచేసి బస్సు చార్జీలకూ, దారి ఖర్చులకూ ముప్పై రూపాయలు నరిసిమ్మ చేతిలో పెట్టాడు.

బస్సెక్కపోయే ముందు సీతాలు కొడుకును ప్రేమగా దగ్గరికి తీసికొని బుగ్గలు పుణికి "అయ్యా కొండా నీవు బత్తీలో బాగా సదుకొని దొరబాబులాగా తిర్గి రావాలిరా అయ్యా!" అని కన్నీళ్ళు పెట్టుకుంది.

తన చిన్న చేతుల్తో తల్లి కన్నీళ్ళు తుడుస్తూ "అట్టాగేలేవే, నీవు ఏడమ్మాకే" అన్నాడు.

☆ ☆ ☆

బస్సు వేగంగా పోతూంది.

కొండడు బస్సులో కిటికీ పక్కన కూర్చున్నాడు. ఇళ్ళకు తిరిగిపోతున్న గేదెలూ ఆ గేదెల్ని కాసే బుడ్డోళ్ళూ, తోటలూ, దొడ్లూ తాడిచెట్లూ, చెర్వులూ వాగులూ వంకలూ ఒకదానివెంట ఒకటి వెనక్కి వెనక్కి పోతూంటే వేగంగా పోయే బస్సులోంచి ఈ దృశ్యా లన్నింటినీ చూడడం కొండడికి ఎంతో వింతగా సరదాగా వుంది. అసలు బస్సెక్కటం వాడికదే మొదటిసారి. పక్కనున్న క్రొత్తవూళ్ళో ఇలాగే జాతర్లకు, సంతలకు అప్పుడప్పుడూ తండ్రి వెంట వెళ్ళేవాడేగాని బస్సు మాత్రం ఎప్పుడూ ఎక్కలేదు ఎప్పుడెళ్ళినా ఎక్కడికెళ్ళినా వాళ్ళయ్య భుజాల మీద కూర్చునేవాడు

అమ్మకూ, అయ్యకూ, పుట్టి పెరిగిన గూడెంకు దూరంగా వెళ్ళిపోవడం బాధగా వున్నా – తాను బస్తీలో చదువుకోటానికి పోతున్నాననే సంతోషం ముందు ఈ బాధ పెద్ద దిగులు అనిపించలేదు వాడి ధ్యాసంతా బడీ, పిల్లలూ, నల్లబోర్డూ బోలెడు పుస్తకాలూ, ఆ పుస్తకాలన్నీ తను చదవటం – వీటి మీదే వుంది!

చల్లగా వీస్తోన్న గాలికీ, బస్సు కుదుపుళ్ళకూ వాడికి తెలియకుండానే నిద్ర ముంచుకొచ్చింది... మళ్ళీ మెలకువ వచ్చి బయటికి చూచేసారికి బాగా చీకటి పడిపోయింది. వీధి దీపాలు బస్సులూ, బుడ్డకార్లూ రిక్షాలూ మనుషులూ, షాపులూ కనిపిస్తున్నాయ్...

అంతలో బస్సు విజయవాడకు చేరుకుంది. ఒక సెంటర్లో ఆగింది అక్కడ వాళ్ళు దిగారు.

నరిసిమ్మ మావ తన చెయ్యి పట్టుకుని బాగా రద్దీగా వున్న ఆ సెంటర్లో నడిపించు కుంటూ ఎక్కడికో తీసుకుపోతున్నాడు. బట్టల మూటను చంకలో పెట్టుకుని మరో చేత్తో మావయ్య-చెయ్యి పట్టుకొని నడుస్తోంటే ఎన్నో దుకాణాలూ కళ్ళు మిరుమిట్లు కొల్పే దీపాలూ, బస్సులూ, పెద్ద పెద్ద మేడలూ కనిపించాయి. వీటన్నింటినీ చూడ్డం తనకెంతో వింతగా, చోద్యంగా వుంది.

తను వూరికే దిక్కులు చూస్తోంటే!, 'ఓరరయ్, నడువురోయ్!" అన్నాడు మావ.

ఆ బజార్లు గుండా నడిచి నడిచి రైలు కట్టకేసి వచ్చారు. రైలు పట్టాలూ, పచ్చగా ఎర్రగా వున్న దీపాలు కనిపిస్తోన్నాయి. దూరంగా రైలు కూతలు వినిపిస్తోన్నాయి. ఇంతలో

దడదడా శబ్దం చేసుకుంటూ ఒక రైలుబండి ఆ పట్టాల మీద యమ స్పీడుగా వెళ్ళిపోయింది. ఆ రైల్ను తను నోరెళ్ళ పెట్టుకుని చూస్తూ నిలబడ్డాడు.

తనని అలా నడిపించి నడిపించి ఒక కాలవగట్టు కేసి తీసికెళ్ళాడు. అక్కడ చీకటిగా వుంది. తనకెందుకో భయమేసింది. అంతలో చిన్న గుడిశలు కనిపించాయి.

ఒక గుడిశ ముందు ఆగి "మస్తాను వుండేదెక్కడ?" అని మావ వాకబు చేశాడు.

ఇంకొంత దూరం నడిచాక ఒక గుడిశ ముందు ఆగారు ఆ గుడిశ ముందేసిన నులక మంచ మీద ఒక మనిషి కూర్చుని మరో ఆడమనిషితో వూసులాడుతున్నాడు. అతను నరిసిమ్మ మావను చూచి "ఎవరది?" అంటూ లేచి వచ్చాడు. అతడు పొడుగు పంట్లాం కురచ చేతుల రంగుల బన్నీను తొడుక్కున్నాడు. సిగరెట్టు త్రాగుతున్నాడు.

"నేనే మస్తానన్నా!" అంటూ మావ ముందుకెళ్ళాడు.

"నీవ్వా, ఏంటి పనిమీద వచ్చావు?" అన్నాడు.

"వూర్నోంచి మా వాళ్ల బుడ్డోడ్ని తీసికొచ్చా" అంటూ అతన్తో ఏదో మాట్లాడాడు.

తను ఆ ప్రక్కనున్న లైటు స్తంభం క్రింద ఒకదానిమీద ఒకటి పడుతూ లేస్తూ హుషారుగా గంతులేస్తోన్న రెండు కుక్కపిల్లల్ను సరదాగా చూస్తూ నిలబడ్డాడు.

ఆ మస్తాను తన దగ్గరకొచ్చి భుజం మీద వేశాడు నవ్వుతూ, "నీ పేరేనా కొండడు?" అన్నాడు. అవునన్నట్లు తాను తల వూగించాడు.

"నిన్ను హైదరాబాదుకు తీసికెళ్లి అక్కడున్న గవర్నమెంటోళ్ల హాట్టల్లో జేరిపిస్తా. మరి బాగా చదువుకుంటావా?" అన్నాడు.

తను హుషారుగా తల వూగించాడు.

నరిసిమ్మ ఆ రాత్రి కొండడ్ని హోటల్‌కి తీసికెళ్ళి భోజనం పెట్టించాడు. కుర్చీలో కూర్చొని టేబిల్ మీద స్టీలు కంచంలో భోంచెయ్యాలంటే కొండడికి మహా యిబ్బంద యిపోయింది. కుక్కి మంచంలోనో, వాళ్లమ్మ ఒడిలోనో వాళ్ల గుడిశె ముందున్న మొండి గోడమీదనో కూర్చొని సత్తిబొచ్చెలో ఏ గంజినీళ్లో త్రాగి ఏ సంకటి కూడో తినేవాడు. ఆ లైట్లూ ఆ సర్వర్లూ కంచంలో అన్ని రకాల కూరలూ చూస్తోంటే బెరుకుతో సిగ్గుతో అన్నం సరీగ్గా తిన్లేకపోయాడు.

హోటల్లో భోంచేశాక రైల్వే స్టేషను కెళ్లాడు. స్టేషన్లో ఒక బెంచీమీద పడుకున్నారు. తన గుడ్డల మూటని తలకింద పెట్టుకున్నాడు. వచ్చేపోయే రైళ్ళ కూతులు వింటూ కళ్లు మూసుకున్నాడు. వెంటనే నిద్రపట్టలేదు. తల్లి గుర్తుకు వచ్చింది. మెడను వాటేసుకొని వెచ్చగా, హాయిగా పడుకోవడం గుర్తుకు వచ్చింది. కన్నీళ్లు వుబికాయి. గొంతులో ఏడ్పు సుళ్లు తిరిగింది. హైదరాబాదులో తాను చదువుకోవాలనే బలమైన కోర్కె మళ్ళీ అంతలోకే ఆ కన్నీళ్లనూ, ఆ ఏడ్పునూ అణిచేసింది. అక్కడ తాను చదవబోయే చదువు గురించి రకరకాలుగా ఆలోచించుకుంటూ మెల్లగా నిద్రలోకి జారిపోయాడు....

నరిసిమ్మ మావ మళ్లీ చీకటితో లేపాడు. రైల్వేస్టేషను పంపు దగ్గర మొగాలు కడిగారు. మావ తనకుయిడ్డెన్లు పెట్టించాడు. కాఫీ యిప్పించాడు. ఇంతలోకి రాత్రి చూచిన

మస్తాన్ వచ్చాడు. అతని భుజానికొక సంచి తగిలించుకున్నాడు.

దడదడా శబ్దం చేస్తూ రైలుబండి వచ్చి ఆగింది.

"అల్లుడూ, మన మత్తానన్న నిన్ను అయిదరాబాదులో హాట్టల్లో జేరిపిస్తాడు. బాగా సదువుకో!" అన్నాడు నరిసిమ్మ.

"నువ్వు రావా?" దిగులుగా అన్నాడు.

"నేనెందుకు రా, మన మత్తానన్న వున్నాడుగా! బెంగెట్టుకోమాకు నేనప్పుడప్పుడు వచ్చి సూతుంటాలే!"

అంతలోకే రైలుబండి కదిలింది మావ చెయ్యి వూపుతూంటే తనూ వూపాడు భయం భయంగా బోలెడు మనాదీగా వుంది మళ్లీ అంతలోకే వుషారు తెచ్చుకున్నాడు

ఎదురు సీట్లో యించుమించు తనీడువాళ్లే యిద్దరు కుర్రాళ్లు కూర్చున్నారు. వాళ్లు మంచి బట్టలు వేసుకున్నారు. చొక్కాల్ని లాగుల్లోపల దోపి, పైన బెల్టులు పెట్టుకున్నారు మేజోళ్లూ బూట్లూ వేసుకున్నారు వాళ్లిద్దరూ అన్నదమ్ముల్లాగా వున్నారు వాళ్లకు పరీక్షలయిపోయినట్లున్నాయి వాళ్లమ్మానాన్నలతో కలిసి శలవుల్లో హైదరాబాదు చూడటానికి వాళ్ల బంధువులింటికి పోతున్నారు ఆ పిల్లలు నవ్వుతూ త్రుళ్లుతూ వూరికే కాళ్లు వూగిస్తూ కామిక్స్ పుస్తకాలు చదువుకుంటున్నారు.

కొండడు ఆ యిద్దరు పిల్లల్నీ, వాళ్ల చేతుల్లో వున్న పుస్తకాలనూ మార్చి మార్చి చూస్తూ ఏవేవో వూహాలోకాల్లో విహరించసాగాడు తాను కూడా ఈ పిల్లల్లాగా బళ్లో బోలెడు చదువుకొని, బాగా పరీక్షలు వ్రాసి శలవుల్లో యింటికి వెళ్లుతాడు. అమ్మ తనని చూడగానే, 'మా అయ్యే, నా కొండే!' అని ముద్దులాడుతుంది. అయ్య తనని వళ్లో కూర్చో పెట్టుకొని, తాను బళ్లో నేర్చుకున్న పాఠాల్ని చదివి వినిపించుకొని మురిసిపోతాడు. ..

ఇలా వూహాలవుయ్యాల్లూగుతూ మెల్లగా చిన్న కునుకు తీశాడు....

☆ ☆ ☆

నాంపల్లి స్టేషన్లో దిగారు. రిక్షా ఎక్కారు.

ఆ రిక్షా పెద్ద పెద్ద బజార్లగుండా పోయీ పోయీ చివరికి ఒక పెద్ద కాలనీలోకి మళ్లింది. ఆ కాలనీలో అన్నీ పెద్ద పెద్ద భవంతులన్నాయి.

ఒక పెద్ద బంగళా ముందు రిక్షా ఆగింది. తనను బయట వరండా మెట్ల దగ్గర నిలబెట్టి మస్తాను లోపలికెళ్లాడు.

వరండాలో గొలుసుతో కట్టేసి వున్న కుక్క భౌ భౌమని అరుస్తూ తన మీదకు దూకబోయింది. తనకు భయంతో లాగు తడిసిపోయేంత పనయింది!

మరి కాసేపటికి మస్తాను బయటికి వచ్చాడు. తనని లోపలికి తీసికెళ్లాడు.

ఒక లావుపాటాయన వాలుకుర్చీలో సుఖంగా కూర్చొని విశ్రాంతి తీసికుంటున్నాడు. ఆ గదిలో చాలా చల్లగా, హాయిగా వుంది.

మస్తాను తనని ఆయనకు చూపించి, "వీడే సాబ్! నేను వూర్నించి తీసికొచ్చిన

కుర్రాడు. కొండా అయ్యగారికి దణ్ణంపెట్టు! అయ్యగారూ అమ్మగానూ చెప్పినట్లు వినుకోవాలి! బాగా సదువుకోవాలి! నేనప్పుడప్పుడు వచ్చి చూచిపోతుంటాలే!" అన్నాడు

మస్తాను ఆ సాబ్‌కు వంగి వంగి దణ్ణాలు పెట్టి వెళ్లిపోయాడు.

ఆయన కొండడ్ని నఖశిఖ పర్యంతం పరీక్షగా చూశాడు.

"నీ పేరేంటిరా " అని అడిగాడు. తను చెప్పాడు.

ఆయన మళ్లీ "కాంతమ్మా" అని పిలిచారు. లోపల్నుంచి ఒకామె వచ్చింది. "పిలిచారా అయ్యగారూ?" నమ్రతగా అంది. హిందీలో ఆమెకేదో చెప్పారు.

కాంతమ్మ వాడ్ని లోపలికి తీసికెళ్లింది. తన చిన్న బట్టల మూటను చంకలో పెట్టుకొని బితుకు బితుకుగా ఆమె వెనకాల వెళ్లాడు పెద్ద పెద్ద గదుల్లోంచి నడిపించుకొని ఒక దొడ్లోకి తీసికెళ్లింది.

ఆ దొడ్డి ఈ చివర్నుంచి ఆ చివరి వరకు వుంది. ఒక ప్రక్క వేపచెట్టు కూడా వుంది. దాని కిందే పంపు వుంది ఆమె తనని ఆ పంపు కింద స్నానం చెయ్యమంది. స్నానం చేసి వచ్చాక వెనుక వరండాలో అన్నం వడ్డించింది. నేలమీద కూర్చొని అన్నం తిన్నాడు. ఆయమ్మ మంచావిడలాగే వుంది. కొసరి కొసరి వడ్డించింది. కడుపునిండా అన్నం తిన్నాడు

"ఆ పళ్లెం గ్లాసు కడిగి అదిగో అక్కడ ఆ కిటికీలో పెట్టుకో!" అంది.

కంచం కడిగి ఆ కిటికీలో పెట్టాడు. తడి చేతులు లాగుకు పాముకున్నాడు.

దొడ్లో వేపచెట్టు గాలికి నిద్ర ముంచుకొచ్చింరది. ఆ వరండాలోనే వత్తిగిల్లాడు. 'హాట్టల్లో మిగతా పిల్లోళ్లు ఏడా కానరాటం లేదేంటి! అంతా బళ్లోల్లోకి పోయి వుంటార్లే! ఆటలవీ ఆడి మళ్లీ సాయంకాలానికి పాలోమంటూ వత్తారు....' ఇలా అనుకుంటూ మెల్లిగా నిద్రలోకి జారిపోయాడు.

కాసేపు నిద్రపోయాడో లేదో కాంతమ్మ నిద్ర లేపింది.

"నీ పేరేంటి?" అంది.

ఆట్టలు పుత్తకాల్లో రాసుకుంటారేమో అనుకుంటూ, "కొండడండీ! మా అయ్య పేరు బిచ్చాలు, మా అమ్మ పేరు సీతాలండీ!" అదేదో పాఠంలాగా అప్పజెప్పాడు. ఆమె చిన్నగా నవ్వింది. తను సిగ్గుపడుతూ తల వంచుకున్నాడు.

"అదిగో ఆ పంపు కింద బొచ్చెలు వేశాను. అవన్నీ బాగా తోమి కడుక్కురా! అమ్మగారు నిద్దర లేస్తారు. ఆమెకు ఫలహారం తయార్జేసి చాయి పెట్టాలి!" అంటూ హడావుడిగా లోపలికెళ్లిపోయింది.

అటు చూశాడు, పంపు కింద బొచ్చెలు గుట్టగా పడేసి వున్నాయి.

చదువు చెప్పే ఆట్టల్లో పిల్లలచేత బొచ్చెలూ, బోళ్లూ కూడా తోమిత్తారేమో అనుకున్నాడు.

"ఓ పిల్లోడా, యింకా మొదలుపెట్టలేదా? వాటితో నాకు చాలా పనుంది తొందరగా తోముకురా!

ఆ గూట్లో డబ్బాలో పొడి వుంది. అదేసి తోము!" లోపల్నుంచి కేకపెట్టింది.

ఆ కేకకు వులిక్కిపడ్డాడు. బొచ్చెలు తోమేడానికి సిద్ధమయ్యాడు

ఆ గుట్టలో ఎంగిలి కంచాలూ, గ్లాసులూ గరిటలూ, ప్లేట్లూ పెద్ద పెద్ద కూరగిన్నెలూ, డెగిశాలూ నానా రకాల బొచ్చెలూ వున్నాయి. తనకయితే బర్రెగొడ్లను తోమి తోమి కడగటం వచ్చుగానీ ఈ బొచ్చెలూ బోళ్లూ తోమటం రాదు తన తల్లి తన చేత ఎప్పుడూ ఇలాటి పన్లు చేయించలేదు.

తల్లి బొచ్చెల్ని ఎలా కడిగేదో గుర్తుకు తెచ్చుకుంటూ తన చిన్న చేతుల్తో వాట్ని తోమే ప్రయత్నంలో వున్నాడు

మధ్యలో కాంతమ్మ వచ్చింది "ఏరా కొండయ్యా, నీకు బొచ్చెలు కడగడం రాదా?" అంది. అవునన్నట్లు తల వూపాడు. పక్కన నిలబడి ఎలా తోమాలో సూచనలిస్తోంది.

ఇంతలో లోపల్నుంచి మరోకామె వచ్చింది. ఈమె ఖరీదైన చీరకట్టి మనిషిడాబుగా హుందాగా వుంది. 'అమ్మగారు' అంటే ఈమే కాబోలు!

అప్పటివరకు ఫ్యానుగాలి క్రిందా, మెత్తటి పరుపు మీదా సుఖంగా నిద్రపోయి వచ్చిందల్లే వుంది. మొగం వుబ్బి నిగారింపుగా వుంది.

ఆమె "కాంతమ్మా, ఈ కుర్రాడు ఎలా పన్జేస్తోన్నాడు" అని అడిగింది ఆమె గొంతు కూడా హుందాగా వుంది.

కొండడు తల ఎత్తి ఆమెను చూచాడు.

"కొత్తకదమ్మగారూ! దగ్గరుండి నేర్పిస్తే రెండురోజుల్లో నేర్చుకుంటాడు" అంది కాంతమ్మ. ఆమె ఆ యింట్లో వంటావిడ; కొండడికి వాళ్ల మాటలు కొంచెం కూడా అర్థం కావటం లేదు. 'మరి అసలు సదువెప్పుడు నేర్పిత్తారో!' అనుకున్నాడు.

'ఈ హైదరాబాదులో ఎంత డబ్బు పోసినా సరీగ్గా చేసే పనివాళ్లు దొరకటం లేదు. ఊరికే నాగాలు పెడతారు ఒక్కొక్కళ్లు నాలుగైదు యిళ్లు వప్పుకుంటారు వీళ్లతో పడలేకుండా వున్నామని అయ్యగారు వీడ్ని పల్లెటూర్నుంచి తెప్పించారు. మనింట్లోనే పర్మనెంట్‌గా పడి వుంటాడు అన్ని పన్లూ చేస్తాడు..." అంది.

"మరేనమ్మగారు!"

"..... వీడికి అన్నం పెట్టి బట్టలిచ్చి, సంవత్సరానికి వెయ్యి రూపాయిలు యివ్వాలంట...."

కొండడి చేతులు గిన్నెల్ని రుద్దడం ఆపేసాయి. ఎత్తిన తల అలాగే వుంది. బిత్తరపోయి చేష్టలుడిగి ఆ అమ్మగారి మాటలే వింటున్నాడు....

"... వీళ్ల వాళ్లకివ్వాలని, చార్జీలకనీ, దానికనీ దీనికనీ వీడ్ని తీసికొచ్చినవాడు అయ్యగారిదగ్గర ముందే రెండువేల దాకా తీసుకుపోయాడంట! ..."

వేపచెట్టు మీది కాకులు గోలగోలగా అరవటం మొదలుపెట్టాయి.

'ఇదంతా దగా-పచ్చిమోసం-ద్రోహం-' అంటున్నాయా అన్నట్లు ఆ కాకులు ఆపకుండా గోలగా, వూరికే అరుస్తోన్నాయి!

మరి ఈ దగా ఎవరు చేశారు? ఈ పచ్చి మోసం ఎవరు చేశారు? ఈ ద్రోహం ఎవరు చేశారు?

నరిసిమ్మ మామ చేశాడా?

ఈ మస్తాను చేశాడా?

డబ్బులకాశపడి తన అయ్య చేశాడా?

డబ్బుకు కక్కుర్తిపడి తన తల్లే చేసిందా?

అంటరానివాడని కంటగించుకొని ఆ చదువుల తల్లి సరస్వతే చేసిందా?

కొండడి చిన్నారి మనస్సుకు ఇది అంతుపట్టని ప్రశ్నే! వాడి లేత వెన్నుకు ఇది పిడిబాకు పోటు! కాకులింకా అరుస్తోనే వున్నాయి. ..

# గూడుకోసం గువ్వలు

## పులికంటి కృష్ణారెడ్డి

"ఒకటీ.... రెండూ.   మూడు"

ఒకదాని వెంబడి ఒకటి అన్నీ మిలమిలా మెరిసే తెల్లని పది నయాపైసల కాసులు కుడిచేతి నుండి ఎడమచేతిలోనికి జారి పడుతూంటే, ప్రాగ్దిశాభాగాన సూర్యభగవానుడు పైకెక్కేకొద్దీ విచ్చి వికసించే అరవిందములా వెలిగిపోతూంది బోయిన గురప్పతాత ముఖారవిందము!

"నాలుగూ... ఐదూ. ... ఆరూ... . ముప్పై!"

లెక్కపెట్టడం ఆగిపోయింది పిడికిలి మూతబడింది పిడికెడు నిండా ముప్పై పది నయాపైసాల కాసులు. మున్నూరు నయాపైసాలు!. . మూడు రూపాయలు!! "మూడు రూపాయలు!" అని మరొక్కసారి సంతృప్తిగా తనలోతాను అస్పష్టంగా గొణుక్కున్నాడు గురప్పతాత. ఎక్కడెక్కడో, ఎవరెవరి జేబుల్లోనో భద్రపరచబడిన కాసులు తన చేతిలో రాడానికి కారణం .... తన రామచిలుక! ఇంకిపోయిన బ్రతుకుబాటలో ఇగిరించిన మొలక!

-సర్కసు డేరా చుట్టూ వేసిన చారలచారల పరదాగుడ్డ మాదిరి ప్రహారీగోడ! ఆ గోడ లోపల పెద్ద మేడ! ఆ మేడలోపల గర్భగుడి! ఆ గుళ్లో గోవిందరాజస్వామి! ఆయన ఏడాది కొక్కసారి లేస్తారు. ఆయన లేవడానికి వారంరోజులు ముందుగానే గుడి ముందర ఉన్న తేరు సింగారిస్తారు  వానకు తడిసి, ఎండకు ఎండి 'పులిగుండు'లా ఉన్న తేరు పేరంటానికి బయలుదేరే ముత్తయిదువులా పసుపు పూసి కుంకుమబెట్టి కమ్మలు, మాటీలు తగిలించుకొని వన్నెలు చిన్నెలు వారుకొంటుంది.

ఆ ఒక్కరోజు తప్ప మిగతా దినాల్లో ఆ రథము దీనాజనాశ్రిత కల్పవల్లి! ఆ నీడలో ప్రక్కన బీడులో, గూడులేని గువ్వలు, తోడులేని అవ్వలు చేరుతుంటారు. తాడులేని బొంగరాలు, గోలీలు ఆడుతుంటారు. ఆ ప్రక్కనే చిన్న చిన్న అంగళ్ళు ఉంటాయి. అక్కడే గురప్పతాత అంగడికూడా!

బలపరాతి విగ్రహంలాంటి రూపు, ఎప్పుడూ ఏదో వెదుకులాడే చూపూ, అనుభవంతో పండిన శిరోభాగాన్ని నుదిటిని వేరుచేస్తూ దట్టంగా మూడు విభూతి పట్టెలు, ఆ పట్టెల మధ్య పెద్ద కుంకుమబొట్టు, మెడలో రుద్రాక్ష మాలలు బూడిద గుమ్మడికాయంత తలగుడ్డ, చెంపలనిండుకు చేరడేసి కన్నులు గాదు - బారడేసి మీసాలు.... గురప్పతాతను చూస్తే ఏదో గురుతరమైన భావం కలిగిమంత్రముగ్ధులై ఎదుట నిలబడి పోవలసిందే!

ముందు నాలుగుమూరల తుండుగుడ్డ పరచుకుంటాడు. ఆ గుడ్డపైన ఓ యాభై కవర్లు వరుసగా పేరుస్తాడు. మనం అనుకుంటూ వుంటాం. బ్రహ్మ మన అదృష్టాలను పుట్టించినపుడే నొసట వ్రాస్తాడని! కానీ గురప్ప తాత జీవితానుభవాన్ని క్రోడీకరించి కరక్కాయసిరాతో కార్డుముక్కల మీద మానవుల జాతకాలు వ్రాసి ఆ కవర్లలో ఉంచాడు. ఒక్కొక్క జాతకం విలువ పది నయాపైసలు! ప్రక్కనే పంజరం వుంటుంది. ఆ గుడ్డమీదనే ఒకమూల, చెద పురుగులతో స్నేహం చేసి, శీతాతప బాధలను సహిస్తూ అట్ట మీద వెంకటేశ్వరుడు వాడిన పూలవెనుక వెలిగిపోతూ సాక్షీభూతంగా ఉన్నాడు. ఆయన ముందు ఓ బుడిగ హుండీ వుంది.

"అదో బాబుగారొచ్చాడు చూడు! మనసులోని మాట, మనసున్న చోటు! పలకవే చిలకా!" అంటూ గురప్ప పంజరం తలుపులు తీస్తాడు. ఎగిరి గంతేసి బాబుగారి భుజం మీద వాలుతుంది చిలుక. "శాస్త్రం చెప్పమంటే భుజం మీద సవారి చేస్తావేమే?.... ఓహో! కానుక కావాలనా?" అంటూ బహు నైపుణ్యంతో తన ఫీజు సంగతి హెచ్చరిస్తాడు గురప్పతాత. 'కార్ కార్' మంటుంది చిలుక. ఆ వచ్చిన పెద్దమనిషి చిత్తయిపోయి కిమ్మనకుండా వల్లెవాటు ముడి విప్పుతాడు. ఏది యిచ్చినా గ్రహించకుండా ఓ పది నయాపైసల కాసును ముక్కుతో స్వీకరించి తన నిజాయితీ చాటుకుంటుంది చిలుక ఆ మీదట బుడిగ హుండీలో కాసును జారవిడిచి తుండు గుడ్డ మీది యాభై కవర్లలో ఏదో ఒకదానిని పట్టి బయటకు లాగి అంతటితో తన పని తీరిపోయినట్లగ మరలా పంజరం చేరుకుంటుంది. ఆ కవరును గురప్పతాత అందుకుంటాడు. ఏభై యో పడిలో పడిన అతని కండ్లు గాలి భయానికి లోపలికి త్రోసిపెట్టిన దీగూడులోని దివ్వెల్లా వెలిగిపోతూంటే వానిని మరింత విస్తృతం చేసి ఆ జాతకాన్ని ఒకస్థాయిలో చదువుతాడు. అనుకున్న పని అవడం, సంవత్సరం తరువాత భేషయిన యోగం - లాంటి అద్భుత విషయాలతో కూడుకొని ఉంటాయి ఆ జాతకాలు. జాతకుడు బహు ప్రజ్ఞాశాలియై ఈ విషయాలను స్వ విషయాలతో బహు చక్కగా సమన్వయించుకోడం, సంతోషంగా వెళ్లిపోవడం యాంత్రికంగా జరుగుతూంటుంది. భావిజీవితాన్ని గురించి కలలు గనే మనస్తత్వం గల వ్యక్తులకు మనలో కొదువలేదు. కాబట్టే గురప్పతాతలాంటి వ్యక్తులు గుట్టుగకాలం నెట్టుకొస్తున్నారు.

అతనికి ఉత్తరంగా నాలుగ్గాళ్ళ మంటపం దగ్గర గడియారంలోని పెద్ద ముల్లు ఇర్వై నాలుగుసార్లు తిరుగుతుంది. భూమి తన చుట్టూ తాను ఒక్కసారి తిరుగుతుంది. ఈ పరిభ్రమణంలో రాత్రింబవళ్ళు ఏర్పడుతున్నాయంటారు శాస్త్రజ్ఞులు. లోకమంతా ఈ భ్రమణంకు లోనవుతూంటే, గురప్పతాత కూడ లయ తప్పకుండా తాళం వేస్తున్నాడు.

గోవిందరాజస్వామి తేరు మరుగులో పగలు, దేవస్థానం ఆఫీసు ఎదురుగా ఉన్న 'మహంత్ మఠం' అరుగుమీద రాత్రి గడిచిపోతున్నాయి ఆనాడు భూభ్రమణం సగానికి సమీపించిందేమో? చీకటి తెరలు లోకం మీద విరుచుకపడడానికి చిందులు త్రొక్కుతున్నాయి గురప్పతాత అంగడి మూటగట్టాడు పంజరం చంకన బెట్టి తుండుగుడ్డ విదిలించి భుజాన వేసుకొని "లేరా! రాముడూ పోదాం!" అన్నాడు. ఆ మాట చెవిని పడడంతో 'పెద్ద బాలశిక్ష' ముందర వేసుకొని కునికిపాట్లు పడుతూండిన రాముడు ఒక్క పరుగులో వచ్చి తాత చేయి పట్టుకొన్నాడు తాత బయలుదేరాడు ..

కన్నులు ఎర్ర కలువలు, చూపులు వాడి తూపులు. మెలిదిరిగిన కండలు నునుపు దేరిన కండలు. కోర మీసాలు, వాడి కోడికత్తులు ఉల్లిపొరను మరపించే మల్లు జుబ్బా; వీటన్నిటిని కొట్టి వచ్చినట్లు కనుపించే రక్తసిక్తమై నట్లున్న లుంగీకట్టు. ఏమిటీ వేషం? ఎవ్వరీ తాత జీవిత రంగస్థలంపై ఎదురుగా నిలబడిన ప్రతినాయకుడు?.... ఎవ్వరో మేత్కై గూడు విడిచిన గువ్వలకోసం ఉరులొడ్డిన బోయ!

గురప్పతాత మానసాకాశంలో మబ్బెక్కింది. కొన్ని క్షణాలకు పూర్వమే అతనిలో కలిగిన సంతోషము, సంతృప్తి ఆ మబ్బుల మాటున మాయమైపోయాయి అతడు మెల్లగా పంచ కొనకొంగులో కట్టుకొన్న మూట ముడి విప్పాడు. ఫలితంగా ప్రతినాయకుని చేతిలో పై మబ్బు చినుకుల్లా, పలపలా పది పది నయాపైసాల కాసులు రాలాయి అవి కాసులు గావు ఆ ముసలివాని కన్నీటిరాసులు ఒక్కసారి చేతిలోని డబ్బును, మరొక్కసారి తాత మొగాన్ని నిర్లక్ష్యంగా చూశాడు ప్రతి నాయకుడు.

"ఊఁ! మిగత!" బాబు సొత్తును అడిగే దబాయింపు, యిచ్చిపెట్టిన సొత్తును పుచ్చుకొనే ధీమా కనబడుతూంది ఆ రెండు పలుకుల్లో అవి ములుకుల్లా ముసలివాని గుండెను గ్రుచ్చాయి. ఆ బాధలో అసలే ముడుతలు బడ్డ అతని మొగం మరింత ముడుచుకుపోయింది. కొంగులో రూకలవైపు, కొట్టవచ్చినట్లు మాట్లాడే ప్రతినాయకుని వైపు దీనంగా చూశాడు తాత! కష్టార్జితాన్ని వదలుకోలేని చూపులు. ఓస్వాన్ని సహించలేని తీక్షణ వీక్షణాలు ఒక్కక్షణం పోరాడుతున్నాయి ఆ పోరాటంలో 'తే!' అన్న సింహగర్జనంలాంటి 'బాంబు' పడింది. తాత అదిరిపడ్డాడు మరలా ఓ అయిదు పదినయా పైసాల కాసులు ప్రతినాయకుడి చేతిలో రాలాయి.

కుడివైపు కోరమీసాన్ని ఎడమచేతి మునివ్రేళ్ళు మెలివేస్తూంటే, అరచేతిలోని కాసులను తూకం వేసినట్లు అలా ఎగురవేసి, ఒక్క ఓరగంటి చూపును విసరి పారవేసి, గొంతులో నుండి పుట్టిన నవ్వు వంత పాడగా విసవిస వెళ్ళిపోయాడు ప్రతినాయకుడు! ఏమిటో వాడి వైఖరి?..... వాని కంటే యముడే నయం. ప్రతిదినము యిలా వేధించుక తినకుండా ఒక్కసారిగ ప్రాణాలు తీసుకవెళతాడ .

సగం డబ్బు పోయేసరికి సగం బలంకూడా గుంజుకపోయినట్లయింది. "ఏమిటీ అన్యాయం?..... ఎందుకీ ఎడతెగని బంధం?' అని ఆలోచిస్తూ ఒక్కక్షణం నిలబడ్డాడు గురప్పతాత. భూభ్రమణం ఆగలేదు. చీకటి విచ్చుకత్తులు విసరడం మానలేదు. అవి

అటూ, ఇటూ అన్న విచక్షణ లేకుండా ప్రసరించి తాత హృదయములో గూడ చోటు సంపాదించుకొన్నవి అతని హృదయ సంక్షోభం ప్రగాఢతరమయింది. 'నువ్వుండవయ్యా! కాసేపు నిద్రపోవాలి. రేపు ప్రొద్దున్నే వింటాలే నీ గోల!' అని ఏడుకొండలమీది వెంకటరమణుడు తాత చంకన మూటలో చల్లగా నిదురపోతున్నాడు 'నోరులేనిదానిని. నేనేం చేయగలను?' అని చిలుక పలుకకుండా కూర్చుంది రాముడు మాత్రం 'పోదాం! పద తాతా!!" అని చేయిబట్టి లాగాడు తాత ఆలోచనా స్రవంతికి అడ్డు తగిలింది.

ఆ 'మానవుడు' వెళ్ళిన వైపు నుండి తన దృష్టిని పంజరంవైపు మరల్చాడు. పంజరములో చిలుక నిశ్చలంగా కూర్చొని ఉంది. అది నోరులేని గువ్వ!..

దాదాపు పన్నెండు సంవత్సరాల క్రిందట 'తిరుమలకొండ' అడవిలో తానూ, తన భార్య, పదమూడేండ్ల కూతురు ఒక చిగరచెట్టు క్రింద కూర్చుని అన్నం తింటున్నారు. ఆ చిగర చెట్టు కల్లంత దూరంలో ఓ నేరేడు చెట్టు. ఆ చెట్టునిండా కలకలా మాగి నీలాలుపారే నేరేడుపండ్లు. ఆ పండ్లు తింటూ వుంది చిలుక! ఎక్కడ పొంచి ఉండిందో ఓ డేగ 'రివ్వు'మని దూరి చిలుకను తన్నుకుపో ప్రయత్నించింది. ఆ దెబ్బకు ఆ చెట్టులోని రెండు, మూడు పండ్లు, ఓ నాలుగైదు ఆకులు ఆహుతి అయ్యాయి. చిలుక గడగడలాడుతూ తన సమీపములో పడింది. దానిని తీసుకొని ఆప్యాయంగా నిమురుతూ ఒళ్ళంతా కళ్ళుజేసి చూశాడు. ఎక్కడో కాస్త గోరు గీసుకుపోయింది. ఆ గాయానికి గచ్చాకు పుచ్చాకు పూసి నయం చేశాడు. ఆ చిన్న సహాయాన్ని మరువలేని చిలుక జీవితాన్నే అంకితం చేసింది కట్టుకున్న భార్య, కన్న కూతురు తన్ను ఏకాకిని చేసి వెళ్లిపోయారు తెచ్చుకున్న అల్లుడు చిత్రహింస పెడుతున్నాడు కానీ నోరులేని పక్షి మాత్రం....

తాత చిన్నప్పుడేదో సర్కసు చూశాడు. అక్కడ పులి, మేక కలిసి తిరిగాయి. కలలో కనుపించితే ప్రాణాలు వదిలే ఏనుగు సింహంతో కలిసి ఆడుకొనింది. అవి కాసుకు పడని జంతువులయినా, కలిసి ఉండడానికి అలవాటుపడ్డాయేమో ఈ సర్కసువాళ్ళ భయంతో!– అని ఆనాడు నిర్ణయించి తన్ను తాను సమాధానపరచుకొన్నాడు. తన నిర్ణయం తనకే ఎబ్బెట్టుగా తోచిందీనాడు!

'అన్ని తెలువులు గల మనుష్యులకంటే, నోరులేని జంతువులు మేలేమో!" అన్నది గురప్పతాత జీవితానుభవాల తోరణాల మధ్య కట్టిన ఓ సుందర మందార పుష్పంలాంటి చక్కటి ఆలోచన!

"పద తాతా! పోదాం!" – మళ్ళీ రాముడు ముందుకు లాగాడు. విద్యుత్కాంతులు చీకటికి చిచ్చుపెట్టాయి. నాలుగు చక్రాల సైకిలు రిక్షా మీది కృష్ణయ్య అంగడి కూడ ఇంటి ముఖం పట్టింది. తాత కాలు భారంగా పైకి లేచి అంతకంటె భారంగా ముందుకు పడింది. జీవితములో విసిగి వేసారిన ఓ ముసలిరూపం ముందుకు కదిలింది. ఆలోచనలు వెనక్కు తిరిగాయి –

చిత్తూరు జిల్లాలోని ఓ మారుమూలపల్లె గురప్పతాత జన్మస్థానం. దానిని 'పారకపల్లె' అంటారు. ఆ పల్లె చుట్టూ పెట్టని కోటల్లా ఉన్న బోడిగుట్టల్లో పారకపుల్లలు విరివిరిగా

లభిస్తాయి కాబట్టి ఆ పేరు సార్థకమయిందేమో? పేరు చెప్పితేనే బండల గుండెలు పగిలి భూమి గడగడలాడే వంశము తాతది. దిగుడు బావులు త్రవ్వడం, చెరువుకట్టలు వేయడం, మిట్టా గట్టా చదునుచేసి భూమిని సాగు యోగ్యంగా చేయడం – అతనికి వంశానుగతంగా వస్తున్న పనులు. ఆ పనులలో రైతుకు కుడిభుజంగా నిలబడి ఆ పల్లెలో హాయిగా బ్రతుకుతూన్న ఓ చిన్న కుటుంబము తాతది.

పదిహేను సంవత్సరాల క్రిందట తిరుపతిలో పెద్ద అలజడి కలిగింది. పెద్ద పెద్ద ఇంజనీర్లు తల బ్రద్దలు కొట్టుకున్నారు. 'ఇది కాని పనిలే!' అని సామాన్యజనం నోరు చప్పరించారు ఇంతకూ ఏమిటా అలజడి అంటే – 'తిరుమల కొండకు రోడ్డు యాస్తారంట!" మానసికంగా భగవంతుని చేరుకోలేని మానవుడు దైవదర్శనార్థం శరీరాన్ని కష్టపెట్టి ఏడుకొండలు దాటడమెందుకని చేస్తున్న ప్రయత్నాన్ని తలకొక్క తీరుగా విమర్శించారు. అయినా, తాటాకుల చప్పుళ్ళకు కుందేళ్ళు బెదరలేదు. 'కూలీలు కావాలి' అన్న పిలుపు దేశం నలుమూలలా ప్రాకింది. గురప్ప చెవిని కూడ పడింది. గురప్ప ఆలోచించాడు 'నిద్దర మొగంతో లేచి పొద్దు గూట్లో పడేదాక రెక్కలు యిరుచుకుంటే, పొట్టు గింజలైతే ఓ కుంచడు, గట్టి గింజలయితే ఓ అర్ధకుంచడు యిస్తారు. దానికి గూడ రైతు యింటి ముందర చేతులు కట్టుక నిలబడాలి రోడ్డు పనిచేస్తే దినానికి రూపాయిపావలా కూలి దొరుకుతుంది. హాయిగా బ్రతుకచ్చు' అని అనుకొన్నాడు తన భార్యతో ప్రస్తావించాడు.

"ఎందుకే అంత దూరం పొయ్యేది. తూరుపుగా దిగబడిపోతే బతుకు తూర్పారపట్టినట్లయిపోతుందంట! ఇక బతికినన్నాళ్ళు బతకబొయ్యేదేముంది? పుట్టి పెరిగిన ఊళ్ళో రాలిపోయే దాంతో సమానం లేదు లేయే!" అని ఎదురు తిరిగింది.

గురప్ప భార్య మాటను పెడచెవిని పెట్టాడు. 'కూలి బతుక్కు ఏ వూరయితే ఏముంద?' అని పెండ్లాన్ని పదేండ్ల కూతుర్ని వెంట దీసుకొని బాగా బ్రతకడానికి తిరుమల కొండకు బయలుదేరాడు.

గురప్ప భార్యతో సహా సరాసరి పనిలో చేరిపోయాడు అడవి ఈత ఆకుతో ఓ చిన్న గుడిసె వేసుకొన్నాడు. బొమ్మరింటి కాపురాన్ని ఆరంభించాడు. క్రొత్తలో ఏదీ మరీ క్రొత్తగా కనుపిస్తుంది. ఆ క్రొత్తదనంలో కష్టాలు కూడా క్రొత్త క్రొత్త స్వరూపాలనే మలుచుకొంటాయి. ఆ స్వరూపాలను "ఏదో"గా భావించి మానవుడు సౌహార్ద్రంగా స్వాగతం చెపుతాడు. అందువల్ల గురప్పకు బ్రతుకు కాలప్రవాహంలో ఒడిదుడుకులు లేకుండా సాఫీగా సాగిపోతున్నట్లనిపించింది.

ఒకనాడు మధ్యాహ్నం గంట 'గణగణ' మోగింది. కూలీలంతా పారలు, గడ్డపలుగులు ఎక్కడివక్కడ పారవేసి భోజనానికి బయలుదేరారు. తాము సాధారణంగా కూర్చునే చెట్లక్రింద కూర్చున్నాడు: అదో! అల్లంత దూరాన కూతురు రంగవల్లి నెత్తిమీద బుట్టలో సంకటితెస్తూ ఉంది. ఈలోపల గురప్ప పెళ్ళాంతో మాటల్లోబడ్డాడు.

"పిల్లదానికి ఒళ్ళు బలిసిపోతుందే! నాలుగు రూకలు మిగుల్చుకొని తొందర్లో ఎవడిచేతిలోనైనా పెట్టేయాల్సిందే!"

"నువ్వూ నేనూ అనుకుంటే..... దేవుడు కన్ను తెరవాలిగానీ!"

"నువ్వెన్నయినా చెప్పే! .. ఆడదానికి అసలు దూరం ఆలోచించే బుద్దే లేదు"

"ఆఁ! అలాగా!!!' అన్న ఓ చిరుకోపపు తరగను కన్నుల ద్వారా బయటకు నెట్టి వూరుకుంది గురప్ప భార్య. ఆ చిరుతరగ గురప్పను ముంచి వేయలేదు. కానీ కనీసం స్పృజింపలేదు.

"లేకపోతే యీ బతుకెంత బాగుందో సూడు. సందేళకు రెండున్నర రూపాయి సేతిలో ఘల్లున రాలతా ఉంది మన పల్లెలో మాదిర గాడిద కష్టం గూడ లేదు. సద్దేళకు లోపున పనిలో వంగాల్సిన పనేలేదు పొద్దు నడిమిట్టకొచ్చిందంటే గెంట కొట్టేస్తారు. తిండి తిని అట్ట పడిలేయడానికి సందుగూడ దొరుకుతుంది. పొద్దు గూట్లో మునగక మునుపే పని చాలించేస్తారు ఏదో నాలుగు రూకలు కూడబెట్టుకుంటే నాకేవే!.... నా రంగమ్మతల్లికి పూలరంగణ్ణి తేనూ!"

గురప్ప ప్రస్తుత జీవిత ప్రశంస, భవిష్యత్ జీవిత అశంస వినిన అతని భార్య ఏదో బదులు చెప్పబోయేసరికి కూతురు రంగవల్లి సంకటి తట్టను తెచ్చింది. మాటల కడ్డు తగిలింది. ఆకలిగొన్న ప్రేవులు కూతురు వడ్డిస్తే 'ఆవురావురు' మంటూ తింటున్నాయి.

అంతలో 'అమ్మా!' అన్న ఆర్తనాదాన్ని 'దబ్' మన్న శబ్దం అనుసరించింది. ఆ శబ్దం గురప్పను కలవరపెట్టింది. నాలుగువైపులా దృష్టి సారించాడు. తిరుమల కొండకు పోయే కాలిబాట మీద ఒక యువకుడు పడిపోయాడు. చేతిలో అన్నం చేతిలో ఉండగానే గురప్ప పరుగు తీశాడు. చేతిలో సంకటి కూతురు చేతిలో పెట్టి గురప్ప ఆ యువకుణ్ణి పసిపిల్లవాడిలా ఎత్తుకున్నాడు. చిగరచెట్టు క్రిందికి అవలీలగ మోసుకొని పోయాడు. పై గుడ్డ క్రింద పరచి పరుండబెట్టి ముంతలోని మంచినీళ్ళు గుక్కెడు త్రాగిపించి కాసిన్ని మొగం మీద చిలకరించాడు. ఆ క్షుధాగ్రస్తుని గర్భకుహరంలో నుండి ఓ సన్నని మూలుగూ, చైతన్యరహితంగా పడిన శరీరములో కాస్త చలనమూ కలిగాయి. గురప్ప సంతోషంతో పొంగిపోయాడు.

అంతలో గంట కొట్టడం, గురప్ప దంపతులు అతనిని కూతురు చేతుల కప్పగించి పనిలోకి వెళ్ళడం జరిగింది. ఆ అప్పగింత శాశ్వతంగా నిలిచి పోతుందని వాళ్ళకి మాత్రం ఏం తెలుసు?-

ఆ నూతనాగంతకుడి పేరు రంగడు. స్వగ్రామం 'పొరకపల్లె' ప్రక్కన 'పోడుజేను'. అతడే ప్రపంచములో ఎప్పుడు, ఏ విధంగా అడుగుపెట్టాడో, అతనికే తెలియదు. చిన్నప్పటి నుండి సోమరిగానే పెరిగాడు. వయసుతోపాటు సోమరితనం కూడ సోగలు పెంచుకొనింది అంతో యింతో వేళకు నాలుగు మెతుకులు విదిలిస్తూ ఉండిన లోకం 'తాటి చెట్టంత ఉండావే!.... పోయి పనిచేసుకోరాదూ!' అని దెప్పి పొడిచింది. దాంతో నిరాహారదీక్ష సాగించి కష్టాలను దేవునితో మొరబెట్టుకొందామని తిరుమల కొండకు బయలుదేరాడు.

రంగడు గురప్ప ఆదరణలో కోలుకొన్నాడు. పెట్టినది తిని, చెప్పిన పని చేస్తూ

మంచి పేరు సంపాదించుకున్నాడు దాంతో రంగడు రంగవల్లి పేరు బలాలు కుదిరి ఒకనాడు ఏడుకొండలవాని సాన్నిధ్యములో రంగవల్లి మెడలో ఆ మూడుముళ్ళు వేసి ఆ యింటికి అల్లుడై కూర్చున్నాడు.

ఇప్పుడు నాలుగు చేతులకు బదులు ఎనిమిది చేతులు సమష్టిగా కష్టపడుతున్నాయి. రాతి కిరాయి చేరినట్లు నాలుగు డబ్బులు కూడుతున్నాయి. సాధారణంగా మనిషి ఉత్త చేతులతో మూరవేయలేడు. ఏదో కాస్త మిగులుబాటు అయిందంటే దాని అభివృద్ధి విధానాన్ని గురించి తీవ్రంగా ఆలోచిస్తాడు అలాంటి ఆలోచన పట్టుకుంది గురప్పను. తన అందాల రామ చిలుకకు అద్దాల పంజరమే కాకుండా, తన ముద్దు లకూతురికి ఓ అద్దాల మేడ కొనవలెనని కలలు గంటూ కూర్చున్నాడు అతని కలలకు దోహదం చేస్తూ అప్పుడు ఒక సంఘటన జరిగింది

ఆ ప్రాంతాలలోనే 'అక్కగారి' ఆలయమంటూ ఒక ఆలయాన్ని నిర్మించారు ఆ ఆలయం రోడ్డుతోబాటు సుమారు నూరు అడుగులు క్రిందికి దిగవలసి వచ్చింది. ఆ ఆలయాన్నయితే అంతకంటె అందంగా కట్టినారు కానీ, ఆలయంలోని 'అక్కగారి'ని మాత్రం తరలించడం పెద్ద సమస్య అయి కూర్చుంది. విగ్రహాన్ని తాకి బయటకు తెస్తే నెత్తురకు కక్కి చస్తారని ఓ వదంతి పుట్టింది అందువల్ల 'బ్రతికి ఉంటే బలుసాకు తిని బ్రతకవచ్చు' అని అందరూ తప్పుకున్నారు కానీ గురప్ప మాత్రం గుండెధైర్యం చేసి ఒప్పుకున్నాడు దేవుడి మీద భారం మోపి శిలా విగ్రహాన్ని పెకలించి తెచ్చి నూతనాలయంలో ప్రతిష్ఠాపించాడు అందరూ ముక్కుమీద వేలేసుకున్నారు అధికారులు 'సెభాస్' అని వీపు తట్టి రెండువేల రూపాయలు పారితోషకమిచ్చారు. అంతవరకు బాగానే జరిగింది కానీ, ఆ రాత్రి అతని భార్య కలవరించి, పలవరించి రెడు దోసిళ్ళ రక్తం కక్కింది. కూలీల పూరి గుడిసెలన్నీ 'గుప్' మన్నాయి. ఆ సంఘటనకు తలకొక విధంగా రూపురేఖలు దిద్ది, కడకు దేవుని సొత్తు 'ఉక్కళంగా' తీసుకొన్నాడు కాబట్టి ఈ దుష్ఫలితమని తేల్చివేశారు. ఆ నిర్ణయాన్ని విని గురప్ప కంపించిపోయాడు రాత్రికి రాత్రే బయలుదేరి దేవుని ముందు సాగిలబడి, తప్పు క్షమించమని లెంపలు వేసుకొని రెండువేల రూపాయలు హుండీలో కుమ్మరించి భార్యను బ్రతికించమని బ్రతిమలాడాడు

గురప్ప భార్య చేయిజారిపోయింది! ...

భార్య పోవడంతో గురప్ప బాగా దిగులుపడిపోయాడు. గుడిసెదాటి అడుగు బయటపెట్టడు. కూతురు పూర్ణ గర్భవతి. ఈలోపల అల్లుడు రంగడు కూడ పూర్తిగా మారిపోయాడు. ఒక్కదినం పనికిపోతే మరొక్కదినం పోడు. సాధారణంగా కూలిజీవుల ఆసరాతో మోసులు వేలార్చే త్రాగుడు, జూదంలాంటి వ్యసనాలు రంగణ్ణి తమ పాలనలోనికి తెచ్చుకొన్నాయి ఒక్కొక్క దినం ఇంటికే రాడు పాపం! రంగవల్లి అతని కోసం ఏడుస్తూ, ఎదురుచూస్తూ రాత్రుళ్ళు కాస్తుంటే ఆ ముసలివాని కడుపు తరుక్కుపోయేది. అతడు మాత్రం ఏం చేస్తాడు?..... నాలుగు ఓదార్పు మాటలు కూడ కరువై పోయాయి. అతని బ్రతుకులో! 'సలసల' కాగే నూనెలో నుండి 'ధగధగ' మండే మంటల్లో పడినట్లయింది.

అప్పుడే రంగవల్లి ఒక మగబిడ్డను ప్రసవించింది. ప్రసవమైతే సుఖంగానే జరిగింది కాని, ఎక్కడినుండి వచ్చిందో మాయదారి జ్వరం ముంచుకొచ్చింది. పత్యంబెట్టే దిక్కులేక, మందు మాకూ యిప్పించే ఓర్పులేక, గురప్ప ఆ కూతుర్ని కూడ ధారపోసుకొన్నాడు. ఇక మిగిలిందల్లా పురిట్లో కూన, పంజరంలో చిలుక ప్రాణాలు తోడుక తినడానికి అల్లుడు రంగడు.

ఇక్కింటి ప్రక్కింటి అమ్మలక్కల సహాయంతో చాలని కొదువకు ఆవుపాలు పోసి నానా అవస్థలు పడ్డాడు. ఆ పసిగందుతో పదేండ్లుగ వానిని ఒక మనిషిగా తయారు చేయవలెనని అతని ఉబలాట. ఆ విధంగా చేస్తానని కూతురుకి మాట గూడ యిచ్చాడు. శరీరంలో శక్తి నశించినా, కష్టపడే ఓపిక లేకపోయినా, ఏనాడో వీధిబడిలో చదువుకొన్న చదువుతో, ఎలక సహాయంతో తన మాట నిలబెట్టుకోడానికి బ్రతుకుబాటలో తన తంటాలు తాను పడుతున్నాడు కానీ రంగడు చుట్టమై వచ్చి దెయ్యమై పట్టుకున్నాడు. 'నా బిడ్డను నాకిచ్చెయ్!' అంటూ ప్రతిదినం దెబ్బలాటకు వస్తాడు వాడి చేతిలో బిడ్డ ఏమై పోతాడు అన్న బాధ! అందుకే కష్టార్జితాన్ని సగం ఆ తాగుబోతు వెధవ చేతుల్లో పోసి ఏ దినానికాదినం పీడ వదలించుకొంటున్నాడు. అయితే మాత్రం . ఎంతకాల మీ ముసుగులో గుద్దులాట? ఎలా సహించడం ఈ కృతఘ్నుని వేట?

నిర్మలంగా ఉన్న సంధ్యాకాశం ఎప్పుడు మబ్బెక్కిందో పలపల చినుకులు రాల నారంభించాయి గురప్పతాత భావి ఆలోచనలు కరిగి, భవిష్యత్తుపై మళ్ళి, తడిసిపోతామన్న భయంతో 'గబగబ' నడచి మరం తిన్నె చేరుకున్నాడు దేవస్థానం ఆపీసు ఎదురుగా కూర్చుని అన్నం అమ్ముకునే పూటకూళ్ళమ్మ వానకు జడిసి ఆవేళ మరం తిన్నెమీదనే మకాం వేసింది మామూలు మేరకు గురప్ప తాత, రాముడు చెరికాస్త ఎంగిలి పడ్డారు. వాన జోరు హెచ్చింది వానకంటె గాలి ఉధృతంగా వీస్తూంది. తిన్నెమీద జల్లు కొడుతుంటే గురప్పతాత రాముణ్ణి ప్రక్కలో పరుండబెట్టుకుని బాగా దుప్పటి కప్పాడు.

దేవస్థానం ఆఫీసులో బిళ్ళజవాను ఎంచి తొమ్మిది గంటలు కొట్టాడు. పూటకూళ్ళమ్మ గంప నెత్తిన బోర్లించుకుని వెళ్ళిపోయింది గురప్పలాంటి జీవులు కొంతమంది ఆ తిన్నెమీద గుర్రుపెట్టి నిద్రపోతున్నారు. భావి బ్రతుకును గురించి భయంలేని రాముడు ఒళ్ళు తెలియకుండా నిద్రపోతున్నాడు. 'బావాజీ' చేతిలోని చిలుం గొట్టం మిణుగురు పురువులా వెలుగుతూంది. గోవిందరాజస్వామి దేవాలయ గోపురము విద్యుత్కాంతిలో ధవళశిఖరములా వెలుగుతూ ఆణిముత్యాల్లా పడే వాన చినుకులతో అభిషేకం చేసుకుంటోంది. ఎక్కడో ఓ కుక్క భీకరంగా మొరుగుతూంది. గురప్ప తాత బుర్ర ఆలోచనలతో మరుగుతూంది ఎప్పుడో లోకాన్ని మరచిపోయింది.

"పిల్లోడికి పదేళ్ళుకు పైబడింది నువ్వు పండు ముసలివయ్యావు. ఎప్పుడు తొడిమరాలిపోతుందో తెలియదు. ఆ మీదట వాడి గతేం కావాలి? కిష్టయ్య దగ్గర 'పెదబాలశిచ్చ' సదివిస్తే సరిపోతుందా?"

ఓ కరుడుగట్టిన దీనాకృతి తన్ను తట్టిలేపి, గ్రుచ్చి గ్రుచ్చి అడుగుతూంది. ఏదో

సమాధానం చెప్పుదామనుకుంటే గొంతు పెగల్లేదు. నీటిబయట చేపలాగ హృదయం తహతహ పడుతూంది. అంతలో ఆ కరుడు గట్టిన దీనాకృతి కరిగిపోతున్నట్లనిపించింది 'అమ్మా!' అని అరుస్తూ ఎగిరిపడి లేచాడు వాన వెలిసిన తరువాత ప్రశాంత వాతావరణం, నిర్మలాకాశం మినహా మరేమీ లేదు. కల చెదిరిపోయింది. తూరుపున పట మొగిరింది. అస్తవ్యస్తంగా పడి నిద్రపోతున్న రాముడు ఇంకా నిద్ర లేవలేదు. వారం రోజుల క్రిందట తొడిగిన చొక్కా, నిక్కరు తోళ్ళయినాయి. తల 'బుట్టిబుట్టి'గా పెరిగి బాగా మాసింది గద్ద గూడులా తయారయింది నిగ్గులుదేరే నిమ్మపండులాంటి రంగు నల్లని అల్లి నేరేడుపండు కాబోతూంది. మొగమంతా దోమలు కరచి చిడుములు చిడుములుగా కందిపోయి ఉంది గురప్పతాత హృదయములో పుట్టిన కన్నీళ్ళు మరలా హృదయం మీదనే పడి ఇంకిపోయాయి

ఆ దినమంతా గురప్పకు మనసులో మనసు లేదు. ఎంత ఆలోచించినా భావి జీవితమార్గం సుగమంగా కనుపించలేదు. పనికిరాని ఆలోచనలు, ముడిపడని కోరికలు.. మనస్సు వూసరవెల్లిలా ముందుకు సాగలేదు కాలం అతనికోసం ఆగలేదు. ఆవేళ 'బేరం' కూడ అంతకంతకుగానే ఉంది

గంట అయిదయింది మిడిసిపడుతూండిన సూర్యుడు మబ్బుల మాటున మినకరిస్తున్నాడు. కాస్త చల్లబడింది. వర్షం వెలిసిన తరువాత ఈ సుళ్ళు మాదిరి జనం గుంపులు గుంపులుగ వీధిన బడ్డారు. రకరకాల బోడిగుండ్లు కొండదిగి దిగువ తిరుపతిలో తిరిగి గోవిందరాజస్వామి తేరు దగ్గర రెప్పపాటు నిలిచి మోర పైకెత్తి పారజూచి 'బలే పెద్దదే!' అని పొగడి చేతులు జోడించి ముందుకు పోతున్నారు ఏదో పెట్టి మరచినట్లు, కారులు, లారీలు రొదచేసుకుంటూ శరవేగంతో దూసుకుపోతున్నాయి. 'కాసింత నిదానంగా పోతే, ఊళ్ళుబ్బగంటుపోతుందేమో!' అని చీదరించుకొంటూ జనం చీలిపోతున్నారు. తేరుదగ్గర పాల అంగడి వద్ద గొల్లగోవిందు పాలు పిదుకుతూ ఆవును అదలించిన దెబ్బకు అందరూ హడలిపోయారు. జెర్రిపోతంత జడ కటిస్థలిపై నటిస్తూంటే, ఇంతింత కళ్ళతో, హారతి పళ్ళెంతో మందగమనంతో అందగత్తెలు గోవిందరాజస్వామిని సేవించడానికి వెళుతున్నారు. ఎదురుగా వస్తున్న పద్మావతీ కళాశాల బస్సును 'ఢీ' కొంటుందనిపించి, 'దైవవశాత్తు తప్పిపోయిందిలే' అనుకొంటూంటే పోలీస్ వ్యాన్ చెవులు చిల్లులు పడేలా హారన్ మ్రోగిస్తూ స్టేషన్‌వైపు పారిపోయింది. చావుదప్పి, కనులు లొట్టబోయినట్లయిన పద్మావతీ కళాశాల బస్సు గురప్పతాతను తొక్కుదామని పైకిబోయి 'పోనీలే!' అని దయతలచి వదలి ముందు కురికింది. రాముడు బిత్తరపడి 'కెవ్వు'మని అరిచాడు. చిన్న గుంటల్లో వానకు నిలిచిన బురదనీరు ఎగిరి గురప్పతాతను పలకరించింది. అది జూచి బస్సులోని పడుచుదనం పరిహాసమాడింది. అందరి ముఖాల్లో దరహాసరేఖ గీచింది!

పారిపోయిన పోలీసు వ్యాన్ని ఒక గుంపు తరుముకొని పోయారు. పోలీస్‌స్టేషను చుట్టూ గుమిగూడారు. అందరి ముఖాల్లో బాధ వ్యక్తమవుతూంది. ఎగ్గొట్టుక వచ్చే ఏడుపును నోట్లో గుడ్డ దురికి, వూపిరి బిగబట్టి ఆపుకొంటూ ఆశ ముందుకు లాగుతూంటే నిరాశ వెనక్కు ఈడుస్తూంటే మధ్య ఉక్కిరిబిక్కిరవుతూ ఒక ఆలూ మొగుడూ స్టేషన్‌వైపు

నడుస్తున్నారు.      "ఏంది కిష్టయ్యా యిదంతా?"

ప్రక్కనేన్న నాలుగు చక్రాల సైకిలు రిక్షా మీద 'ఫాన్సీషాప్' యజమాని కృష్ణయ్య. అంగడిముందు నిలబడి దినపత్రికలోని అక్షరక్షరాన్ని పట్టిచూచి వీధి రాజకీయాలు మాట్లాడడంలో మొనగాడు. రాముడికి 'పెద్ద బాలశిక్ష' చెప్పిస్తూ ఉంటాడు. అంగడివద్ద బేరం లేనప్పుడు. అందువల్ల కృష్ణయ్య మీద గురప్పతాతకు కాస్త గురి! బజారులో హఠాత్పరిణామానికి కారణం అడిగాడు అందుకే కాబోలు!"

"అదో ఆడ బోతా ఉండారు. చూడు. ఒక ఆలు మొగుడూ! వాళ్ల కొడుకు పన్నెండేండ్ల పిల్లకాయ. ఒక కసుగందు గొంతు పిసికి దాని మెడలో సొత్తులు దొంగిలించినాడంట. అందుకోసరం వాణ్ణేదో యిస్కూలుకు పంపిస్తుండారు. ఈ పొద్దే వాణ్ణి తీసుకెళ్ళుతుండారు కాబట్టి ఇరుగూ పొరుగూ చుట్టపక్కాలూ చూడవచ్చినారు!"

కృష్ణయ్య మాటలు గురప్పకు వింతగా వినిపించాయి.

"ఏంది కిష్టయ్యా! నీ మాటలు బలే సోద్దెంగా ఉండాయె. నగలు దొంగిలిస్తే జైల్లో తోస్తారు కానీ యాడైనా ఇస్కూలుకు పంపిస్తారా?"

"మైనరు దీరలేదు గదయ్యా? అందుచేత జైలుకు పంపరు. జడ్జీ ఆర్డు ప్రకారం ఇస్కూలుకే పంపిస్తారు"

"అయితే ఆ ఇస్కూల్లో పిల్లోణ్ణి ఏం చేస్తారు కిష్టయ్యా?"

"ఏం చేస్తారు? చదువు సంధ్య చెప్పిస్తారు. 'ఇక మీదటయినా బాగా బతకరా పిల్లోడా!' అని పంపించేస్తారు"

"ఈ ఆర్డు ఎవురేస్తారు కిష్టయ్యా?"

"చెప్తిగదయ్యా జడ్జని!"

"జడ్జీ యాడుంటాడు కిష్టయ్యా!"

"కోర్టులో ఉంటాడు"

"కోర్టు యాడుంది కిష్టయ్యా?"

"నీ చిలక నడగవయ్యా చెప్పుంది!... పోనీ నీ కెందుకయ్యా ఈ సోదె అంతా?"

"తెలుసుకుంటే తప్పేముంది చెప్పు కిష్టయ్యా!"

"అదేనయ్యా! ఆ సింగిరిగుంట కింద ఉండాయి చూడు!.... బిళ్ళయిండ్లు!"

"ఆఁ! ఆఁ!!"

"అదే కోర్టంటే!"

అప్పుడప్పుడే వ్యాపిస్తున్న చీకటిలో ఓ కాంతిపుంజం తళుక్కున మెరిసింది. గురప్పతాత అంగడి మూటగట్టాడు. రాముడు తోడుగా గూటికి బయలుదేరాడు. ఆ రాత్రి మఠం తిన్నెమీద పడుకున్నాడేగాని అతనికి నిద్రపట్టలేదు. రాముడి భవిష్యత్తు, కృష్ణయ్య మాటలు నీటిలో చేపల్లా మెదడులో ఈదుతున్నాయి. "దొంగతనం.... జడ్జీ ఆర్డు..... ఇస్కూలు!" వరుసగా ఒకదాని వెంబడి ఒకటి చుట్టూ ప్రదక్షిణం చేస్తున్నాయి. అతని చూపులు ఒక్కసారి వూరిమీద విరుచుకుపడ్డాయి.

అదే రైల్వేస్టేషన్. అక్కడే ప్రయాణంతో అలిసిపోయి ఒళ్ళు తెలియకుండా పడ నిద్రపోయే యాత్రికులు!... అదుగో! వారి మెడల్లో కన్నులు మిరుమిట్లు గొలుపుతూ 'ధగధగ' మెరిసే బంగారు పగటు! ఆ ప్రక్కనే చూపు మేరలో పోలీస్ స్టేషన్!. గురప్పతాత ఆశగా అటువైపు చూశాడు. సంతృప్తిగా నిట్టూర్చి రాముణ్ణి లేపాడు

నడిరేయి. సినిమా వదలిన తరువాత 'హాలులా' ఉంది ఫ్లాటు. రాముడికి నిద్రమత్తు వదలలేదు. తూలుతూ నడుస్తూంటే, చేయిపట్టి లాక్కుని గురప్పతాత స్టేషన్వైపు చరచరా వెళ్ళిపోయాడు మంచిని వూహించిన మనస్సుకు ముందు వెనుక ఆలోచింపవలసిన ప్రమేయం లేకపోయింది!

మిట్టమధ్యాహ్నం, ఎండ తీసికాస్తూంది సింగిరికొంటలో మురికినీటి కంపు తెంపులు తెంపులుగా వస్తూ వుంది కోర్టు ఆవరణలో సుంకిరేసి చెట్ల నీడలో జనం మందలు మందలుగా కూర్చుని వున్నారు పొలాల దగ్గర కట్టిన దిష్టిబొమ్మల్లాగ ఒక్కొక్క గుంపు దగ్గర ఒక్కొక్క వకీలు శివతాండవమాడుతున్నాడు బోనులో చిట్టెలుకలా రాముడు కోర్టు బోనులో నిలబడి మినకరిస్తున్నాడు ఎవరికంట బడకుండా గురప్పతాత ఒకమూల వొదిగి కూర్చొని గుడ్లప్పగించి చూస్తున్నాడు. రాముణ్ణి శతవిధాల ప్రశ్నించిన 'పబ్లిక్ ప్రాసిక్యూటర్' ప్రత్యుత్తరం లేకపోయేసరికి విసిగిపోయారు.

"ఏసిన పుల్ల దాటలేదు కన్నోరు! ఎంత మంచోడు!!"

గురప్పతాత మనస్సులోని గుట్టు అనుకోకుండా బైటపడింది ఎవరైనా విన్నారేమోయని 'ఉలిక్కి'పడ్డాడు భయంభయంగా చుట్టూ చూసి ఎవ్వరూ లేకపోయేసరికి గుండె దిటవు చేసుకున్నాడు

'ఇంక అడగవలసిందేమీ లేదంటూ' పబ్లిక్ప్రాసిక్యూటర్ తన స్థానంలో కూర్చున్నాడు అందరి దృష్టి న్యాయాధికారివైపు మళ్ళింది కలంపుల్లి నొసటి కానించి కన్నులు మూసుకొని ఒక్కక్షణం ఆలోచించారు జడ్జి

"ముద్దాయి పసిపిల్లవాడు. ఈ దొంగతనం ఉద్దేశ్య పూర్వకంగా చేయబడినట్లు మాకు తోచడం లేదు ముద్దాయి తరపున బాధ్యత వహించు వారెవ్వరూలేనందున ముద్దాయి శ్రేయస్సు దృష్ట్యా 'బోస్టన్ స్కూలుకు' పంపిస్తున్నాము"

తీర్పు చెప్పి జడ్జి వెళ్ళిపోయాడు పొంచి వుండిన పోలీసులు 'రాముణ్ణి' లాక్కొచ్చి పోలీసువ్యాన్లో పడేశారు. గురప్పతాత కోరిక నెరవేరింది!.... కానీ, తన మనుమడు! తన చేతులమీదుగా పెరిగి, తన గుండెల మీద నిదురించిన బాలుడు! తన్ను శాశ్వతంగా వదలిపోతున్నాడు. గురప్ప కనుగ్రుడ్లు నిండుకొన్నాయి త్రుంచివేయలేని బాంధవ్యం కడసారిగా పలకరించమని ముందుకు లాగింది. గురప్ప రుగెత్తుకుంటూ వచ్చి రాముని కంటపడ్డాడు. రాముడు 'తాతా!' అని అరుస్తూ పైకి లేచాడు. పోలీస్వ్యాన్ ఒక్క కుదుపులో కదలింది. ఆ కదలికకు తట్టుకోలేని రాముడు అడ్డంగా వలలా అల్లిన కమ్ములమీద బోర్లాపడ్డాడు. తలకు మంచి దెబ్బ తగిలింది తాత కడుపు రగిలింది. కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి. చేతులు చాచి 'బాబూ!' అంటూ ముందుకురకబోయాడు పరిస్థితుల మాట

అటుంచి తన కాళ్ళే తన మాట వినలేదు. రాయి తగిలి బోర్లాపడ్డాడు. తాత తేరుకొని మెల్లగా పైకి లేచేసరికి పోలీస్‌వ్యాన్ లేపిన దుమ్ము అప్పుడప్పుడే అణగిపోతూంది. చంకన పంజరం బారెడు కవతల పడింది కదలలేక కదిలి పంజరం చేతికి తీసుకొన్నాడు. పంజరం ఖాళీ! . .

విసరకపోయి పడడంతో పంజరం తలుపు తెరుచుకుంది. చిలుక హైస్కూలు ఆవరణలోని మానిమల్లె చెట్టెక్కి కూనిరాగాలు తీస్తూంది. ఒకసారి పంజరంవైపు మరొకసారి చిలుకవైపు దీనంగా చూశాడు తాత. బోసిగా నవ్వుకొన్నాడు ఏమనుకొనిందో ఏమో చిలుక! రెపరెప రెక్కలల్లార్చుకొంటూ వచ్చి తాత ముంజేతి మీద వాలింది – ఒక్కక్షణం స్వేచ్ఛా జీవితానంతరం! తాత ఉప్పొంగిపోయాడు ఉప్పెనలా పొంగి వచ్చిన ఉత్సాహపు ముద్దులతో చిలుకను ముంచివేశాడు.

గువ్వ గూటిలోని కెళ్లింది!. ...

*మార్చి, 1962 – ఆంధ్ర సచిత్రవారపత్రిక*

# వేషం

## సింగమనేని నారాయణ

కాళ్ళీడ్చుకుంటూ ఇంటికి వస్తున్నాడు సూరి.

చిరుగులుపడ్డ పుస్తకాల సంచీ వాడి భుజం నుంచీ దీనంగా వేలాడుతూంది వాడి ముఖంలాగే – సంచీ చిరుగుల్లోంచి ఒకటి రెండు పుస్తకాలు తలలు నిక్కబెట్టి బయటికి నయంగా చూస్తున్నాయి. బొత్తాములు లేకపోవటం వల్ల బిగదీసి ముడివేసుకున్న వాడి నిక్కరు ఓవేపు కిందికి, ఓవేపు పైకి, అస్తవ్యస్తంగా కనిపిస్తూ వుంది. మాసిపోయిన వాడి పొట్టి ఫ్లాగు పుస్తకాల సంచీ రంగుతో కలిసిపోయి, దానితో నేస్తం కట్టినట్టుగా ఉంది

వాడి కళ్ళ కొసల్లోంచి కారికారి ఆరిపోయిన నీటిచారికలు పెదాలదాకా కలిసిపోయి, నాలుక తగిలినప్పుడు ఉప్పగా అనిపిస్తున్నాయి. నాల్గైదు అడుగులకొక్కసారైనా వాడు వెక్కివెక్కి ఏడుస్తున్నాడు. ఏడ్చి ఏడ్చి వాడి కళ్ళు ఉబ్బి ఎర్రటిజీరతో గాజు పెంకుల్లా ఉన్నాయి.

పది నిముషాలయింది వాడు స్కూలు నుంచీ బయలుదేరి. ఎదురైన ఒకరిద్దరు వాణ్ణి "ఏమిరా! అప్పుడే బడి నుంచీ వస్తావుండావు" అని పల్కరించారుకాని, వాడి నోటిలో ఏడుపేగాని మాటలేదుగా!

ఇల్లు దగ్గరపడగానే గబగబా అడుగులు వేసి, తలుపుచెక్క నూకి లోపలికెళ్ళి "అమ్మా...." అన్నాడు. చెంబులోంచీ నీళ్ళు ఒలకపోస్తున్న శబ్దంతో

కొడుకు కంఠంలో ధ్వనించిన ఏడుపు స్వరం విని ఇంట్లో ఏవో గింజలు చెరుగుతున్న రంగమ్మ తలెత్తి గాభరాగా వాడి ముఖంలోకి చూసింది.

వాడి కళ్ళనిండా నీళ్ళు, చెంపలమీద చారలు. ముఖమంతా ఉబ్బి ఉంది.

భుజానికేసుకున్న పుస్తకాల సంచీ తీసి గోడవారగా పెట్టి వాళ్ళమ్మ దగ్గరకొచ్చాడు ముంజేతుల్తో కళ్ళు తుడుచుకుంటూ.

"ఏమిరా! ఏమయ్యిందిరా? బడి నుండీ అప్పుడే వచ్చేసినావే...." అంది వాణ్ణి

దగ్గరకు తీసుకుంటూ తల్లి.

"డ్రిల్లు మాస్టరు కొట్టినాడమ్మా" అంటూ ఏడుపాపి తన అరచేతుల్లి తల్లి కళ్ళ ముందుంచాడు సూరి.

లేత అరచేతుల మీద ఎర్రగా ఉబ్బిన వాతలు కుడుములు కట్టినట్టుగా ఉన్నాయి వాటిని చూడగానే ప్రేమతో ఆమె మనసు చలించిపోయింది. పిల్లవాడి చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుని "అయ్యయో! ఇదేమిరా తండ్రీ! ఇంతింత వాతలు?" అంటూ అరచేతుల్ని మెత్తగా నిమిరింది. గూటిలో చిన్నసీసాలో వున్న కొబ్బరినూనె తీసి వాడి అరచేతుల్లో పోసి నెమ్మదిగా రుద్దింది. తల్లి ప్రేమ స్పర్శకు వాడు తన ఏడుపును మరింత సాగతీశాడు

"యాల కొట్టినాడురా . ఇంతకూ నువ్వేమి చేసినావురా." అందామె వాణ్ణి మరింత దగ్గరకు తీసుకుని కన్నీళ్ళు చీరచెంగుతో మృదువుగా తుడుస్తూ

"నేనేం చేయలేదమ్మా! స్కూల్‌డ్రస్ వేసుకొని రాలేదని నన్ను కొట్టినాడమ్మా - స్కూలు నుండి బయటకు పంపించాడమ్మా" అన్నాడు తల్లి చేతుల్లో వాలిపోతూ.

రంగమ్మ కోపంతో చలించి పోయింది కొడుకు చేతుల్ని తన గుండెలకు అదుము కుంటూ "ఈమాత్రానికే యిన్ని దెబ్బలా! వాడి చేతులు పడిపోనూ! వానికేం పొయ్యేకాలం వచ్చిందిరా వాడికేం పిల్లాపాపల్లేరా?" అంటూ దీర్ఘాలు తీసింది.

"నాకు స్కూల్‌డ్రస్సు కుట్టించమ్మా - నేనీ దెబ్బలు తినలేనమ్మా" అన్నాడు వాడు తల్లి మెడచుట్టూ చేతులు వేస్తూ.

వాడికి పదకొండేళ్లు - ఈ సంవత్సరమే హైస్కూల్లో ఆరో తరగతిలో చేర్చారు వాణ్ణి చేరి రెండు నెలలయిందేమో! చేరినప్పట్నించీ ఈ స్కూల్ డ్రస్‌తో గొడవగానే ఉంది 'స్కూల్‌డ్రస్' అంటే తెల్లచొక్కా, కాకీ నిక్కరూనూ. వాడికింతవరకూ ఉన్నవన్నీ మామూలు చొక్కాలూ, మామూలు నిక్కర్లే - ఐదో తరగతి వరకూ ఈ బట్టల గొడవేలేదు. హైస్కూల్లో చేరగానే యిదొచ్చిపడింది. మొదట కొన్నాళ్లు వట్టి మందలిం పులయ్యాయి. ఈనెలరోజులుగా దెబ్బలు కూడా! వాడు రోజూ వాళ్లమ్మకు చెబుతూనే వున్నాడు - ఈ రెండు నెలల్లోనే ఫీజులనీ, నోట్సులనీ, పుస్తకాలనీ, పెన్నులనీ, పెన్సిళ్లనీ తలకు మించిన బరువయింది రంగమ్మకు.

ఇలా ఖర్చులమీద ఖర్చులొస్తాయని అనుకోలేదు. ఇప్పుడు వాడికి మామూలు రంగుల బట్టలు నాలుగు జతలున్నాయి. మళ్లీ కొత్త చొక్కాలూ నిక్కర్లూ అంటే మాటలా? ఏదో కుట్టిద్దాంలే అనుకుంటున్నా చేతికి డబ్బు అందుబాటు కాకుండా ఉంది. ఆ తెల్లచొక్కాలు తొడిగిస్తే సాయంత్రానికే మాసిపోతాయి. రోజూ మార్చాలి. సబ్బుపెట్టి ఉతకాలి... సబ్బు ఖర్చొకటి... ఏ ఖర్చూ భరించే శక్తి లేదుగాబట్టి వాయిదా వేస్తూ వచ్చింది యింతవరకూ రంగమ్మ.

రంగమ్మ చేసేది, మొగుడు చేసేదీ, కూలీనాలీ పని ... ఉన్న పల్లెటూళ్లో రోజూ పనులు మాత్రం ఎక్కడుంటాయి? ముగ్గురు పిల్లలు రంగమ్మకు. వీడు మూడోవాడు.

వీడికి దారితప్పి నాలుగు ముక్కలు వచ్చాయి. ముచ్చటపడి హైస్కూల్లో చేర్పించారు.

"బళ్లో అంతమందీ ఆ బట్టలే ఏసుకొని వస్తారేమిరా" అడిగింది రంగమ్మ.

"శానామంది దెబ్బలు తింటావుండారమ్మా డ్రస్సు లేక రోజూ దెబ్బలే! నీకెన్నిసార్లు చెప్పినానమ్మా! నేనింక డ్రస్సులేకుండా బడికి పోనేపోను....." అన్నాడు వాడు.

"ఇదెక్కడి బడిరా తండ్రీ! ఏదో టౌన్లో అయితే డ్రస్సులూ గిస్సులూ అంటే అర్థముంది. పల్లె కొంపల్లో కూడా టౌన్లపద్ధతులు పెడితే ఎట్ల అని ఆలోచించల్లా వద్దా! చదువుకోకపోతే పిల్లల్ని కొట్టల్లగానీ, బట్టలకోసం కొడతారా ఎవరన్నా" అంటూ స్వగతంలా గోడంతా వెళ్లబోసుకుంది రంగమ్మ.

"ఆ డ్రిల్లు సార్ అంతేనమ్మా! చింతబర్రలతో యాటికిపడితే ఆటికి తంతాడమ్మా! ఈ పొద్దు శానామంది పిల్లోల్లు నాయాకట్లే దెబ్బలు తిని ఇండ్లకు వచ్చినారమ్మా! నాకీ పొద్దు కుట్టిస్తే సరి! లేకపోతే నేను బడి యిడిసిపెడతా" ఇదే తన అంతిమ నిర్ణయమన్నట్టు ప్రకటించాడు సూరి.

"ఇప్పుడు నా దగ్గిర దుడ్లు యాడుండాయిరా – ఈటకే నీ సదువుకు యాడసూసినా అప్పులే! మీ నాయనకు సెప్పితే మిందికొస్తాడు – నేనేడ దూకి సావల్ల .." అంది రంగమ్మ

"ఏమోనమ్మా – నాకు రెండు జతలన్నా కుట్టియ్యల్సిందే – స్కూలు డ్రస్సు లేకుండా నేను మాత్రం బడికిపోనేపోను" కరాకండిగా చెప్పాడు సూరి.

స్కూలు డ్రస్సు పేరు పదే పదే వినబడేకొద్దీ రంగమ్మకు చిర్రెత్తుకొస్తోంది. పూనినదానిలా ఊగిపోతూ "బట్టలు... బట్టలూ... కుట్టిస్తాలేరా! ఏం చదువో! ఏం పాడో! అంగలాసినట్టుంది" అంటూ లేచి కొప్పుముడి వేసుకొని గుడిసెలో నుంచీ బయటకు నడిచింది రంగమ్మ.

నాలుగు రోజుల తర్వాత ఉదయం తొమ్మిదీయాభై....

రెండో బెల్లు అయింది

స్కూలు ఆవరణలో ప్రేయర్‌కోసం తరగతులవారీగా పిల్లలు క్యూలో నిల్చున్నారు.

ఉపాధ్యాయులు, జండాకర్రకు ఎడమవైపున, హెడ్మాస్టర్ జండాకర్రపక్కన నిల్చొని వున్నారు.

డ్రిల్లు మాస్టరు చేతిలో బెత్తం తిప్పుతూ, స్కూల్ డ్రస్ వేసుకురాని పిల్లల్ని ఎప్పుడెప్పుడు కొడదామా అని ఉత్సాహంతో చిందులు వేస్తున్నాడు. డ్రస్ వేసుకురాని కుర్రాళ్లను క్యూలోంచి బయటకు లాగుతున్నాడు. వాళ్లందర్నీ నేరస్తుల శిబిరంలోలా ప్రత్యేకంగా ఒక వరుసలో దోషుల్ని చేసి నిలబెట్టాడు. నోటికొచ్చిన బండకూతలు కూస్తూ ఒక్కొక్కర్నే ఎంతో ఆనందంగా బెత్తంతో బాదుతున్నాడు.

హెడ్మాస్టర్ ఈ తతంగాన్ని కుతూహలంతో పర్యవేక్షిస్తూ, "మీకెన్నిసార్లు చెప్పాలిరా – డిసిప్లిన్ అంటే మీకు లెక్కేలేకుండా పోతూంది" అంటూ ఉపన్యాస ధోరణి లంకించుకున్నాడు. తక్కిన ఉపాధ్యాయులందరూ ఈ శిక్షా కార్యక్రమాన్ని వినోదంగా తిలకిస్తున్నారు. పిల్లలంతా భయంగా బెరుగ్గా చూస్తున్నారు.

ఇంతలో స్కూల్ గేటు దగ్గర ఒక ఆడమనిషి వస్తున్నట్టు కనిపిస్తే అందరి చూపులూ అటువేపు మళ్లాయి. రంగమ్మ ఒక చేత్తో తన కొడుకు చేయి పట్టుకొని విసవిసా లోపలకు వస్తోంది. ఆమె కొడుకు సూరి, తెల్లటి కొత్త చొక్కా కొత్త కాకీ నిక్కరుతో ముడుచుకు పోయినట్టుగా తల్లివెంట నడుస్తున్నాడు. వాడి ఎడమ భుజానికి పుస్తకాల సంచీ వేలాడుతోంది.

వాడి చేయి పట్టుకుని ఈడ్చుకొని వస్తున్నట్టుగా గబగబా నడుస్తూ పిల్లల 'క్యూ'లు దాటి, ప్రార్థనా స్థలం మధ్యభాగంలోకి విసురుగా వచ్చింది రంగమ్మ. ఆమె ఆ ప్రదేశానికి రావటం హెడ్మాస్టరూ, ఉపాధ్యాయులూ నివ్వెరపోయి చూస్తున్నారు. వాళ్లందరి ముందూ రంగమ్మ తన కొడుకును నిలబెట్టి "అయ్యా, వీడు నా కొడుకు. నాలుగు ముక్కలు చదువు చెప్పుతారని వీణ్ణి ఈ బడిలోకి చేర్పించినా" అంది అందరి ముఖాల్లోకి చూస్తూ స్పష్టంగానూ, గట్టిగానూ –

ఆమె ఎందుకిలా హఠాత్తుగా యిక్కడికి ఊడిపడిందో అర్థంకాక, అందరూ ఆమె వాలకం కేసి ఏం పాలుపోక చూస్తున్నారు. ప్రార్థనా స్థలంలోకి ఆమె ప్రవేశం వాళ్లకేమాత్రం నచ్చనట్టు వాళ్ల ముఖాలు చెబుతున్నాయి.

కొడుకు భుజానికి వేలాడుతున్న పుస్తకాల సంచీ లాగి నేలమీదవేసింది ఆమె. వాడి రెండు అరచేతుల్నీ తన చేతుల్లోకి తీసుకొని వాళ్లకు చూపెడుతూ, "చూడండయ్యా! కొట్టి నాలుగురోజులయినా వాతలింకా పోలేదు. పసిపిల్లవాణ్ణి కుడుములు కట్టేట్టుగా ఎంత బాదినారో చూడండయ్యా! వీడి చేతులు నెత్తురు ముద్దలయ్యేట్టు కొడితే మీకే మొస్తుందయ్యా! కన్న ప్రాణాలు ఎట్ల ఓర్చుకుంటాయయ్యా. అదే మీ పిల్లోల్లను ఎవరన్నా కొడితే మీ ప్రాణాలు తట్టుకుంటాయా" అంది కంపించే కంఠంతో రంగమ్మ – ఈ మాటలంటున్నపుడు ఆవేశంతో ఆమె స్వరంలో జీర పలికింది.

హెడ్మాస్టర్‌కు విషయం అర్థమయింది. ఆమెకు దగ్గరగా వచ్చి "ఎవరు కొట్టారమ్మా" అనడిగాడు అమాయకంగా నటిస్తూ.

"మీ డ్రిల్లుసారేనయ్యా! అదేందో డ్రస్సు యేసుకొని రాలేదని వీణ్ణి యిట్ల చెడబాదినారయ్యా" అంది కోపంతో వూగిపోతూ.

"మీవాడు స్కూల్‌డ్రస్సు లేకుండా బడికి రావటం తప్పేకదమ్మా! భయపెట్టడానికి కొడతారమ్మా! పిల్లలు డ్రస్సు వేసుకొని రావాలమ్మా" అన్నాడాయన నచ్చచెప్పేందుకు ప్రయత్నిస్తూ.

"మేమేదో తిండికి గతిలేనివాళ్లం. ఏదో నాలుగు ముక్కలు చదువుకుంటాడని బడికి పంపిస్తే, మీరు కోరిన బట్టలు మేము యాడ తెస్తామయ్యా! అవునయ్యా నాకు తెలీక అడుగుతాను. మీరు చదువులు చెప్పేది పిల్లవాడికే గదయ్యా" అంది రంగమ్మ.

"ఔనమ్మా" అన్నాడు హెడ్మాస్టర్ కాస్తా చిరాకుగా.

"మీకు పిల్లవాడే గదయ్యా ముఖ్యెం – బట్టలతో ఏం పనుందయ్యా. పిల్లవాడే గదయ్యా చదువు నేర్చుకుండేది. బట్టలు నేర్చుకుంటాయేమయ్యా! మీరంతా బట్టలకు చదువు చెప్పరు గదయ్యా! మీకు పిల్లవాళ్ల కంటే బట్టలే ముఖ్యెం అయినట్టుంది. ఇదేమన్నా

మంచి పద్ధతేనా సామీ" అనడిగింది రంగమ్మ.

"నువ్వు అట్లా మాట్లాడకూడదమ్మా. బట్టలు క్రమశిక్షణ కోసం క్రమశిక్షణ వుంటేనే చదువు వస్తుంది" అన్నాడు హెడ్మాష్టర్.

"ఏం సిచ్చనో ఏమో తండ్రీ! మీ అయ్యవార్లంతానేమో రకరకాల బట్టలు వేసుకొని వస్తారు. పిల్లలు మాత్రం ఒకటే బట్టలు వేసుకొని రావల్ల - చదువుల వల్ల రాని కమసిచ్చన బట్టలతో వస్తుందంటే నాకు నమ్మకం చిక్కలేదయ్యా" అంది రంగమ్మ చేతులు వూపుతూ.

"అలా అనకూడదమ్మా. తప్పనిసరిగా స్కూల్‌డ్రస్ వేసుకొనే బడికి రావాలి లేకపోతే మేము బడికి రానివ్వం" అన్నాడాయన కోపమూ, అసహనమూ ధ్వనించే స్వరంతో.

'బడికి రానివ్వం' అనగానే రంగమ్మ కోపంతో ఊగిపోయింది

"ఏందయ్యా, మీరూ మీ స్కూలు డ్రస్సూ మీరు ఉత్త బట్టలకే చదువు చెప్పేటట్టు మాట్టాడతావుండారు మీకు పిల్లోల్ల కంటే బట్టలే ముఖ్యం అయినట్టుండాది. అయితే బట్టలకే చెప్పుకోండి మీ సదుగు" అంటూ తన పిల్లవాడివేపు తిరిగి చకచకా వాడి చొక్కా గుండీలు విప్పి, చొక్కా తీసి కింద పడవేసింది. తన కొడుకు గింజుకుంటున్నా పట్టించుకోకుండా వాడి నిక్కరు గుండీలు విప్పి నిక్కరులాగి ఆ చొక్కా మీద పడవేసి, క్షణంలో వాణ్ణి నగ్నంగా చేసింది. అందరూ నోళ్లు వెళ్లబెట్టుకొని నిశ్చేష్టులై చూస్తూండగా "ఇదిగోనయ్యా మీ స్కూల్‌డ్రస్సు - ఈటిని యిప్పి మీ ముందే ఏసినా - బాగా సూసుకోండి తెల్లచొక్కా, కాకీ నిక్కరూ - ఈ బట్టలకే సెప్పుకోండి మీ సదుగు. ఇవి మాసిపోయినంక మా యింటికి పంపియ్యండి ఉతికి మళ్లీ పంపిస్తాను. ఈ బట్టలకు ఎంత సదువు వస్తుందో మీరే కనుక్కోండి. నేను వస్తానయ్యా" అంటూ రెక్క పట్టుకొని కొడుకును ఈడ్చుకుంటూ చకచకా బయటకు నడిచిపోయింది రంగమ్మ.

అక్కడ పడున్న తెల్లటి స్కూలు డ్రస్సు ఆ స్కూలుకేసీ, ఉపాధ్యాయులకేసీ, పిల్లలకేసీ, తెల్లబోయి చూస్తూనే వుంది.

*అంజలి సచిత్రవారపత్రిక, 24-9-93*

# ఉప్పుకప్పురంబు

## జీడిగుంట రామచంద్రమూర్తి

సమయం మధ్యాహ్నం రెండు గంటలు....!

రోహిణీకార్తె ఇంకా ప్రవేశించకపోయినా, ఎండ మాత్రం రోళ్ళు బ్రద్దలయ్యేలా – విరగబడి కాస్తోంది...

ఎర్రని నిప్పులపై నించి వస్తున్న వేడిసెగలా వడగాడ్పులు వీస్తున్నాయి.

అలాంటి సమయంలో రైలుదిగి – స్టేషన్లోంచి బయటకు వచ్చాడు విశ్వనాధం....

కుడిచేతిలో వున్న సంచిని ఎడం చేతిలోకి మార్చుకుని – పై మీది కండువాతో ఓసారి ముఖం తుడుచుకున్నాడు.... బయట ఎండా – వడగాడ్పులకు సాయం లోపల ఆకలి అతని పేగులు కొరికేస్తోంది...

అసలు రైలు సరైన సమయానికి వచ్చివుంటే, ఈపాటికెప్పుడో ఇల్లు చేరుకుని, భోజనం ముగించి ఓ కునుకు తీస్తూండేవాడు! కానీ, తన దురదృష్టంలాగే, ఆరోజు బండి మూడుగంటలు లేటుగా వచ్చింది.

'ఇంత ఎండలో ఇంటికి ఎలా వెళ్ళటం?'– అనుకున్నాడు విశ్వనాధం – నిర్మానుష్యంగా వున్న తార్రోడ్డు మీదకు చూస్తూ.

అక్కణ్ణించి తన ఇల్లు, మహా వుంటే అరమైలు దూరంలో వుంటుంది. చకచకా నడిస్తే – పావుగంటలో చేరుకోవచ్చు.

కానీ, అడుగుతీసి అడుగు వేయాలంటేనే – భరించలేనంత నిస్రాణగా వుంది విశ్వనాధానికి. అలాంటప్పుడు అరమైలు నడవటమంటే మాటలా?

ఒకవేళ, తాను వెళ్ళినపని విజయవంతంగా పూర్తయివుంటే – వంట్లోకి వెయ్యి ఏనుగుల బలం వచ్చి వుండేది .... అప్పుడు ఆకలి, ఎండ, వడగాడ్పులు – మొదలైనవాటిని లక్ష్య పెట్టకుండా పరుగులాంటి నడకతో, ఇంటికి వెళ్ళేవాడు.... ఆ శుభవార్తను అలివేలుకి చెప్పి – అదంతా తన ప్రయోజకత్వమేనన్నట్టు పోజు పెట్టేవాడు!....

కానీ ఆపని – అనుకున్నట్టు జరగలేదే!...

మరి ఇప్పుడు ఇంటికి వెళ్ళి భార్యకు ఏం చెప్పాలి? కథ మళ్ళీ మొదటికి వచ్చిందని చెప్పాలా!.... అరుణకు సంబంధం వెతకటానికి మరో కొత్త చెప్పుల జత కొనుక్కోవాలా.

'రిక్షా తెమ్మంటారా బాబూ?' అంటూ అంతలోనే పక్కనున్న రిక్షావాలా పలకరించాడు విశ్వనాధాన్ని.

భగవంతుడు ప్రత్యక్షమై 'నీకే వరం కావాలో కోరుకో–' అన్నట్టుగా తోచింది అతనికి.... కానీ అదే క్షణంలో అతని నరాల్లో మళ్ళీ నిస్సత్తువ ఆవరించింది ..

ఆ కాస్త దూరమే అయినా – రిక్షావాలా కనీసం రెండు రూపాయలు అడుగుతాడు.

పదేళ్ళ క్రితం ఇలా ఉండేదా పరిస్థితి. ...?!

అప్పుడు తన ఊళ్ళో పాతికో ముప్ఫయ్యో రిక్షాలుండేవి. .. తను ఎప్పుడైనా స్టేషన్లో రైలుదిగి బయటకొస్తే – ఏమీ చెప్పి పెట్టకుండా ఎక్కి కూర్చుని 'పోనీయ్' అనేవాడు

ఇంటి దగ్గర రిక్షాదిగి ఓ అర్ధరూపాయి బిళ్ళ రిక్షావాలా చేతిలో పెడితే అదే ఒక వరహాగా భావించి, పొంగిపోయి తృప్తిగా దాన్ని బనీను జేబులో వేసుకుని తనకు ఓ నమస్కారం కూడా పెట్టి మరీ వెళ్ళిపోయేవాడు అతను!

ఇప్పుడు రిక్షాలు ఎక్కువై పోయాయి. జనం కూడా పెరిగిపోయారు. అప్పటి తృప్తీ, ఆ రకమైన గౌరవం – ఎవరిలోనూ వెతికి చూసినా కనపించటం లేదు ఇప్పుడు!

అంతా పోటీ బ్రతుకై పోతోంది. . ఎంత వచ్చినా, కొంత వెలితిగానే ఉంటోంది. అసలు ధరలు మండిపోతోంటే వాళ్ళు మాత్రం ఏం చేస్తారు?

'రిక్షా వేస్తాను బాబూ!'– రిక్షావాలా మళ్ళీ హెచ్చరించటంతో ఆలోచనలువ దిలిపెట్టి వాసతానికి వచ్చాడు విశ్వనాధం

'గాంధీ బొమ్మ దగ్గరకు ఏం తీసుకుంటావ్?' అడిగాడు.

'మీకు తెల్దేటి బాబూ?... ఎక్కండి!' – అన్నాడు అతను రిక్షాను ముందుకు తెచ్చి.

'రెండు రూపాయలిస్తాను! మళ్ళీ అక్కడకు వెళ్ళాక పేచీపెట్టకు! అంటూ ఎక్కి కూచున్నాడు విశ్వనాధం.

'తమదయ బాబూ! ఈ ఎండలో తొక్కాలి!.... అంతా మెరక! కట్టం చూసి ఇంకో అర్ధరూపాయిచ్చేయండి బాబూ!' – రిక్షావాలా అన్నాడు....

అతనిలోని నమ్రతాభావం విశ్వనాధానికి ఎంతో నచ్చింది. అందుకే మరేమీ బదులు చెప్పలేకపోయాడు..... పైగా అతను అడిగిందీ సబబుగానే తోచింది.... తాను హాయిగా రిక్షాలో కూర్చున్నాడు .. అతను మాత్రం ఆ ఎర్రని ఎండలో, ప్రయాసపడుతూ తనను లాక్కెళ్ళాలి!....

అసలు ఈరోజుల్లో రెండు రూపాయలకు విలువేముంది?.... ఒకప్పుడు, అప్పుడెప్పుడో తాను కాపురం పెట్టిన తొలిరోజుల్లో పది రూపాయలు పెడితే అయిదు కుంచాల బియ్యం వచ్చేవి. ప్రతి శనివారం నాలుగేసి గుప్పిళ్ళు దానధర్మాలు చేసినా –

నెలరోజులకు సరిపోయేవి. అప్పట్లో రెండు రూపాయలు పట్టుకుని సంతకి వెడితే - నాలుగు సంచుల నిండా కూరలు వచ్చేవి.....

ఇప్పుడు రెండు రూపాయల కూరలు కొనుక్కురావాలంటే - రెండు చేతులూ ఊపుకుంటూ వెళ్ళిరావచ్చు.

గుప్తులకాలం ఎలా ఉండేదో తనకు తెలియదుకానీ - తాను పెళ్ళి చేసుకుని కాపురం పెట్టిన తొలిరోజులే 'స్వర్ణయుగం' అనుకుంటాడు విశ్వనాధం.

రానురాను కుటుంబం పెరిగింది. అవసరాలు ఎక్కువయ్యాయి. ధరలూ పెరిగిపోయాయి.

తనలాంటి మధ్యతరగతి కుటుంబీకుడు, వచ్చే జీతంలో నిత్యావసరాలు తీర్చుకోలేక సతమతమై పోతూంటే - కూలీనాలీ చేసుకునే అట్టడుగుజనం అర్ధాకలితో ఎలా బతగ్గలుగుతున్నారో - అనుకున్నాడు విశ్వనాధం

'రోజూ నువ్వెంత సంపాదిస్తావ్?' - అడిగాడు రిక్షావాలాని.

'అంతా గాలివాటం బాబూ! వస్తే ఒకరోజు పాతికా, ముప్పయ్ వస్తాయి . . లేకపోతే పదీ-పరకా కూడా గిట్టుబాటుకాదు'- ఓ చేత్తో నుదుటిమీద పట్టిన చెమట తుడుచుకుంటూ చెప్పాడు.

'సరిపోతుందా మరి?'

'సరిపెట్టుకుంటాం బాబూ!.... ఎక్కువ వచ్చినప్పుడు రెండు రూపాయలు ఎనకేసుకుంటే - రానప్పుడు సద్దుకోచ్చు!.... నా యింటిది కూడా నాలుగిళ్ళల్లో పని చేస్తుంటుంది!

'పిల్లలెంతమందీ?' - వెంటనే ప్రశ్నించాడు విశ్వనాధం.

'ఇద్దరే బాబూ!. .. ఆడపిల్లలు!'

మళ్ళీ మరేం అడగలేదు విశ్వనాధం.

రిక్షా ఎత్తు ఎక్కుతోంది.... ఎండలో రిక్షావాలా నల్లటి శరీరం చెమటలో తడుస్తూ - మెరుస్తోంది.

'నాకు పుట్టింది ఒక్కత్తే బాబూ!..... కానీ నాకో చెల్లెలుంది!.... దాన్ని కూడా నా బిడ్డలాగే సూసుకుంటన్నా . మా సిన్నతనంలోనే అమ్మ సచ్చిపోయింది!'- మెరకరోడ్డు మీద తొక్కలేక, క్రిందకు దిగి రిక్షాను నెమ్మదిగా లాగుతూ చెప్పాడు.

'పిల్లల్ని చదివిస్తున్నావా?'

'సదివిస్తున్నాను బాబూ!.... సెల్లెమ్మ ఎనిమిదో కళాసు సదూతోంది.. నా కూతురేమో ఆరు! ఇద్దరూ అప్పసెల్లెళ్ళులాగే వుంటారు బాబూ!..... గానం వచ్చిన కాణ్ణించీ నా దగ్గరే వుంటోంది కదా మరీ... అందుకే అది కూడా అయ్యా' అని పిలుస్తుంది' - రిక్షా లాగుతూనే వెనక్కి తిరిగి అతను అలా చెప్తూంటే - ఆ కళ్ళల్లో వేయి చందమామల కాంతి కనిపించింది.

'పిల్లలు ఏ స్కూల్లో చదువుతున్నారు?' - అడిగాడు విశ్వనాధం.

'ఆంజనేయ సామి గుడికాడ గోర్నమెంటు ఇస్కూలుంది కదండీ .. అందులోనే!'

విశ్వనాథంలో ఉత్సుకత పెరిగింది. . ఆ స్కూల్లో ఆరో క్లాసునించీ తొమ్మిదో క్లాసువరకూ తనే లెఖ్ఖలు చెప్తూంటాడు. పిల్లలందరూ తనకు తెలుసు మరి రిక్షావాలా పిల్లలు, వాళ్ళల్లో ఎవరై వుంటారు?.....

'నీ పిల్లల పేర్లేమిటి?' అడిగాడు

'పెద్దదానిపేరు అదే... సెల్లెమ్మ పేరు - అమ్మడండీ! ... ఎనిమిదో క్లాసు సిన్నదేమో ఆరోక్లాసు పేరు సూకాలమ్మండి'

'అలాగా!... వెరీగుడ్! పిల్లలిద్దరూ తెలివైన వాళ్ళే!. . మంచి మార్కులు వస్తుంటాయి. .. బాగా చదివించు!'

రిక్షావాలా ఆశ్చర్యపోయాడు.

'ఆళ్ళు ఆళ్ళిద్దరూ తమకు తెలుసా బాబూ?' అడిగాడు ఆత్రంగా

'బాగా తెలుసు! నేను ఆ స్కూల్లోనే లెఖ్ఖలు చెప్తూంటాను!. నీ చెల్లెలు లెఖ్ఖల్లో ఎప్పుడూ ఫస్టే!- నేను అప్పుడప్పుడు అనుకుంటాను అది ఏ గొప్పింట్లోనో పుట్టి ఉండాల్సిందని!'

'పరవాలేదు బాబూ!.. .. దానికి అమ్మ లేకపోయినా నేనున్నాను, ఏ లోటూ లేకుండా పెంచుకుంటున్నా . . అది పరిచ్చలు పేసవుతూ వుండాలేగానీ ఎంతవరకూ సదూకుంటానంటే అంతవరకూ సదివిస్తాను. అవసరమైతే నా గుడిశె. .. ఇదిగో. . ఈ రిచ్చా ఇయ్యన్నీ అమ్మేసైనా సరే దానికి పెద్ద చదువు సెప్పిస్తాను బాబూ! . .' ఉత్సాహంగా చెప్తూంటే వాడి కళ్ళల్లోకి పెల్లుబికివస్తున్న ఆనందభాష్పాల్ని విశ్వనాథం గమనించ లేకపోయాడు

'అవునూ. . మరి నీకు ఒక్కతే బిడ్డన్నావ్- మరి తర్వాత పిల్లలు పుట్టలేదా?' - అనుమానం వచ్చి కావాలనే అడిగాడు విశ్వనాథం

'లేదు బాబూ! మా ఇంటిదానికి ఆప్రేసను చేయించేశాను . . ఇంక పిల్లలు పుట్టరు!'- గర్వంగా చెప్పాడు రిక్షావాలా

ఆశ్చర్యపోయాడు విశ్వనాథం.

'మరి మగపిల్లలు వద్దా? .. రేపు ఆడపిల్లలిద్దరికీ పెళ్ళిచేసి అత్తారింటికి పంపించేస్తే - పెద్ద వయసులో నిన్ను చూట్టానికి ఒక్క మగ నలుసైనా వుండద్దూ?'

'రేపెప్పుడో మగపిల్లలు మనల్ని సూత్తారని గేరంటీ ఎక్కడ బాబూ! పైగా కన్నాక ఆళ్ళని మనం మంచిగా సూత్తేనేకదా- ఆళ్ళు రేపు మనల్ని సూసేది?... అయినా 'ఈరోజుల్లో ఎవరైతే ఏందీ' అంది బాబూ నా ఇంటిది! అసలు ధరలు ఎలా మండిపోతున్నాయో తమరికి తెలవని ఇసయమా? .. వున్న ఇద్దరు పిల్లలకీ ఇస్కూలు సదువు సెప్పిత్తే, కూతంత తెలివితేటలొస్తాయి... ఆళ్ళిద్దరూ సుకంగా ఆనందంగా వుంటే - కన్నోళ్ళకు అంతకంటే ఆనందం మరేటి వుంటది బాబూ.... ఇక ఆ తర్వాతంటారా, నా రెక్కల్లో బలం వున్నంతవరకూ సంపాదించుకుంటే - మారోజులు ఎల్లిపోతాయి!'

'క్రితం జన్మలో ఏ ఆర్థికతత్వవేత్తో - ఈ జన్మలో ఇలా ఈ రిక్షావాలాగా పుట్టా డేమో'- అనిపించింది విశ్వనాధానికి ఆ క్షణంలో

తాను ముప్పయ్యేళ్లు లెఖ్కల మాస్టరుగా పనిచేసినా విడివడని 'ప్రాబ్లెం'ని క్షణంలో అతను 'సాల్వ్' చేసి చూపించినట్టుగా ఫీలయ్యాడు.

రిక్షా ఎత్తు మీదనించి పల్లంలోకి పరుగులు తీస్తోంది. దాంతో సమానంగా విశ్వనాథం ఆలోచనలు కూడా పరుగులు తీస్తున్నాయి.

"గాంధీ బొమ్మకాడకి వచ్చేశాం!... ఎక్కడ దిగుతారు బాబూ?" అడిగాడు రిక్షావాలా.

విశ్వనాథం ఉలిక్కిపడ్డాడు. గాంధీ బొమ్మదగ్గరకు వచ్చేశాడు. అంటే మరో రెండు నిమిషాల్లో తాను ఇంట్లో అడుగుపెడతాడు.. ఆత్రంగా తనకు ఎదురువచ్చి 'వెళ్ళిన పని ఏమైంది?' అని ప్రశ్నించే అలివేలుకి తను ఏం బదులు చెప్పాలి?.. .

అందుకే ఉలిక్కిపడ్డాడు.

'అదిగో.. అదే ఇల్లు!... ఆ ఎలక్ట్రిక్ స్తంభం దగ్గర ఆప్చెయ్!" ఇల్లు చూపించాడు.

ఇంటిదగ్గర రిక్షా ఆగింది . . క్రిందికి దిగి జేబులోంచి పర్సు తీశాడు విశ్వనాధం అందులోంచి మూడు రూపాయి కాగితాలు తీసి రిక్షావాలాకు ఇస్తూ అన్నాడు.

"ఎండలో కష్టపడి లాక్కొచ్చావ్! ... ఈ మూడు రూపాయలూ తీసుకో!" రిక్షావాలా ఆ డబ్బు తీసుకోలేదు.

"వద్దు బాబూ!.... నా బిడ్డలకు సదువు సెప్పే దేవుళ్ళు తవరు!.... తవరి దగ్గర డబ్బు తీసుకుంటే నా కళ్ళుపోతాయ్.... పైగా మా అమ్మడు సదువులో పస్టుంటాదని సల్లటి వోర్త సెప్పారు!... అదే కోటి రూపాయల విలువ బాబూ!.... వుంచండి!"- చేతులు జోడించి చెప్తున్న రిక్షావాలా కళ్ళల్లో - కన్నీళ్ళు కదలటం గమనించాడు విశ్వనాధం .. చెల్లెలు పట్ల అతనికున్న ఆపేక్ష ఎలాంటిదో గ్రహించిన విశ్వనాధం పొంగిపోయాడు

"అలాకాదు.... నా మాట విను" అంటూ మళ్ళీ డబ్బు ఇవ్వబోయాడు.

"ఇంకేం సెప్పద్దు బాబూ!.... నా బిడ్డలు బాగా సదివేలా సూడండి.... నాకంతేసాలు!"- అంటూనే రిక్షా ఎక్కేసి వెళ్లిపోయాడు రిక్షావాలా.

☆ ☆ ☆

"మరిప్పుడు ఏం చేద్దాం?" – ఆ రాత్రి భోజనాల సమయంలో అసలు విషయాన్ని మళ్ళీ ప్రస్తావనకు తెచ్చింది అలిమేలు.

"చెయ్యటానికి ఏముందీ?... ఆ సంబంధానికి నీళ్లు వదిలేసి మళ్ళీ పెళ్లికొడుకుల వేట ప్రారంభించాల్సిందే!" చెప్పాడు విశ్వనాధం.

"అబ్బాయి లక్షణంగా వున్నాడు. నెలకు రెండువేలు జీతంట!.... అంతో యింతో ఆస్తికూడా వుంది..... ఇంతమంచి సంబంధం మళ్ళీ మనకి దొరుకుతుందంటారా?" - అలివేలు తన అనుమానాన్ని వ్యక్తం చేసింది.

"దొరికేదానితోనే తృప్తిపడదాం!. ఏం చేస్తాం?"

తండ్రికి కొంచెం పక్కగా, తలవంచుకొని భోజనం చేస్తున్న అరుణ - తల్లివైపు అదోలా చూసింది....

పిల్లల మనోగత భావాన్ని ఏ తల్లైనా ఇట్టే అర్థం చేసుకోగలుగుతుంది... భగవంతుడు మాతృమూర్తికిచ్చిన వరం అది!. .

"అమ్మాయికి - ఆ అబ్బాయి నచ్చాడట!" భర్తకు నెయ్యి వేస్తూ నెమ్మదిగా చెప్పింది.

విశ్వనాథం మనసుకి సూది గుచ్చుకున్నట్టనిపించింది ఆ మాటకొస్తే ఆ అబ్బాయి తనకూ ఎంతగానో నచ్చాడు . కానీ ఎలా? ఏభై వేలు కట్నం కావాలంటున్నారు!. . తన ప్రావిడెంటు ఫండు తాలూకు డబ్బు మహా వుంటే పదిహేను వేలుంటుంది! దాంతోటే అరుణ పెళ్ళి చేసేసి తన బాధ్యత తీర్చుకోవాలనుకుంటున్నాడు... మరి వాళ్లు ఏభై వేలు అడిగితే తను ఎక్కణ్ణించి తేగలడు?

"ఏభై కి పైసా తక్కువైనా వీల్లేదని ఖచ్చితంగా చెప్పేశారు.. ఎక్కణ్ణించి తెమ్మంటావ్ అంత డబ్బు?- భార్యవైపు నిస్సహాయంగా చూశాడు విశ్వనాథం.

బదులు చెప్పలేక - బాధగా తలవంచుకుంది అలివేలు.

నిత్యావసర వస్తువుల ధరలు పెరుగుతున్నట్టే - కట్నాల రేట్లు కూడా .పెరిగి పోతున్నాయి మరి.. .

"పోనీ ఓ పని చేద్దాం!" - కొన్ని క్షణాల నిశ్శబ్దం తర్వాత హఠాత్తుగా అంది అలివేలు ..

"ఏం చేద్దాం?"

"ఇల్లు అమ్మేద్దాం!"

భార్య సలహా బాగానే వున్నట్టు తోచింది విశ్వనాథానికి.

నిజమే!.....

ఇల్లు అమ్మేస్తే ఎంత లేదన్నా ఓ ఎనభై వేలు వస్తాయి.... అందులో యాభై వేలు కట్నం ఇచ్చి మరో - పదివేలు ఖర్చుపెట్టి అరుణ పెళ్ళి ఘనంగా చెయ్యొచ్చు.. . తక్కిన ఇరవై వేలూ ఫిక్స్‌డ్ డిపాజిట్‌లో వేసుకుంటే దానిపై వచ్చే వడ్డీతో వేరే ఇంట్లో అద్దెకు వుండచ్చు . ముఖ్యంగా తనకు నచ్చినవాడితో అరుణ సుఖపడుతుంది.

అలివేలు బుర్ర బాగానే పనిచేసింది. ఈ ఆలోచన తనకు రానేలేదు.

"మనవీధిలో తాసిల్దారుగారు ఏదైనా ఇల్లు బేరానికి వస్తే కొనాలని అనుకుంటున్నారట! మొన్న మాటల సందర్భంలో పక్కింటి పిన్నిగారు చెప్పారు!" తన సలహా భర్తకు నచ్చిందన్న నమ్మకం కుదరటంతో మళ్ళీ చెప్పింది అలివేలు.

"సర్లే! రేపు తాసిల్దారుగారితో మాట్లాడుతాను!" అన్నాడు విశ్వనాథం చేయి కడుక్కుంటూ.

తండ్రికి మరో పక్కన కూర్చుని భోజనం చేస్తూనే - వాళ్ళ సంభాషణ వింటున్న విశ్వనాథం కొడుకు, మురళి హఠాత్తుగా అడిగాడు.

"రెండో అక్క పెళ్లికోసం వున్న పొలం అమ్మేశారు... ఇప్పుడు మిగిలిన ఈ ఒక్క ఇల్లు అమ్మేస్తే రేపు నాకేం మిగుల్తుంది'

ఆ ప్రశ్న వినగానే అందరూ ఒక్కసారిగా త్రుళ్ళిపడ్డారు. కొడుకు అలా నిలదీసి అడుగుతాడని విశ్వనాథం ఊహించలేదు.

"నీకేమిట్రా... మగాడివి! ఈ ఏటితో డిగ్రీ చేతికొస్తుంది!... ఏదో ఒక ఉద్యోగం సంపాదించుకుని నీ కాళ్ళమీద నువ్ నిలబడచ్చు!' ఆ షాక్‌నించి ఎలాగో తేరుకుని చెప్పాడు విశ్వనాథం.

"ఎమ్మేలకే దిక్కూ దివాణం లేకుండా పోతోంది... బోడి బి.ఏ. గాడికి ఎవడిస్తాడు ఉద్యోగం? అయినా ఈ ఇల్లు తాతగారిది దీని మీద నాకూ హక్కుంటుంది. అందుకే అమ్మటానికి వీల్లేదంటున్నాను. అంతగా కావాలంటే ఎక్కడైనా అప్పుతెచ్చి అరుణక్క పెళ్ళిచేయండి! నెమ్మదిగా తీర్చుకోవచ్చు!" మురళీ కొంచెం తీవ్రంగానే అన్నాడు.

విశ్వనాథం తలవంచుకుని తన గదిలోకి వెళ్ళిపోయాడు.. . మంచం మీద నడుం వాల్చాడేకానీ ఎప్పటికీ కంటిమీదకు కునుకే రావటంలేదు.. మురళీ మాటలు పదే పదే గుర్తుకొచ్చి మనసును కలవరపెడుతున్నాయి.

వరసగా ఆడపిల్లలు పుట్టుకొస్తూంటే వంశాన్ని నిలపటానికి ఒక్క మగనలుసైనా కావాలని ఎంతగానో తపించిపోయి ఎందరు దేవుళ్ళకో మొక్కుకున్నదీ - ఎన్ని పుణ్యక్షేత్రాలో సందర్శించిందీ ఇందుకేనా?" ఇవాళ ఆ మగ నలుసుచేత ఇంతటి మాట అనిపించుకోటానికేనా?

"మగపిల్లలు మనల్ని ఉద్ధరిస్తారని గేరంటీ ఏటి బాబూ?' - రిక్షావాలా ఎంత బాగా ఊహించాడు? ....

తన చెల్లెల్ని కన్నబిడ్డకంటే మిన్నగా చూసుకుంటున్నాడు... ఆ చెల్లెలు సుఖం కోసం అవసరమైతే తన ఇల్లూ, రిక్షా, అన్నీ అమ్మేస్తాట్ట.

అరుణ పెళ్ళికోసం అవసరమై - ఇల్లు అమ్ముతానంటే - ససేమీరా వీల్లేదంటున్నాడు మురళీ!

ఇద్దరూ ఓ ఆడపిల్లకి తోడపుట్టినవాళ్ళే!

కానీ ఇద్దరి ఆలోచనల్లోనూ ఇంతటి వ్యత్యాసం ఎందుకు వచ్చింది మరి?...

అసలు మనిషికి సంస్కారం ఎలా వస్తుంది? చదువువల్లా?... సంపదవల్లా??.. కులం వల్లా?.... గుణంవల్లా?... మతంవల్లా?... ఎలా వస్తుంది?...

రిక్షావాలా చదువుకోలేదు..

మురళి బి.ఏ. చదివాడు!

ఇద్దరి ఊహల్లోనూ ఎంత భేదం ఉంది.

చూడటానికి ఉప్పు - కర్పూరం ఒక్కలాగే వుంటాయి.

ఉప్పు అందరికీ అవసరం వుండచ్చు...

కానీ - కర్పూరం మాత్రం దేవుడికే కావాలి!!....

# లోటు

## వి. రాజారామమోహనరావు

స్కూలునుంచి వచ్చిం తర్వాత ఓ అయిదారుసార్లేనా రవి యింట్లోంచి బైటికి, బైటి నుంచి యింట్లోకి తిరిగాడు

☆ ☆ ☆

రోజు రోజుకీ రామారావుకి అనుమానాలు యెక్కువవుతున్నాయి చాలారకాల అనుమానాలు, చాలా రకాలుగా రామారావుని యిబ్బంది పెడుతున్నాయి. ఈ అనుమానాల కారణంగా అసలే అంతంత మాత్రగా వుంటున్న వుత్సాహం మరింతగా అడుగంటిపోతోంది రామారావు జీవితంలో

రామారావు మనస్థితికి తగినట్టే వుంటోంది అతని ఆఫీసు పరిస్థితి వెళ్ళమంటే పొద్దున పదింటికి ఖచ్చితంగా వెళ్ళాలికానీ, తిరిగి బైటపట్టానికి సరైన టైమంటూ లేకుండ పోయింది. ప్రయివేటు సర్వీసు ఆ ఆఫీసువరకు మేనేజర్ మాట శాసనం లాంటిది కనీసం ఆ రోజేనా సాయంత్రం ఆఫీసు నుంచి తొందరగా బైట పడితే బావుణ్ణని వుంది రామారావుకి.

యాడాదిక్రితం ప్రమోషన్‌మీద ఆశ కొద్దీ తనంతగా తానే చాలా పనులు నెత్తిన వేసుకున్నాడు రామారావు. ప్రమోషన్ రాలేదు సరికదా చాలారకాల గాడిదచాకిరీ తలకి చుట్టుకుంది. ఇబ్బంది పెట్టే స్టేట్‌మెంట్స్, టేలీకాని ఎకౌంట్స్ మేనేజర్ రామారావుకి అప్పజెప్పటం మొదలుపెట్టాడు "నావల్లకాదు, నేను చెయ్యను" అని చెప్పాలని వున్నా రామారావు చెప్పలేని పరిస్థితిలో పడ్డాడు. వర్క్ ఆలస్యం అయినా అనుకున్నట్టు జరక్కపోయినా ట్రాన్స్‌ఫర్ భయం వొకటి పెట్టాడు మేనేజర్ రామారావుకి. హెడ్‌క్వార్టర్స్ బొంబాయి తనని అక్కడికి ట్రాన్స్‌ఫర్ చేస్తే యీ జీతంతో ఆ నగరంలో బ్రతకటం ఎంతటి నరకమో వూహించలేనంత అమాయకుడేం కాదు రామారావు. ఈ పరిస్థితివల్ల ఆఫీసులో వున్నంతసేపూ ఏ పని ఏ క్షణాన నెత్తికి చుట్టుకుంటుందో అన్న భయమే సరిపోతోంది రామారావుకి.

టంచన్‌గా అయిదింటికి కాకపోయినా, ఆరున్నరకి బైటపడ్డాడు ఆరోజు ఆఫీసు నుంచి రామారావు. బైటికి వచ్చీ రాగానే హోటల్‌కి వెళ్ళి వేడివేడి కాఫీ తాగేటప్పటికి కాస్త వుత్సాహం వొచ్చింది. హోటల్ బిల్లు యిస్తూ పర్స్‌లో వున్న కాయితాన్ని తీసి మరోసారి

ఎడ్రసు చూసుకున్నాడు. "మహా వుంటే ఏ మైలు వుంటుంది నెమ్మదిగా నడిస్తే సరి" అనుకున్నాడు. అలా అనుకుని ముందుకు నడుస్తుంటే తొమ్మిదేళ్ళ కొడుకు రవి ముఖం కళ్ళముందు మెదిలింది రామారావుకి.

☆ ☆ ☆

అప్పటికి అది పదిహేనోసారి రవి యింట్లోంచి బైటికి, బైటి నుంచి యింట్లోకి తిరగటం యింట్లోంచి బైటికి వచ్చినప్పుడల్లా అరుగుమీద నిలబడి కనీసం ఓ అయిదారు నిముషాలేనా తండ్రి రాకకోసం యెదురు చూస్తున్నాడు. ఆ సన్నటి చీకటి వీధితప్ప తండ్రి వస్తున్న జాడ యెక్కడా కనిపించటంలేదు

సాయంత్రం స్కూలు నుంచి వచ్చిందగ్గర్నించీ తండ్రి రాకమీదే వుంది రవి దృష్టంతా అప్పటికీ ఓ రెండు మూడుసార్లు అడిగాడు తల్లిని "ఇవాళేనా, నాన్నగారు తీసుకొస్తానన్నారా?" అని. "ఆఫీసు నుంచి వొచ్చేటప్పుడు తప్పకుండా తీసుకొస్తానన్నా"రని చెప్పింది సుశీల అందుకే మరింత ఆతృతగా యెదురు చూస్తున్నాడు రవి.

"నువ్వు అన్నం తిని పడుకో. నాన్న రాగానే లేపుతా" అంది సుశీల అయినా వినలేదు రవి కాస్సేపు తల్లి దగ్గర కూచోటం, తిరిగి లేచి వీధిలకి వెళ్ళటం, వీధిలో కాసేపు ఎదురుచేసే తిరిగి లోపలికి రావటం, యిలాగే గడుపుతున్నాడు.

☆ ☆ ☆

అరగంటపైనె పట్టింది నడిచి రామారావు ఆ షాపు చేరటానికి. నోట్సులు, పెన్సిళ్ళు, స్కేళ్లు, రబ్బర్లు.. నానా హడావిడిగా వుంది అలసట తగ్గినట్టు వుంటుంది. కాస్త రద్దీ తగినట్టు వుంటుందని కొంచెం వెనగ్గా నిలబడ్డాడు

కాస్సేపటికి షాపతనే అడిగాడు "ఏం కావాలండీ" అని. చేతిలో వున్న కాయితం యిచ్చాడు రామారావు.

"అయిదో క్లాస్ ఇంగ్లీషు టెక్స్ట్ కదండీ. అరెరే.. ఇప్పుడే ఓ గంట క్రితం లాస్ట్ కాపీ వుంటే యిచ్చేశాను" అన్నాడు.

రామారావు వొంట్లోని వోపికంతా నీరు కారినట్టైంది.

"ఒక్క కాపీ కూడా లేదా... కొంచెం వుందేమో చూడండి. చాలా దూరం నుంచి వచ్చాను. పైగా మీ షాప్‌లో దొరుకుతుందని మావాడి స్కూల్లో చెప్పారట. కావాలంటే చీటిమీద చూడండి. మీ షాపుపేరు, ఎడ్రస్ రాసి వున్నాయి" అన్నాడు రామారావు.

"కర్రక్టే .. యివాళే అయిపోయాయి. ఈ పుస్తకానికి యెంత డిమాండో చెప్పలేను. ఎన్ని తెప్పించినా అయిపోతున్నాయి. రేపు రండి యిస్తాను. పొద్దున్నే వస్తాయి" అన్నాడు.

మర్నాడు మళ్ళీ రావటం అనేటప్పటికి అప్పుడే నీరసం వొచ్చింది రామారావుకి. ఇటువేపు రావాలంటే తొందరగా బస్సులుందవు, నడిచి రావాలి. అదీగాక ఆఫీసులోంచి ఎప్పటికి బైటపడటం జరుగుతుందో ఆలోచనలో పడ్డాడు.

"మీకు మరీ యిప్పుడే అవసరం అంటే పక్కనే బుక్స్ అమ్మే అతను ఒకతను

వున్నాడు. కుర్రాణ్ణి పంపించి వుంటే పట్టుకు రమ్మంటాను. కానీ వాడిది అంతా బ్లాక్ వ్యాపారం. యీ ఆరు రూపాయల పుస్తకానికి పది రూపాయలు తీసుకుంటాడు కావాలంటే చెప్పండి.... తెప్పిస్తా.... లేకపోతే రేపు రండి..." అన్నాడు చీటీ తిరిగి యిచ్చేస్తూ.

కాస్సేపు మళ్ళీ ఆలోచించాడు రామారావు. చూస్తూ చూస్తూ నాలుగు రూపాయలు యెక్కువ ఖర్చు చెయ్యాలనిపించలేదు. అదీగాక జేబులో పది రూపాయల్లేవు. ఎనిమిదే వున్నాయి. "ఎలాగోలాగ రేపు వీలు చేసుకుని వస్తే సరి" అనుకున్నాడు నీరసంగా వెనక్కి తిరుగుతూ. ఓ నాలుగడుగులు వేశాక మళ్ళీ వెనక్కి తిరిగి షాపు దగ్గరికి వచ్చాడు

"రేపు సాయంత్రం వస్తాను. ఓ కాపీ వుంచండి. మీ షాపు యెన్నింటిదాకా వుంటుంది?" అనడిగాడు.

"రాత్రి తొమ్మిదింటిదాకా వుంటాం. రండి" అన్నాడు షాపతను. అక్కడ్నించి రెండు బస్సులు మారి రామారావు యిల్లు చేరడానికి రెండు గంటలు పట్టింది

"ఓ గంట ముందేనా వెళ్ళానుకాను ఆ ఆఖరి కాపీ నాకే దక్కేదేమో" అనుకున్నాడు రామారావు. ఇల్లు చేరేవరకూ ఆలోచిస్తూనే వున్నాడు రామారావు. "వున్నది యిద్దరు పిల్లలు..వచ్చే ఏడు సునీతకి అయిదో ఏడు వస్తుంది దాన్నీ స్కూల్లో వెయ్యాలి. వీడి ఒక్కడి చదువుకే యింత యిబ్బందిగా వుంది· యింక దాని చదువూ వొస్తే. . రవి యిప్పుడు అయిదో క్లాసు చదువంతా అయి వాడు చేతికి అంది రావటానికి మరో పదిహేనేళ్లో యిర్వై ఏళ్లో పడుతుంది. అప్పటికి తనకి య్యాభై దాటతాయి. అన్నాళ్ళు యిన్ని పాట్లు పడితే అప్పుడు మాత్రం వాడు తనని చూస్తాడన్న గ్యారంటీ ఏమిటి?.. మళ్ళీ అనుమానం ఛఛ చూస్తాడు ఎందుకు చూడడు. తండ్రి అన్న అభిమానం వాడికి మాత్రం వుండదూ వుంటుంది. అవును అసలు తను వాడికి తండ్రేనా? వాడు తన కొడుకే అనుకోటానికి ఏమిటి ఆధారం" వులికిపడ్డాడు రామారావు

"ఛీ.. ఛీ... ఏమిటీ వెధవ ఆలోచన" అనుకున్నాడు.

ఈరకం ఆలోచన యిప్పుడే కాదు. అంతకు ముందూ ఒకటి రెండుసార్లు వొచ్చింది రామారావుకి. దానికి కారణం భార్య సుశీలపట్ల అనుమానం మాత్రం కాదు. ఏ ఆధారం, కారణంలేని విచిత్రమైన ఆలోచన అది. ఆ ఆలోచన వొచ్చినప్పుడల్లా బాధపడతాడు. అసలు ఏ తండ్రికైనా వీడు నా కొడుకే అని నిర్ధారణగా తెలిసే ఆధారం ఏముంది అన్న అనుమానం ఆ ఆలోచనతో పాటు రావటం, తిరిగి తనని తను తిట్టుకోటం రామారావుకి యిదివరకూ అనుభవంలో వుంది. అదీగాక రవిలో రామారావు పోలికలు కొట్టొచ్చినట్టు కనిపిస్తాయి. ఆ విషయం రామారావుకీ తెలుసు.

ఇదే కాదు యిలాంటి పిచ్చి ఆలోచనలు చాలా వొస్తున్నాయి రామారావుకి. తను ఎన్నాళ్ళు బ్రతుకుతాడు? బతికి మాత్రం యింకేం వుంది జీవితంలో? ఆఫీసు.. డబ్బు... భయం యిదే కదా? ఒకవేళ అకస్మాత్తుగా సుశీల చచ్చిపోతే పిల్లల్ని పెంచటం ఎలా?

ఇలాంటి అనవసరమైన ఆలోచనలు కలిగించే బాధ. చిరాకే తప్ప వాటికి కారణం

తెలియటం లేదు రామారావుకి పరోక్షంగా తనని యింత నిస్సత్తువుకి, నిరాశకి దిగజార్చిన సాంఘిక పరిస్థితులు, అన్ని రకాలుగా కల్తీ అయి తనని వుక్కిరి బిక్కిరి చేస్తున్న ఆర్థిక వొత్తిడి... దాని అసలు స్వరూపం రామారావుకి తెలియవు. ఇలాంటి ఆలోచనలకి నరాల బలహీనత, శారీరకమైన నీరసమే కారణం అని సరిపెట్టుకుంటూ గడుపుతున్నాడు.

ఆఫీసు అలసట, ఆపైన మరో మూడు గంటల నిరుత్సాహాన్ని పోగేసుకుని రాత్రి తొమ్మిదవుతూండగా యిల్లు చేరాడు రామారావు

అంతవరకూ ఆతృతగా, ఓపిగ్గా మెళుకువగా కూచున్న రవి గుమ్మంలోనే అడిగాడు తండ్రిని. "నాన్నా యింగ్లీషు టెక్ట్స్ తెచ్చావా" అని.

"లేదురా, ఆ కొట్లో కూడా అయిపోయాయిట రేపు యిస్తానన్నాడు రేపు తెస్తా" అన్నాడు రామారావు లోపలికొస్తూ

రవికి కళ్ళమ్మట నీళ్ళు తిరిగాయి గుమ్మం దగ్గర్నించి లోపలిక్కూడా రావాలనిపించ లేదు. సాయంత్రం నుంచీ ఎదురు చూసినా తండ్రి పుస్తకం తేలేదు. అంతే తెలుస్తోంది రవికి. ఉక్రోషంగా వుంది.

"నిద్రపోకుండా వెర్రివెధవ సాయంత్రం నుంచీ ఎదురు చూస్తున్నాడు" అంది సుశీల నెమ్మదిగా.

"నన్నేం చావమంటావు చెప్పు.. అంతకీ మైలు నడచి చచ్చి చచ్చి వొచ్చాను. ఆ కొట్లోను అయిపోయాయి. అంతకుముందే అన్ని షాపులూ గాలించాను. వెధవ పుస్తకాలు .. వెధవ చదువు.." అన్నాడు విసుగ్గా అరుస్తూ.

సుశీల యింకేం మాట్లాడలేదు. భర్త విసుగు, నిస్సత్తువ తెలుసు... యిటూ ఏం మాట్లాడలేదు... అటు పసిమనసు .. కన్న కడుపు. . రవికీ ఏం చెప్పలేదు. గుమ్మందాకా వెళ్ళి రవిని దగ్గరికి తీసుకుంది. మాటలలో రవికి ఏం చెప్పలేకపోయినా ఆ తల్లి చేతులు రవి తలని, ముఖాన్ని ఓదార్పుగా తడిమాయి. అలా తడుముతుంటే రవి బుగ్గలమీద కన్నీటి తడి చురుక్కుమని మంటలా తగిలింది.

☆ ☆ ☆

వీపు మీద కేన్వాస్ బేగ్‌లోని పద్దెనిమిది నోట్స్‌లు, ఏడు టెక్ట్స్‌లు, టిఫిన్ డబ్బా, అన్నీ తొంభై కిలోల బరువులా వున్నాయి రవికి. స్కూలువేపు నడుస్తున్నాడన్న మిటేగానీ ఉత్సాహంగా లేదు.

"ఇంగ్లీషు టెక్ట్స్ లేదు. ఎలాగ?" అదే ఆలోచన. రాత్రి తండ్రి విసుగ్గా అరిచిన అరుపులు యింకా వినపడుతున్నట్టే వున్నాయి.

"మూడో క్లాసప్పుడు యిలా కాదు. టీచర్ బుక్స్‌లిస్ట్ యివ్వగానే వెంటనే అన్ని పుస్తకాలు కొనేశాడు నాన్నే. పైగా తనని కూడా బజారుకి తీసుకెళ్ళాడు, ఆరోజు హొటలు క్కూడా వెళ్ళారు. గులాబ్‌జాం, పూరీ తిన్నాడు తను... యిప్పుడే యీ గొడవంతా..."

పొద్దున్నే ఎనిమిదింటికి ఇంటి దగ్గర అన్నంతిని బైలుదేరతాడు రవి. తొమ్మిదింటికి

స్కూలు... స్కూలుకి నడక. పుస్తకాలమోత, మధ్యాహ్నం టిఫిన్ డబ్బా తిండి తిరిగి సాయంత్రం నాలుగున్నరకి యిల్లు. యింత శ్రమ. యీ చదువు వెనక ప్రయోజనం ఏమిటో చాలామందికి తెలియనట్టే రవికి తెలియదు తొమ్మిదేళ్ళ ఆ వయసులో ఆనందపట్టానికి ఎంత చిన్న విషయం చాలో, మధనపట్టానికి అంతకన్నా చిన్న కారణం చాలు.

ఇంగ్లీషు పుస్తకం గురించి టీచర్ రోజూ అడుగుతోంది. అంతకు ముందురోజు గట్టిగా వార్నింగ్ యిచ్చింది. ఆ పీరియడ్ అంతా క్లాసులో నిలబెట్టింది ఏ కొట్లో దొరుకుతుందో ఎడ్రస్ రాసిచ్చింది. మర్నాడు తప్పకుండా తెచ్చుకోమంది

ఆ పుస్తకం లేకుండా క్లాసుకి వెడుతున్నాడు. భయం మనసులో ముల్లులా కదుల్తోంది రవికి. మొదటి పీరియడే ఇంగ్లీషు క్లాసు. ప్రాణాలు బిగబట్టుకుని కూచున్నాడు రవి క్లాసులో అటెండెన్స్ పలికేటప్పుడే తడబడ్డాడు రవి భయపడుతున్న సమయం రానే వచ్చింది.

"టెక్స్ బుక్స్ లేనివాళ్ళు నిలబడండి" అంది సుజాత టీచర్ నెమ్మదిగా లేచాడు రవి రవితోపాటు మరో అయిదారుగురు లేచి నిలబడ్డారు.

"నిన్న అంతగా చెప్పినా యివాళ కూడా తెచ్చుకోలేదన్నమాట" అంది సుజాత టీచర్

ఎవరూ మాట్లాడలేదు.

"మీకు మాటలతో చెపితే లాభంలేదు" అంది. చేతిలో కేన్ వూపుతూ ముందుకి అడుగేసింది మొదటి పిల్లాడి చేతిమీద కేన్ ఛెళ్ళుమంది. రవి ఉలిక్కిపడ్డాడు. మరో నిముషం గడవకముందే రవి వొళ్ళు తిరిగి ఝల్లుమంది. మిగిలినవాళ్ళని టీచర్ కొడుతున్నంతసేపూ రవి భయం పెరుగుతూనే వుంది. చేతిలో బెత్తంతో వస్తున్న టీచర్ మీదకొస్తున్న పాములా కనిపించేసరికి కళ్ళప్పగించి చూస్తూ నిలబడ్డాడు.

టీచర్ చెప్పకుండా చేతులు చాచాడు. రాతకి పుస్తకాలు పట్టుకోటానికి యిబ్బందిగా వుంటుందేమోనని సుజాత టీచర్ రవి ఎడంచేతిమీద కొట్టింది. దెబ్బ "అమ్మా. ..!" అని అరవబోయి బాధని గొంతులోనే కుక్కేసుకున్నాడు రవి. బెత్తంతో పాటే ఎర్రగా బొబ్బెక్కింది రవి అరచెయ్యి. మరి కాస్సేపటికి కానీ దెబ్బ తగిలిన చోట మంట తెలియలేదు.

"రేపేనా తెచ్చుకోండి.. . లేకపోతే రెండు చేతులూ మంటెక్కుతాయి" అంది సుజాత టీచర్.

మండుతున్న చేతిని రాసుకుంటూ ఆరోజు ఆ పీరియడంతా నిలబడ్డాడు రవి

అంతకుముందు రోజుకన్నా ఆత్రంగా వెళ్ళాడు రామారావు బుక్‌షాప్‌కి రాత్రి సుశీలముందు, రవి ముందు అంత గట్టిగా విసుక్కున్నందుకు గిల్టీగా వుంది మనసులో రామారావుకి.

షాప్ చేరగానే "ఏమండి బుక్ యిస్తారా" అనడిగాడు గుర్తుకోసం చీటీ తీసి చూపిస్తూ.

"సారీ సార్. యివాళ సప్లై రాలేదు" అన్నాడు నిన్నటి మనిషే. నిన్న అతను మాట్లాడిన తీరుకి, యివాళ అతను మాట్లాడిన తీరుకి భేదం కనిపించింది రామారావుకి.

"పోనీ ఆ పక్కన అతనెవరిదగ్గరో బ్లాకులో దొరుకుతుందన్నారు... దొరుకుతుందా?" అన్నాడు.

"ఓయస్ దానికేముంది. అతని బిజినెస్సే అది – పది రూపాయలివ్వండి తెప్పిస్తా" అన్నాడు.

రామారావు అనుమానం తీరిపోయింది. బ్లాకులో కొంటే తప్ప పుస్తకం దొరకదని అర్థమై పోయింది

షాప్ అతను పుస్తకం యిస్తాడన్న నమ్మకంతో ఆరు రూపాయలే తెచ్చాడు అదీగాక చేతిలో డబ్బులేదు ఎవరి దగ్గరేనా అప్పు చెయ్యాలి.

చేసేదేం లేక వెనక్కి తిరిగాడు రామారావు. ఒక్క పుస్తకం ఆరు రూపాయల విలువ! తననీ, సుశీలనీ, రవినీ యింతగా మధనపెట్టటం గొప్ప అయోమయంగా అనిపించింది రామారావుకి. ఇంక చేసేదం కనిపించలేదు. మర్నాడు పది అప్పుచేసేనా తీసుకొచ్చి పుస్తకం బ్లాకులో కొనాలనుకున్నాడు.

రామారావు యిల్లు చేరేవరకు రవి నిద్రపోకపోయినా, నిన్నటిలా లోపలికి, బైటికి తిరుగుతూ యెదురు చూట్టంలేదు.

"రేపు తప్పకుండా తెస్తాను సుశీలా ఆ పుస్తకం. రవికి చెప్పు ఒక్కరోజు యెలాగేనా గడపమను" అని తండ్రి అంటున్న మాటలు రవీ విన్నాడు

☆ ☆ ☆

మామూలుగానే తెల్లారింది. రోజూలా మామూలుగానే తయ్యారై స్కూలుకి బైలుదేరాడు రవి. స్కూలుదాకా వెళ్ళేవరకూ మధనపడుతూనే వుంది ఆ చిన్న మనసు స్కూలు గేటుదాటి రెండడుగులు వేశాడు. వేసి మళ్ళీ వెనక్కి తిరిగి బైటికొచ్చాడు. పాములా కదిలే సుజాత టీచర్ కళ్ళముందు మెదిలింది. స్కూలుకి ఎదురుగా వున్న పార్క్‌లోకి వెళ్ళి పెద్ద చెట్టుకింద, ఒంటరితనమే తనకున్న తోడు అన్నట్టు కూచున్నాడు రవి. సాయంత్రం స్కూలు అయ్యేవరకు ఆ పార్క్‌లోనే వున్నాడు. ఏం తోచక కొంత, నిన్నటి దెబ్బకి బొబ్బెక్కిన చేతి మంటకి కొంత సాయంత్రంలోపు చాలాసార్లు అరచేతిని చూసుకున్నాడు

స్కూలు మానటానికి యిష్టపడని రవికి ఆరోజు స్కూలు మానేసినందుకు అంత బాధ అనిపించలేదు. కానీ సాయంత్రం యింటికి తిరిగి వస్తుంటే ఎప్పుడూ లేంది విసుగ్గా అనిపించింది రవికి.

☆ ☆ ☆

సెకండరీ గ్రేడ్ ట్రైనింగ్ పాసై ఎక్కడా సరైన వుద్యోగం దొరక్క, ఆ ప్రయివేటు స్కూల్లో నెలకి తొంభై రూపాయల జీతంతో తప్పనిసరిగా ఆ వుద్యోగం చేస్తున్న సుజాత

టీచర్కి విసుగ్గానే వుంది.

"ఒక్కడూ తిన్నగా పుస్తకాలేనా కొనుక్కుని ఏడవడు. చదువు చెప్పటం ఎలా..." అన్నంతవరకే సాగుతోంది సుజాత ఆలోచన. అంతకుమించి, ఆ స్కూలు గురించి, ఆ పిల్లల గురించీ ఆలోచిస్తే సుజాతకి విసుగ్గానే వుంటోంది.

☆ ☆ ☆

ఆఫీసు అవగానే మూడోరోజు కాళ్ళీడ్చుకుంటూ పుస్తకం కోసం వెడుతున్న రామారావుకి నిరుత్సాహంగానే వుంది

పెట్టిన రికార్డే తిరిగి పెట్టాల్సి వస్తోందని షాపతనికీ కొంచెం యిబ్బందిగా వున్నా, రామారావు వెళ్ళేటప్పటికి అతను యెవరికో పాతకదే చెపుతున్నాడు. ఆఖరి కాపీ అంతకుముందే అయిపోయిందని, కావాలంటే యెక్కువ ధరకి పక్క నుంచి తెప్పిస్తాననీ అంటున్నాడు.

రాత్రికి యింటికి వస్తూ రామారావు పుస్తకం తీసుకొచ్చాడు ఆరు రూపాయల పుస్తకం. పది రూపాయలుగా విలువ పెంచుకుంది తండ్రి యిచ్చిన ఆ పుస్తకాన్ని ఏదో తప్పు చేస్తున్న వాడిలాగే తలొంచుకొని నిరుత్సాహంగా అందుకున్నాడు రవి

తన తప్పేం లేకపోయినా రవి పసిమనసు పడ్డ బాధకి, ఆ చిన్న హృదయంలో చోటు చేసుకున్న నిరుత్సాహానికి మూలం వుంది. వీటిని అన్నింటినీ కమ్మేస్తున్న లోటూ వుంది. 'వ్యక్తులదే తప్పు' అన్న భ్రమ కలిగించే నేర్పుంది ఆ లోటుకి

# పొడవని పొద్దు

దేవరాజు మహారాజు

"ఓరి పోరడా ఇంక లేవవేందిరా" – తల్లి గొంతు కఠినంగా వినిపించేసరికి కళ్ళు తెరిచాడు పోశిగాడు. లెమ్మని అంతకు ముందు నుంచీ తల్లి చెబుతూనే వుంది. తల్లి గొంతూ, ఆమె నీళ్ళ గోళెం నింపుతున్న చప్పుడూ, గుడిసె ముందు నుండి గొర్రెజీవాలు అరుచుకుంటూ పోయిన చప్పుడూ, గుడిసె వెనుక 'జాలాటిబండ' దగ్గర కాకుల చప్పుడూ అన్నీ వినిపిస్తూనే వున్నాయి కాని మగతగా బద్దకంగా వుండడంవల్ల లేవాలనిపించడంలేదు లేవడం పశువుల్ని కొట్టుకుని పోవడం, దినమంతా ఎండలో తిరగడం... అదే పని. పనిలో కొత్తదనం లేదు పనిలో ఉత్సాహం లేదు. అందుకే లేవాలనిపించడం లేదు. విసిగిపోయి తల్లి కఠినంగా కేకేసేసరికి లేవక తప్పిందికాదు. చిరుగులు పట్టిన పాతచాప, సరిగా చుట్టొచ్చి చుట్టరాక చుట్టి గుడిసె వెనుక పెంటవైపు పరిగెత్తాడు. మూత్రం పోస్తూ నిలబడితే చెరువుకట్టమీద బెస్త ఎంకులు గాలాలు పట్టుకుని తండ్రితో పోతున్నాడు. ఎంకుల్ని పిలుద్దామనుకున్నాడు. కాని అల్లంత దూరంలో పోతున్న దొరోళ్ళ పశువులు కనిపించాయి. గుండెలో ధక్మంది. గుండెలో డప్పు చప్పుడు మొదలయ్యింది. గిరుక్కున వెనక్కి తిరిగి నీళ్ళ గోళెంలోని నీళ్ళు దోసిలితో తీసుకుని నోరు, కళ్ళు కడుక్కున్నట్టు చేసి గుడిసెలో కొచ్చాడు. తన 'గుతుకకట్టె' వెతికి తీసుకుని జిట్టిలాగు ఎగేసుకుంటూ గుడిసెలోంచి గులేరు రాయిలాగా బయటపడ్డాడు.

'ఇగో పోశిగా!" తల్లి పిలుపు వినిపించి ఆగి వెనక్కి తిరిగాడు. పాతగుడ్డలో కట్టిన రాతివెండి గిన్నె తల్లి ఎదురుగా తెచ్చింది. "మాపటిది బువ్వుంది కొంటవోరాదు" అంది. తల్లివైపు సరిగా చూడకుండానే గిన్నె అందుకుని మళ్ళీ అంత వేగంగా పరుగందుకున్నాడు. గుండెలో యింకా డప్పు మోగుతున్నట్టుగానే వుంది తాత ఎంత కొడతాడోనని –

'పోశిగా'! అని అందరూ పిలిచే పోశయ్యకు ఎనిమిదేళ్ళు నిండినయి నల్లగా పీలగా వుంటాడు. వాడికి ఊరు, ఊర్లోని మనుషులకన్నా, అడివి, అడివిలోని పశువులు, చేన్లు బాగా

పరిచయం. కొద్ది సంవత్సరాల క్రితందాకా "మీ అయ్యేడిరా" - అని ఎవరైనా అడిగితే కళ్ళు చిత్రంగా తిప్పి 'దేవున్తానికి పొయ్యిండు' - అని చెప్పేవాడు. ఎదుటివాళ్ళ కళ్ళు చెమ్మగిల్లేవి. రాను రాను వాడికేదో అర్థమై పోయింది అయ్య పేరెత్తగానే ముఖం మాడ్చుకుంటున్నాడు. అయ్యను తల్చుకుని అవ్వ ఏడుస్తున్నప్పుడు వాడి మనసునంతా ఎవరో తోడేస్తున్నట్లయ్యేది అవ్వ ఏడుస్తూ ఏడుస్తూ వూళ్ళోని దొరల్ని పటేళ్ళను తిడుతూ వుండేది. శపిస్తూ వుండేది. వాడికవేమీ అర్థం కాకుండేవి. తన తండ్రిని వాళ్ళేం చేసారో తెలిసేది కాదు. ఒకసారి తల్లినడిగితే ఒళ్ళోకి లాక్కుని తల నిమురుతూ బిగ్గరగా ఏడ్చింది. పోశయ్యకు భయమేసింది.

వాడి గుండెలో డప్పు మోత యింకా ఎక్కువైంది. 'తాతతోని గుద్దులు తప్పవ్' అనుకుని మొస దీసుకుంటూ వాగుదాకా పరిగెత్తాడు. అక్కడే తాత ఎవరితోనో మాట్లాడుతూ వున్నాడు. వంగి దండాలు పెడుతూ వున్నాడు ఆ మాట్లాడే అతన్ని తనెప్పుడూ చూళ్ళేదు. ఎర్రగా బొద్దుగా బావున్నాడు. తాతకన్నా చాలా చిన్నవాడు. అంత చిన్నోనికి తాత దండాలెందుకు పెడుతున్నాడో అర్థం కాలేదు. తాత తనను చూసాడు. తన గుండె వూగులాడినట్లయ్యింది. ఆలస్యంగా వచ్చినందుకు తిట్లు తప్పవ్ అని లోలన వణికిపోతున్నాడు తాత ఏ ఆలోచనల్లో ఉన్నాడో - తిట్టలేదు. "గింత పొద్దెక్కదాక పంటావుర పోరడ" - అని "ఇగ జూడు పట్నం లుండేటి శిన్నదొర కూడ ఎంత పొద్దాల లేసిండో" అని అతన్ని చూపించాడు. "ఆ - సర్ సర్రబోయి పచ్చ బంగ్లోల్లయి బర్లు గొట్కరాపో" - అని పురమాయించాడు. పోశయ్య ఊరివైపు పరిగెత్తాడు కొద్దిసేపటి తార్వత "అమ్మా బల్రు గొట్క పోనొచ్చిన" - అని పసుపురంగు బంగళాముందు నిలబడ్డాడు. ఇంటివాళ్ళబ్బాయి వచ్చాడు. స్కూలు యూనిఫాంలో చక్కగా తయారయి వున్నాడు. వెంట్రుకలు నున్నగా దువ్వుకుని వున్నాడు కాళ్ళకు తెల్లమేజోళ్ళు, నల్లజోళ్ళు... అందంగా వున్నాడు. పోశయ్య అలా చూస్తూ నిలబడ్డాడు. తనకు కూడా అలా తయారవ్వాలని కోరిక. బడికిపోయి చదువుకోవాలని కోరిక... తన కంటే చిన్నవాడే యింటివాళ్ళబ్బాయి. అయినా సరే పేరుపెట్టి పిలవొద్దట. 'శిన్నయ్యగారో'- అని పిలవాలట.

యింటి వాళ్ళబ్బాయి చిలిపిగా నవ్వి - "ఇదిగో నాకు రాస్కోవడానికేమో మా డాడీ యిచ్చారు" - అని పొడుగాటి వస్తువు చూపించాడు. పోశిగాడికి అర్థం కాలేదు. "ఏందది? సూపెట్టవా" - అని ప్రాధేయ పూర్వకంగా అడిగాడు.

"ఊ, నీకివ్వను - ఎవరికీ యివ్వొద్దంది మా మమ్మి"

"ఇదీ బాల్‌పెన్. ఇలా ప్రెస్ చేసి రాస్కోవాలి" - అని యింటి వాళ్ళబ్బాయి గోడమీద రాసాడు. నిజంగానే గోడమీద నీలి నీలి గీతలు కనిపించాయి. పోశయ్య కళ్ళు మెరిసాయి.

"ఏం రాశినవ్ ఆడ"

"ఫోర్ ట్వెన్‌టీ" అని రాసి. నువ్వే 420" బొలబొలా నవ్వాడు యింటి వాళ్ళబ్బాయి. పోశయ్యకు ఏమంటున్నాడో అర్థం కాలేదు. తను చదువుకుంటే తనకూ అర్థం అయ్యేది.

ఒక్కసారి ఆ పెన్ను చూద్దామనిపించింది. తను అరుగుకింద నిలబడ్డాడు. యింటి వాళ్ళబ్బాయి అరుగుమీద నిలబడ్డాడు.

"ఒక్కసారి ఉట్టిగనే సూసిస్త"... అన్నాడు పోశయ్య. యింటివాళ్ళబ్బాయి "నో" – అని పెదాలు బిగించి, చేతుల్లో పెన్ను దాచుకుని తల అడ్డంగా తిప్పాడు. పోశయ్య దగ్గరకెళ్లి చూద్దామనుకుని కట్టె ఆసరాతో అరుగెక్కాడు. అది ఊహించని యింటి వాళ్ళబ్బాయి 'మమ్మీ"..  అని యింట్లోకి పరిగెత్తాడు.

"ఏమిట్రా సీను ఏమైంది?" యింటావిడ పరిగెత్తుకొచ్చింది. సీను పోశయ్యను చూపించాడు. "పోశిగా బాబును బయపెడుతున్నావ్... తప్పుగాదూ.... అట్ల దిరిగి దొడ్లెకు రాపో. బర్లకు కుడితి తాపించి కొట్కపోదువుగని....

"బయపెట్లేదమ్మా – గది పెన్నంట! సూశిస్తనన్న గంతె"

"చదువు రానోనివి నీకవెందుకూ ఫోఫో దొడ్లోకి ఫో" అమ్మగారు తనను తిట్టకుండానే తిడుతున్నట్లనిపించింది. సదువుకుంటే మంచి బట్టలు, పెన్నులు వస్తాయా? ఆలచనలతో పోశిగాడు దొడ్లోకి వెళ్ళాడు. దొడ్ల బర్రెలను విడుస్తుండగ అమ్మగారొచ్చి "సాయంత్రం వొచ్చినప్పుడు పైసలిస్తగని, బర్రెలను బాగ కడుక్కునిరా ఏమంటున్న?" అంది. పోశిగాడు "ఆ" అన్నాడు వెనకనే శ్రీనివాసొచ్చాడు "మమ్మీ నేను స్కూలుకెళ్ళను ఫో" అన్నాడు బుంగమూతితో "ఏం ఏమైయ్యింది?"

"బాలల సంవత్సరం మీద వ్యాసం రాసిమ్మంటే డాడి ఎందుకు రాయలేదు? ఆ పోను ఫో" మళ్ళీ అదే బుంగమూతి.. బాలల సంవత్సరమేమిటో, వ్యాసమేమిటో పోశయ్యకు అర్థం కాలేదు, ఆశ్చర్యంగా చూశాడు. యింటావిడ సీనూను లోనికి లాక్కెళ్లింది. బర్రెలు కొట్టుకుని పోశిగాడు వీధిలో పడ్డాడు. వాగుదాకా వచ్చేసరికి తాతలేడు. వాగు దాటి కంచెవైపు పోతూ కనిపించాడు పోశయ్య గేదెల్ని పరిగెత్తించాడు కంచె చేరేసరికి తాత చుట్ట తాగుతూ రాయి మీద కూర్చున్నాడు.

వస్తున్నావ్...నీపోరని తల్యాలి... ఎటుబోతే అటే బోతవేంద్రా లంజకొడ్కా" తిడుతూ రెండు దమ్ములాగాడు తాత.. "అగో–పో–గా ఆవుల మల్పిరాపో" ఆదేశించాడు. పోశిగాడు రెండు నిమిషాల్లో తిరిగొచ్చాడు, వాడి మనసులో సందేహం మెర మెర మంటోంది.

"తాత–"

"ఆ" – తాత నోట్లోంచి, ముక్కులోంచి పొగ.

"గప్పుడు వాగుకాడ గా పిలగాడెవలే"

"ఒశీనీయక్క – పిలగాడంట వేంద్రా?

కళ్ళుపోతయి. మన చిన్నదొర. ఆయిన కాడ జీతముండుకుంట పిలగాడంటవు కొడ్క. తప్పుకాదు. మన దొరోరి చిన్న కొడుక్కు. పట్నంలుంటడు. పెద్ద సద్వులు సద్వినోల్లయిరి".

"దొరకన్న మంచిగున్నడు గాదె" సదువుకుంటే ఎరుపురంగు' అందం, ఆకర్షణ

కూడా వస్తాయేమోనని పోశయ్య అపోహ- ఆశ!

"అవ్ మల్ల-ఎవలికొడుక్క? దొరకొడ్కేనాయె - దొర లేకుండె వొయిసులున్నప్పుడు?.....మన పెద్దొర గీశిన్న దొరంతున్నప్పుడు నేను నీయంతుంటి గీన్నే పసుల గాస్తుంటి"

పోశయ్య మనసులో డప్పు చప్పుడు మళ్లీ మొదలయ్యింది యిన్నేండ్ల నుండి తాతకు యిదే పనా?

"యిన్నేండ్ల నంది పసులే గాస్తున్నవా". .

తాత బిగ్గరగా నవ్వాడు. పసులంటే నిన్నియ్యాల పెద్దమనిషి నయ్యిన్నని మల్ల పసులకాడి కొస్తాన అంతకుముందు మోటగొట్టిన, భూమి దున్నిన కుప్ప గొట్టిన అన్ని-పతొక్కపని చేసిన. " తాత ఉత్సాహంగా గతాన్ని నెమరేసుకున్నాడు పోశయ్యకు మాత్రం ఉత్సాహంగా లేదు. కొద్దిసేపు వూరుకుని - భయం భయంగా పోశిగాడు "తాత-బడికి తోలమని మా అమ్మ నడుగుతనే".

తాత ఉత్సాహం ఒక్కసారి కడిగేసినట్లయింది తుపుక్కుమని ఊసాడు "సీ బత్కు పాడుగాను ఏం బుద్ధి పుట్టిందిర పోరడనీకు? మంచిగ దొరతా నుండక తాబేదారువై తవా? తాలుక్ దారు వై తవా? ఎన్కటికి మీ నాయిన దొరతాన తీసుకున్న రెండొందలు ఎవలు తీర్చాలనుకున్నవే దొంగకాన?" తాత హేళనచేశాడు

తాత మాటల్లోని అంతరార్థం కొంత మాత్రమే అర్థమయింది. చదువొద్దన్నందుకు దుఃఖం లోపలినుండి తన్నుకొస్తోంది. బడికి పోతే మంచిగా నీడలో కూచోవచ్చు మంచి బట్టలేసుకోవచ్చు. ఏ-ఫర్ ఏపిల్ చదుకోవచ్చు ఆడుకోవచ్చు గంట కొట్టగానే యింటికెళ్లిపోవచ్చు. ఇవన్నీ తనకు శేఖర్ చెప్పాడు. శేఖర్ హెడ్మాస్టర్ కొడుకు. తనతో బాగా మాట్లాడుతాడు. బడికిపోతే శేఖరం లాగానో, చిన్నదొరలాగానో, సీనులాగానో వుండొచ్చునేమో. ఎన్నో ఆలోచనలు పోశయ్య మెదడును మేస్తున్నాయి.

"అరెరె-ఓరి పిల్లగా గట్ల సూస్తవేందిర? పసురాల్వోయి శేన్లు మేస్తుంటే?"- తాత కేక వినిపించేసరికి. పసువులు పక్కనేవున్న వరి చేన్లోకి దిగాయి లేచిపరిగెత్తాడు. పొలంమీద పరిగెడుతుంటె తడి కాళ్ళకు బురదలోవున్న తుమ్మముల్లు గుచ్చుకుంది. "అమ్మా"- అనికేకేసి, ఏడ్చి దగ్గర ఎవరూ లేరు కాబట్టి తానే నిదానంగా తీసేసుకుని కుంటుకుంటూ పరిగెత్తి పశువుల్ని కొట్టుకొచ్చాడు.

పోశిగాడు బండపైకి వచ్చేసరికి తాతలేడు. బావివైపు వెళుతున్నాడు దూరంగా కనిపించాడు. తాత బావివైపు పోతున్నాడంటే మధ్యాహ్నం తిండి తినే సమయమైందన్నమాట పశువుల్ని అన్నీ చూసుకున్నాడు. పంటకాలవలో ముఖం కడుక్కున్నాడు. చుట్టూ చూశాడు. దూరంగా మైనం బావివద్ద పటేలోళ్ళు నారతో తాళ్ళు పేనుకుంటున్నారు. తాడి చెట్లనుండి గౌండ్ల లక్ష్మయ్య వస్తున్నాడు. వెనక అతని భార్య కల్లుకుండతో అనుసరిస్తోంది. కాలువలోని నీళ్ళు కళవెళ శబ్దం చేస్తున్నాయి చిన్న దుడ్డెలు (దూడలు) 'అంబా' అని తల్లి వెనకే నడుస్తున్నాయి. సూర్యుడు నెత్తిమీది కొచ్చాడు. పోశయ్య

కడుపులో ఆకలి తీవ్రమైంది. రెండ్రోజులుగా తనొక్కడే కంచెలో పశువుల్ని మేపాల్సి వస్తోంది.... మైసయ్య, యాదగిరి లేనందువల్ల ఏదో వెలితిగా, వెతుక్కున్నట్టుగా వుంది. వాళ్ళున్నప్పుడు ముగ్గురు కలిసి 'బువ్వ' తినేవారు యాదగిరి పెద్దవాడు. పదాలు పాడేవాడు. కొద్దిరోజులు బడికి వెళ్ళాడు. అందుకని అ ఆ ఇ ఈలు రాయగలడు. అప్పుడప్పుడు బొగ్గుతో బండలమీద రాసి, పోశయ్యను, మైసయ్యను ఆశ్చర్యంలో ముంచేవాడు. దొర యింటి ముందుగోడ కూలిపోతే కడుతున్నారు. వాళ్లిద్దరు కూడా ఆ పనిలోనే వున్నారు. అన్ని పశువుల్ని పోశయ్యొక్కడే కాయాల్సొస్తుంది. తాత సహాయంగా వున్నట్టేకాని, అస్తమానం చుట్టుపక్కలున్న బావులవద్దకు వెళ్ళి వాళ్ళతో బాతాఖానీ వేస్తుంటాడు

పోశయ్యకు ఆకలి తీవ్రమైంది. గుడ్డలో కట్టిన గిన్నె విప్పుకున్నాడు, నాలుగు బుక్కలు పెట్టుకునేసరికి మైసంబాయి పటేలు కూతేసాడు. "ఎవలు ఎవలు ఎవల్రో..... పసులు ఒరిశేన్ల బడ్డయి, ఒరిశేన్ల బడ్డయోయ్.... ఓరి పిలగా" – వినబడడంతోటే పోశయ్య ఎడంచేత్తో కట్టెలందుకుని పరుగు లంకించుకున్నాడు. ముల్లు విరిగిన కాలు పరుగెత్తనీయలేదు. కుంటుతూనే పరిగెత్తాడు. కోపంకొద్దీ వరిచేన్లో పడ్డ పశువుల్ని కొట్టాడు. నీ యక్క.... నీ యవ్వ..... బూతులు తిట్టాడు. పోశయ్య అలికిడి వినగానే పశువులన్నీ బుద్ధిగా దూరంగా పరిగెత్తాయి మళ్ళీ పోశయ్య బండమీదికి చేరుకునేసరికి కాకులు కావు కావు మంటూ పోశయ్య గిన్నెలోని అన్నం తింటున్నాయి. పోశయ్య కట్టె విసిరాడు. కాకు లెగిరిపొయ్యాయి. అన్నం ఒకంత బండమీద పడింది. ఒక్కక్షణం ఆలోచించాడు. ఆకలి బాగా మండిపోతూంది. బండమీది అన్నం ఇసిక లేకుండా దులపుకుని, తీసుకుని గిన్నెలలో వేసుకున్నాడు. తన నోటిదగ్గరి బుక్కలాక్కునే కాకులు తన చుట్టూ ఎన్ని వున్నాయో పోశిగాడికి యింకా అర్థం కాలేదు.

అన్నం తిన్నాడుగాని సరిపోలేదు. ఆకలి తగ్గిందికాని పూర్తిగా తీరలేదు. కడుపునిండా నీళ్ళు తాగాడు. గిన్నె కడిగాడు. పచ్చ బంగళా ఆవిడ చెప్పిన పని జ్ఞాపకానికొచ్చింది. బర్రెలను కడగడానికి ఉపక్రమించాడు. ఆ అమ్మ పైసలిస్తానంది. దొర పశువులతోపాటు అయ్యగారి పశువులు, పచ్చబంగళావాళ్ళ పశువులు కూడా కలుస్తాయి. దొరకు వాళ్ళకు ఏం సంబంధమో మరి? పోశయ్యకు తెలియదు. తాత కాయమని చెప్పున్నాడు. తను కాస్తున్నాడు. ఏమైతేనేం బర్రెలను కడుక్కొని తీసుకుపోతే పైసలిస్తానంది. పైసలతో బలపాలు కొనుక్కవచ్చు. యాదగిరి రాగానే అఆలు నేర్చుకోవచ్చు. అఆలు వస్తే బళ్ళోకి రానిస్తారేమో – ఏమో యాదగిరి నడగాలి.

సూర్యుడు కొండలమీదికి దిగిపోతున్నాడు. దుమ్ము లేపుకుంటూ చిన్న మోటరు వూళ్ళోకి పోయింది. "దొరయాడికో పొయ్యొస్తున్నట్లున్నది" – అనుకున్నాడు పోశయ్య. పశువుల్ని కొట్టుకొచ్చి, ఊరివైపు దారి మళ్ళించాడు. కడిగిన బర్రెలు నల్లగా శుభ్రంగా ఉన్నాయ్. వాటిలో ఓ బర్రెమీదికెక్కాడు. బర్రె బెదిరి పరిగెత్తడం మొదలుపెట్టింది. 'చ్చో చ్చో చ్చో' – అని దాని మెడ నిమిరాడు. పశువు నిదానించింది. ఎప్పుడో యాదగిరి పాడిన

పాట పల్లవి జ్ఞాపకానికొచ్చింది. "నందామయ గురుడ నందామయా, తందాన పాటలే విందామయా" పదిసార్లు పాడాడు. ఆ తరువాత ఏదీ జ్ఞాపకం రాలేదు. పాడడం మానుకున్నాడు. ఊరు దగ్గరికి రాగానే బర్రెమీది నుంచి గెంతాడు.

దొర దొడ్లో పశువుల్ని విడిచి, కుడితి తాగించి, గడ్డి వేసి అయ్యవారింట్లో, పచ్చబంగళాలో వాళ్ళవాళ్ళ పశువుల్ని తోలి తిరిగొచ్చేటప్పుడు బంగళా ముందు నిలబడి కూతేసాడు.

"అమ్మగారో....: బల్ద్ర గడిగిన"

అమ్మగారు బయటకొచ్చి చూసి, నవ్వుకుంటూ పోయింది పావుగంట తర్వాత వచ్చి, ఇరవై పైసలిచ్చింది అమ్మగారు అన్ని పైసలిస్తుందనుకోలేదు ఎగిరి గంతేసే అంత పనైంది. అమ్మగారు లోనికి పోగానే పోశిగాడు అంతపని చేశాడు. నాలుగుసార్లు చూసుకుని ఇరవై పైసలు గుప్పిట్లో బిగ్గరగా పట్టుకున్నాడు, నడుస్తున్నాడు పోతూ పోతూ చెంగు చెంగున ఎగిరి గంతేస్తున్నాడు గుడిసెకు పోతూ వుంటే రచ్చబండ దగ్గర పంచాయతీ ఆఫీసు రేడియోలో పాట వస్తోంది

"ఈ బాలురు రేపటి పౌరులు

దేశపు వాకిట జ్యోతులు" పోశయ్య రేడియోలో చాలా విషయాలు విన్నాడు. కాని ఎప్పుడు ఏదీ సరిగా అర్థం కాలేదు. ఈ పాట కొద్దిగా అర్థమయ్యేట్లుగానే అనిపించింది. కాని గుప్పెట్లో పైసల సంతోషం నిలువనీయలేదు గుడిసె వైపు పరిగెత్తాడు.

గుడిసె చేరేసరికి చిమ్మని చీకటైంది. గుడిసెలో రోజులాగే దీపం మినుకు మినుకు మంటోంది. తల్లి కూలిపని నుండి అప్పుడే తిరిగొచ్చినట్లుంది నీళ్ళ గోళం దగ్గర చేతులు ముఖం కడుక్కుంటోంది. తల్లి దగ్గరికి పరిగెత్తిపోయి "అవ్వా యిగో" – అని పిడికిలి చూపాడు. తల్లి ముఖం చిన్నగా వెలిగింది "ఏందిర పోశాలు"– అడిగింది

"పైసల్"

"యాడివి"

"బల్ద్ర గడిగిన. అమ్మగారిచ్చింది – ఇగో" పిడికిలి విప్పి చూపించాడు. ఐదుపైసల బిళ్ళలు నాలుగు కనిపించాయి. తల్లి ముఖంలో కొంత స్థిమితం ప్రశాంతత కనిపించింది.

"నేనదే చూస్తాన. చేతిలొక్క పైస లేదు. కూల్లేమో పడకపాయె. ఇగతె. దుక్నంమీదికి పోతాన కారం అగ్గింత ఉప్పన్న కొన్కస్త." పోశాలుకు భయమైంది. మనసులో డప్పుమోగినట్లు. తను యిరవై పైసలతో బలపాలు కొనుక్కుందామనుకున్నాడు.

"ఆ–పో నే బల్పాలు కొనుక్కుంట"

"బల్పాలా?" – వినకూడనిది విన్నట్లు ఆశ్చర్యం ప్రకటించింది.

"నీ రాతకు గదోటి తక్వయినాది యిట్తే" అని చేతుల్లోంచి పైసలు లాక్కుని గుడిసె బయటపడింది తల్లి విసుక్కుంటూ – పోశాలుకు ఏడుపొచ్చింది. కసి, కోపం అసహ్యం ఏదో ఏమిటో తనకే సరిగా అర్థంకాదు. కాని మనసు ఉడికిపోతోంది. ఏడ్చి ఏడ్చి గుంజకు జారగిలబడ్డాడు ముక్కు ఎగేస్తూ ఏడ్చాడు. తల్లి వచ్చిన అలికిడయింది,

ఏడుస్తున్నందుకు తిడుతుందేమోనని నిశ్శబ్దంగా నేలమీదికి ఒరిగాడు. కుమిలి కుమిలి ఏడ్చాడు. నిద్ర పట్టేసింది. ఎంత సేపయ్యిందో ఎంత రాత్రయ్యిందో తెలియదు.

తల్లి లేపి కళ్ళు తుడిచి పొయ్యిదాకా తీసుకుపోయింది. గిన్నెలో వేడి వేడి గంజి, ఇన్ని మెతుకులూ కనిపించాయి పోశయ్యకు తినాలనిపించలేదు. లేవబొయ్యాడు – తల్లి పట్టుకుని కూచోబెట్టింది.

"మా నాయిన గాదు. బంగారి కొండగాదు. గట్లేడుస్తారు బిడ్డ. కళ్ళు జూడు ఎంతెర్రగయినయో – మీ నాయిన వుంటే మనకు గిన్ని కష్టాలెందుకు బిడ్డ?" – వేడి వేడి గంజి నోటి దగ్గర పెట్టింది తల నిమిరింది పోశయ్య నోరు తెరిచాడు. లోన ఆకలి కాలిపోతోంది రెండు బుక్కలు మింగాడు.

"సద్వులు సద్వి రాజ్యాలేలే రాతలు మనకేడివి బిడ్డ? కూటికి లేనోల్లం. కూడు గుడ్డ వున్నోల్లకు ఆ సద్వులు. మిద్దెలు, బంగ్లలునోల్లకు ఆ సద్వులు. మనకేడైతది కొడ్కా . . మీ నాయిన అనకపొయ్యేది, నిన్ను సద్విచ్చి దొరబిడ్డను జేస్తనని – ఏది? నిన్ను నన్ను ఈ నర్కూపం లిడిశిపెట్టి – ఆ పుణ్యాతంద్రి మాయెమాయె" తల్లి కండ్లొత్తుకుంటూ గంజి తాగించింది. కడుపులో వేడి వేడి గంజి వెచ్చగా అనిపించింది. నీళ్ళతో మూతికూడా తల్లే తుడిచింది. పోశాలు లేచివచ్చి, తన పాత చింకిచాప పరుచుకున్నాడు. రచ్చబండ వద్ద వీధి నాటకం ఆడుతున్న చప్పుడు......

"గల్ గల్ మని భుజకీర్తులు అదరగ
గల్ గల్ మని భుజకీర్తులు అదరగ"

గుడిసెముందు కుక్క ఏడుస్తున్న చప్పుడు. గుడిసె వెనక నీళ్ళగోళెం వద్ద తల్లి కుండలు కడుగుతున్న చప్పుడు ... వినిపిస్తోంది. పోశయ్యకు నిద్ర ఎగిరిపొయ్యింది. అంతా చీకటి గుంజకు మాత్రం చిన్న దీపం మినుకు మినుకుమంటోంది. ఎర్రగా మండుతోంది పోశిగానిలో బలీయమైన కోర్కె సజీవంగా మండుతోంది. వాడు బడికి పోదామనుకున్నాడు. కాని తిండి వున్నోళ్ళకే చదువు అని తల్లి చెప్పింది. తనకు, మైసయ్యకు యాదగిరికి తాతకు తిండి సరిగా ఎందుకుండదు? గుడిసెలు, గుడ్డి దీపాలు తమకెందుకున్నాయి? పచ్చ బంగళాలో వుండే సీను, వాగు దగ్గర తాతతో మాట్లాడిన శిన్నదొర, మాటి మాటికి కళ్ళలో కనిపిస్తున్నారు.

ఆ తరువాత చాలా రోజులుగా పోశిగాడు ఆలోచిస్తూ పడుకుంటున్నాడు. మండే దీపాన్ని తదేకంగా చూస్తుంటాడు. ఏదో ధైర్యం కలుగుతోంది. పొడిచే పొద్దుకోసం ఎదురు చూస్తాడు. బళ్ళో చదువుకునే చదువుకన్నా, బతుకు నేర్పే చదువు గొప్పదని వాడికి కొద్ది కొద్దిగా అర్థమౌతోంది.

వాడికింకా చాలా విషయాలు అర్థం కావడం లేదు. కాని ప్రశ్నలు తలెత్తుతున్నాయి. వాడి వయసుతో పాటు అవీ పెరుగుతున్నాయి.

*సెప్టెంబర్, 1981*
*జ్యోతి మాస పత్రిక*

# చదువు కన్ను

## సదానంద శారద

ఆ ఊరికి రోడ్డు లేదు

అందులో వింత లేదు. భారతదేశంలోని అనేక గ్రామాలు రోడ్డు సౌకర్యాలకు, సౌకర్యాలకు దూరంగా ఉన్నాయి ఆసుపత్రులు కనిపించవు. బడులు కనిపించవు. నిరక్షరాస్యత కనిపిస్తుంది. దారిద్ర్యం కనిపిస్తుంది అమాయకత్వం కనిపిస్తుంది అందుకోసమే అక్కడక్కడా ఉన్న ఏకోపాధ్యాయ పాఠశాలల్ని ఎత్తి వేస్తున్నారు!

ఆ ఊరికి ప్రత్యేకంగా పోస్టాఫీస్ అంటూ లేదు ఎక్కడో రెండు మూడు గ్రామాల అవతల ఓ చెట్టుకు ఎర్రడబ్బా తగిలించుకొని ఓ పోస్టాఫీస్ ఉంది.

చుట్టుప్రక్కల గ్రామాలకు వచ్చే ఉత్తరాలను అందుకొని సైకిల్ మీదో, కాలి నడకనో తపాలా బంట్రోతు బట్వాడా చేస్తుంటాడు. అతడు వచ్చి బొడ్రాయి దగ్గర నిల్చుంటే చూస్తున్న గ్రామస్థుల గుండెల్లో రాయి పడుతుంది – వారి ప్రాణాలు గుబగుబ లాడుతాయి ఎవరికొచ్చిందో ఉత్తరం?

ఉత్తరం వచ్చిందంటే ఉప్పెన వచ్చినంత భయపడతారు జనం!

ఇప్పటికీ పట్టణాల్లో టెలిగ్రాం వచ్చిందంటే హడలిపోయే జనం ఉన్నారు మరి!

భారతదేశంలో ఎనభై శాతం మంది పల్లెల్లో ఉన్నారని అంచనా – అందులో తొంభై శాతం మంది నిరక్షరాస్యులని మరో అంచనా. కోట్ల రూపాయలు ఖర్చుపెట్టి వేయించిన ఆ అంచనాలు తప్పు కావడానికి వీల్లేదు

అంచేత ఆ ఊరిలో తొంభై శాతం మంది చదువురానివారే!

చదువురాని కుటుంబాలకు ఉత్తరం వస్తే చదివించుకోడం ఒక సమస్య. పైగా చదివించుకునే దాకా ఆ ఉత్తరంలో ఏముందోనని భయం!

ఆపదలకు ఆత్మబంధువులైన ఆ పల్లెవాసులకు ఉత్తరం ఓ కొత్త ఆపద!

కొన్ని ఇండ్లలో చదువు వచ్చే వాళ్ళున్నారు. కాని వారి దృష్టిలో తక్కువ

కులంవాండ్ల ఉత్తరాలు చదవరు, రాయరు. ఉత్తరం పట్టుకొని దొరల వాడకు వెళ్తే డొక్క చీరేస్తారు

"కనకయ్య..... కనకయ్య...."

తపాలా బంట్రోతు పిలిచాడు.

కనకయ్య రైతు కూలి.

బెదురు బెదురుగా చూస్తూ... కర్రల్లాంటి కాళ్లను ఈడ్చుకుంటూ కనకయ్య వచ్చాడు

తపాలా బంట్రోతు కనకయ్యకు కార్డు ఇచ్చి వెళ్లిపోయాడు.

ఆ ఉత్తరాన్ని అటూ ఇటు తిప్పి చూశాడు కనకయ్య. అతనికి చదువురాదు అక్షరాలు తెలియవు. తెల్లకాగితం, ఉత్తరం అతనికి ఒకటే!

తపాలా బంట్రోతును పొరపాటున కూడా ఎవరూ ఉత్తరం చదవమని అడగరు అడిగితే అతని చూపులు కొరడాల్లా తాకుతాయి. తనకు వచ్చే జీతం ఉత్తరాలు తెచ్చి ఇచ్చేందుకే సరిపోదు ఇక మీకు ఉత్తరాలు చదివిపెట్టనా అని కసురుకుంటాడు. తనకు చదువు రానందుకు ఆ క్షణంలో ఎంతో విచారించాడు కనకయ్య. రెండు కళ్లుండి తాను ఆ ఉత్తరం చదువుకోలేని గుడ్డివాడే!

కనకయ్య భారంగా రెండు అడుగులు వేసి ఉత్తరాన్ని మరోసారి అటూ ఇటు తిప్పి చూశాడు. కూతురు దగ్గర్నించి వచ్చిందేమో! అల్లుడు పట్నంలో రిక్షా తొక్కుతాడు

ఉత్తరం రాయించిందంటే బిడ్డ ఎంత కష్టంలో ఉందోనని దిగులు పడ్డాడు కనకయ్య - అందులో ఒక పదం .. ఒక్క అక్షరం తెలిసినా బాగుండునని అనుకున్నాడు

అల్లుడే రాయించాడేమో! బిడ్డకు ప్రాణం ఎట్లున్నదో! కనకయ్య గుండెలవిసి పోయాయి. అతడు నిలువునా వణికిపోయాడు.

ఆ ఊరిలో 'కిష్టమూర్తి' ఒక్కడే - "అక్కడ నిల్చోరా " అని గడప అవతల మనిషిని నిలబెట్టి చాపమీద ముద్దుగా పద్మాసనం వేసుక్కూర్చొని... అద్దాలు పట్టు పంచెకు తుడిచి పెట్టుకొని చదువుతాడు.

కిష్టమూర్తి అలా ఉత్తరం చదువుతాడు గాని ఉత్తగా చదవడు. సోలెడు జొన్నలో.. వడ్లో కావాలి. ఉత్తరం చదవడానికి, జవాబు రాయడానికి కలిపి!

కనకయ్య దగ్గర సోల లేదు.

సోలెడు గింజలు లేవు.

రెండు రోజులుగా కూలి దొరకని దిగులు ఉంది.

ఒకటిన్నర రోజుల ఉపవాసం ఉంది.

షావుకారు శేషయ్యను సోలెడు గింజలు అప్పివ్వమని వేడుకున్నాడు కనకయ్య.

శేషయ్య గింజలు లేవన్నాడు.

అబద్ధం ఆడకపోతే పైకిపోలేం అనుకుంటారు కొందరు.

"రొండు రోజుల్ల నాగుతోటి తెచ్చి పెడ్త బాంచెను...." బతిమిలాడుకున్నాడు

కనకయ్య.

"లేవంటె ఇనపడ్తలేదురా. పో. ." కసురుకున్నాడు కనకయ్య.

గవుండ్ల లస్వమ్మ గింజలకు, పైసలకు కల్లు అమ్ముతుంది వడ్డీలకు పైసలు, నాగులకు గింజలు తిప్పుతుంది.

"ఓక్కా... జెర దయజూడు..." రెండు చేతులా పబ్బతిపట్టాడు కనకయ్య.

మొదట 'లేవురా' అంది. తరువాత ఇప్పుడు తీరిక లేదు అంది. రేపు రా అంది.

లస్వమ్మ చాలా ఖచ్చితమైన మనిషి – మాటంటె మాటే! కాని రేపటి దాకా ఆగేదెట్లా!

'ఆడ పట్నంల బిడ్డ ఎట్లున్నదో. ..' కనకయ్య పేగులు కొట్టుకున్నాయి ఉత్తరాన్ని చూస్తుంటే అతని కళ్లనిండా నీళ్లు తిరిగాయి. ఆ ఉత్తరంలో మొదలేదో చివరేదో తెలియదు అక్షరాలు, పిచ్చిగీతలు అతనికొక్కటే!

చదువొచ్చిన మనుషులు ఆ క్షణంలో దేవతల్లా కనిపించారు కనకయ్యకు

కిష్టమూర్తి దేవుడి దగ్గరికి సోలెడు గింజల ముడుపు తీసుకపోవాలి! ఎట్లా?

అదిరే గుండెతో, కూతురి మీద కొట్టుకునే పాణంతో మరోసారి శేషయ్యను బతిమిలాడేందుకు వెళ్ళాడు కనకయ్య –

"ఏందిరా మల్లొచ్చినవ్?" మొహమంతా చిట్లించుకొని అడిగాడు శేషయ్య

"అయ్యా! మీ కాళ్ళు మొక్కుతా"

"లెవ్వని చెప్తె నీక్కాదురా.. "

"ఏం పని చెప్పినా చేస్త బాంచెను ఒక్క సోలెడు గింజలు కొలువుండి...."

"పనా.. ." షావుకారి డబ్బు కళ్లు ఒకసారి దుకాణం గదిని, ధాన్యం గదిని, వంట గదిని.... దొడ్డిని చుట్టి వచ్చి...

"పనంటే . ఇప్పుడే పనుల్లేవు .. గా మూలకున్న మొద్దును కొట్టాలె. ." అన్నాడు వేపచెట్టు కింది మొద్దును చూపిస్తూ–

"జెర చిన్న చిన్నంగ పొయ్యిల పట్టేట్లు కొట్టు..."

అట్లనే బాంచెను...."

వంచిన నడుం ఎత్తకుండా ఆ మొద్దును కొట్టసాగాడు కనకయ్య –

కడుపులో ఆకలి మండుతోంది. బిడ్డపై పాణం కొట్టుకుంటోంది. అయినా గొడ్డలి ఆడుతోంది.

ఆ కర్రమొద్దును షావుకారి వంటగదికి అనువైన ఇంధనంగా మార్చి తలమీద రుమాలుతో చెమట తుడుచుకున్నాడు.

"కొట్టినావురా. జెరగా గోలెంల నీళ్లు చేదిపోయి నీకు గింజలు కొలుస్తా.." అన్నాడు షావుకారు.

గోలెం నిండా బావినీళ్లు చేదిపోశాడు కనకయ్య.

అప్పుడు షావుకారు శేషయ్య సోలెడు గింజలు కొలిచి మీది నుంచి కనకయ్యను

తాకినా... కనకయ్య పంచెను తాకినా మైలపడ్డానన్నంత మీది నుంచి కనకయ్య ఒడిలో పోశాడు.

ఆ గింజలు తీసుకొని కనకయ్య వెళ్ళేసరికి కిస్టమూర్తి ఇంటి తలుపులు మూసి ఉన్నాయి. కిస్టమూర్తి భోజనం చేస్తున్నాడన్న వార్త తెలిసింది.

మూసి ఉన్న తలుపులు తెరుచుకునే వరకు ఎదురు చూస్తూ నిల్చున్నాడు.

కొంతసేపటికి అతని నిరీక్షణ ఫలించి కిస్టమూర్తి ఇంటి తలుపులు తెరుచుకున్నాయి.

త్రేన్చుకుంటూ కిస్టమూర్తి వచ్చాడు.

రెండు చేతులూ జోడించాడు కనకయ్య.

"అక్కణ్నే ఉండు... ముందుకు రాకు..." కిస్టమూర్తి ఆ భావం అర్థమయేట్లు సైగ చేశాడు.

వాళ్లు ముందుకు వద్దామన్నా రానిచ్చేట్టు లేరు!!

గడపకు గజం దూరంలో కనకయ్యను నిల్చోబెట్టి గదిలో సిరిచాప మీద పద్మాసనంలో కూర్చున్నాడు కిస్టమూర్తి.

ఓ పుల్ల తీసుకొని కొంచెంసేపు పళ్లలో ఇరికిన భోజనం తాలూకు అవశేషాలను తొలగించుకున్నాడు.

ఆ తరువాత వచ్చిన పనేమిటన్నట్లు కళ్లతో సైగచేసి .. ఓ పళ్లెరాన్ని ముందుకు జరిపి "ఊ..." అన్నాడు. పక్కనే పంచాంగం ఉంది. పీట మీద రామాయణం, గీత ఉన్నాయి

ఆ పళ్లెరం ఎన్ని తరాల నుంచి ఆ ఇంటికి గింజలు సంపాదించి పెడ్తున్నదో –

ఆ పళ్లెరం దక్షిణ తీసుకున్నాక మరోసారి 'ఊ .' అన్నాడు కిస్టమూర్తి.

కనకయ్య నేల మీద ఉత్తరం పెట్టాడు.

కొంచెంసేపు ఆ ఉత్తరాన్ని చదివి.. తరువాత చిరునామా ఒకసారి చూసి.. తన ఖరీదైన నోరు విప్పాడు కిస్టమూర్తి –

"ఈ ఉత్తరం నీది కాదురా..."

ఉలిక్కిపడ్డాడు కనకయ్య.

"నా పేరే సదివి ఇచ్చిండుకాదు బాంచెను..." వినయంగా అన్నాడు

"నీ పేరున్నవాళ్లు ఊళ్లో ఇకలేరా? మీరు చొప్పదండోళ్లు కదూ?"

"ఔ. ..."

"ఇది చింతగట్టు కనకయ్యకు వచ్చిన ఉత్తరం..."

"అట్లనా బాంచెను...."

ఆ ఉత్తరం తనది కానందుకు ఒక విధంగా గుండె బరువు తగ్గినా..." అయ్యో బిడ్డ ఎట్లున్నదో... ఏ సంగతి తెలియక పాయె..." అని విచారించాడు.

ఉత్తరం తిరిగి ఇచ్చేశాడు కిస్టమూర్తి.

గింజలు తిరిగి ఇవ్వలేదు.

అదీ పరిస్థితి!

అదీ ఆ ఊరి స్థితి!

ఆ ఉత్తరం ఆ ఊరి కనకయ్యది కాకపోతేనేం షావుకారి పొయ్యికి కట్టెలు కొట్టించి ఇచ్చింది. గోలెం నిండా నీళ్లు నింపించి పెట్టింది

ఆ ఉత్తరం ఆ కనకయ్యది కాకపోతేనేం ... కిష్టమూర్తికి గింజలు సంపాదించి ఇచ్చింది.

తల వంచుకొని నడుస్తున్న కనకయ్యకు ఒక యువకుడు ఎదురుపడి

"నాకు ఒక గది అద్దెకు కావాలి తాతా?" అని అడిగాడు.

"ఎవలు కొడుకా . ఈ ఊళ్లె ఏం పని?" ఆ యువకున్ని అడిగాడు కనకయ్య

"పెద్దలకు అక్షరాలు నేర్పి, చదువు చెప్పేందుకు ఈ ఊరిలో రాత్రిపూట బడి నడపడానికి వచ్చాను తాతా–" అన్నాడు యువకుడు.

ఆ మాటలు వినడంతోటే కనకయ్య కళ్లలో కొత్త కాంతి కనిపించింది ఆ కుర్రాడు తనలాంటి 'గుడ్డి'వారికి చదువుకన్నును ఇవ్వడానికి వచ్చిన ఓ త[illegible]ఘువులా కనిపించాడు

# ఉప్పు సముద్రం

## వారాల కృష్ణమూర్తి

'. . నర్మద చాలా తెలివైన అమ్మాయి.

కాలేజీ మొత్తానికి తానొక్కతే ఫస్ట్‌క్లాస్‌లో పాసయింది ఇంటర్. మెడిసిన్ ఎన్‌ట్రన్స్‌కు ప్రిపేర్ కమ్మని చెప్పాలి! .' అని అనుకుంటుండగా.... "నమస్కారం మాస్టారూ!" అంటూ వచ్చింది నర్మద గదిలోనికి.

"నమస్కారం! ఏమ్మా బాగున్నావా!!" ఆప్యాయంగా అడిగాడు ప్రిన్సిపాల్ రాఘవరావ్. బాగున్నానంటూ తలాడించింది నర్మద.

"నీవు మెడిసిన్ ఎన్‌ట్రన్స్‌కు ప్రిపేర్ కావాలమ్మా.. నీకు తప్పకుండ సీటు వస్తుంది. బాగా చదివి పెద్ద డాక్టర్‌వి కావాలి.. " నర్మద వైపు చూశాడు. తను చెబుతుంది, శ్రద్ధగా వింటుంది నర్మద. కాసేపయాక "...ఇంతకూ నీకు చదవాలనుందా! మీ నాన్నగారు ఏమంటున్నారు?" అంటూ అనుమానంగా చూశాడు నర్మద వైపు.

"మా నాన్న చదువుతానంటే వద్దనడు. నాకూ చదవాలనే వుంది. మెడిసిన్‌లో చేరితే బావుంటుంది. మరి సీటు వస్తుందో, రాదో"

"సీటు గురించి ఆలోచించక బాగా చదువు ఎగ్జామ్ బాగా రాశావంటే సీటు తనంతతానే వస్తుంది నిన్ను వెతుక్కుంటూ!""

"అలాగే మాస్టారూ! మరి నేను శలవు తీసుకుంటాను" అంటూ చేతులు జోడించింది. రాఘవరావ్ "మంచిదమ్మా" అన్నాడు

నర్మద కష్టపడి చదివింది ఎన్‌ట్రన్స్‌కు. ఎగ్జామ్ అవగానే 'హమ్మయ్యా! ఎన్‌ట్రన్స్ టెస్ట్ అంటే ఇంతేనా! ఈమాత్రం దానికి హడలిపోయాను' అనుకుంటూ తేలిగ్గా ఊపిరి పీల్చుకుంది తనకు తప్పక యం.బి.బి.యస్.లో సీటు వస్తుందని మరే కాలేజీలోనూ చేరలేదు నర్మద.

నర్మద అనుకున్నట్టుగానే ఎన్‌ట్రన్స్ టెస్ట్‌లో పాసయింది ఇంటర్వ్యూకెళ్లింది.

ఇంటర్వ్యూలోనూ పాసయి ఫీజు కట్టి కాలేజీలో చేరింది.

నర్మద యం.బి.బి.యస్.లో చేరిందని తెలిసి తానే చేరినట్టు సంతోషించాడు రాఘవరావ్. తన స్టూడెంట్ డాక్టర్ అవబోతుంది. . అని అనుకున్నప్పుడు ఎంతో తృప్తిగా వుండేది. బాగా శ్రద్ధగా చదవమని ఓ ఉత్తరం వ్రాసి పోస్ట్ చేశాడు.

☆ ☆ ☆

"నమస్కారం మాస్టారూ!.. .."

ఎవరా వచ్చిందని తలెత్తి అనుకోకుండా వచ్చిన నర్మదను చూసి ఆశ్చర్యపోయాడు రాఘవరావ్

"ఏమిటి మాస్టారూ! అలా చూస్తున్నారు!!"

"ఏమీ లేదు! కూర్చోమ్మా!!" కుర్చీ చూపాడు. నర్మద రాఘవరావ్‌కు ఎదురుగా వున్న కుర్చీలో కూర్చుంది. "కులాసాగా వున్నావా? చదువెలా సాగుతుంది వెళ్ళి రెండు నెలలన్నా కాలేదు అప్పుడే వచ్చావ్ ఇంటిమీద బెంగా! ఇలా అయితే చదువు పాడవదూ. . అందునా డాక్టర్ కోర్సాయె. డాక్టర్‌కోర్స్ అంటే మాటలా! . " అంటూ అభిమానంతో చివాట్లు వేశాడు రాఘవరావ్.

నర్మద ఏమీ మాట్లాడకుండా తన హేండ్‌బాగ్ తెరిచి ఓ వెడ్డింగ్‌కార్డ్ తీసి రాఘవరావ్ చేతికి అందించింది ఎవరిదబ్బా అనుకుంటూ చూశాడు రాఘవరావ్ అందులో... సాగర్. . నర్మద అన్న పేర్లు చూసి తెల్లబోయి నర్మద వైపు చూశాడు.

"ఏం చైను మాస్టారూ! నాకైతే చదవాలనే వుంది కానీ మా నాన్న మళ్ళీ ఇలాంటి సంబంధం రాదంటున్నాడు. అమ్మకూడ బలవంతం చేస్తుంది ఆశల్ని చంపుకుని పరిస్థితులతో రాజీ పడడం కన్నా ఆడది ఏం చైగలుగుతుంది ." అంటూ తన అశక్తతను వెల్లడి చేసింది నర్మద.

"పెళ్ళయ్యాక చదవచ్చుగా!"

"లాభంలేదు మాస్టారు! వాళ్ళకిష్టం లేదట!!"

"ఇంతకూ అబ్బాయి ఏం చదివాడు?"

"చదువు అంతగా లేదు బోలెడు ఆస్తి వుంది. వ్యవసాయం చూసుకుంటూ వుంటారు..."

"మంచిదమ్మా!" నిట్టూర్చాడు రాఘవరావ్.

"మరి నే వస్తాను మాస్టారూ! మీరు పెళ్ళికి తప్పకుండ రావాలి!!" అంది నర్మద లేస్తూ. రాఘవరావ్ 'వస్తా'నన్నట్టు తల వూపాడు. నర్మద "నమస్తే!" అంటూ శలవు తీసుకుంది.

చాలాసేపు వరకు నర్మద వెళ్ళినవైపే చూస్తూ కూర్చున్నాడు ప్రిన్సిపాల్ రాఘవరావ్. నర్మద తెలివైంది. ఆమె విజ్ఞానానికి పెళ్ళి అడ్డుగోడగా నిలుస్తుంది.

ఈ దేశంలో ఎన్నో జీవనదులున్నాయి. అయినా మనకు నీటి కొరత వుంది.

కారణం ఆ జీవజలాల్ని మనం ఉపయోగించుకోలేక వృధాగా ఉప్పు సముద్రంలోనికి వదిలేస్తున్నాం! అలాగే స్త్రీల తెలివితేటల్ని విజ్ఞానాన్ని పూర్తిగా వినియోగించుకోలేక పెళ్ళి అనే తంతుతో వాళ్ళని సంసార సాగరంలో వదిలేస్తున్నాం... అనిపించింది రాఘవరావ్‌కు.

*మే 1977, జ్యోతి మాసపత్రిక*

# సిద్ధార్థుడు

## భూపాల్

పొద్దంతా ఎండ. బండలు కాగి తాకితే చుర్రుమంటున్నాయి. ఆ బండల నిండా అక్షరాలు. నల్లబండల మీద ఏదో ఆకు రసంతో, తెల్లబండల మీద బొగ్గుతో 'అ' నుండి 'హ' వరకు అక్షరాలు  నక్కల గుట్టమీద పుట్టి ఈమైనుగోన్ రాళ్ళగడ్డ కంచెగుండా పారే ఓడిక. ఓడిక ఎప్పుడో ఎండిపోయింది; నీటి వాలులా వున్న ఇసిక మీద అన్ని అక్షరాలే - అవి 'అ' నుండి 'హ' వరకే.

ప్రకృతి సెగలు కక్కుతోంది. వడగాలి. భరణికార్తెలో బండలు పగిలే ఎండలు. నవనీత్ రెడ్డి మనసు నిండా ఆ కంచెలో వెన్నెల విరపూసినట్టుంది  అతని వయస్సు పది దాటి వుండదు  ఎండని ఏమాత్రం లెక్కచేయక చాలారోజుల తర్వాత తన మిత్రుడు పశువుల గాసే యాదగిరిని చూస్తాననే సంతోషంతో ఆ ప్రాంతమంతా వెదుకుతున్నాడు  ముఖంలో గిరిని చూడాలన్న ఆతృత, మాట్లాడాలన్న కుతూహలం  పెద్దగుండు మీదికి ఎక్కి, కళ్ళు విశాలం చేసుకుని దూరదూరంగా చూపుల్ని సాగదీస్తూ 'గిరీ గిరీ' అని గట్టిగా పిలుస్తున్నాడు.

'మే' నెల మొదటి రోజులు. ఐదుగంటలకే వచ్చిన ఆ ఊరి పెద్ద పటేలు వీరభద్రారెడ్డి అల్లుని మారుతీకారులో నుండి దిగాడు నవనీత్. ఒక్క నిముషంలో ఇంట్లో అందర్నీ చూసి 'హలో గ్రాండ్.పా', 'హలో గ్రాండ్ మా' 'హలో ఆంటీ' అంటూ కనిపించినోళ్ళను పలకరించి తన మిత్రుడు గిరిని కలుసుకోను ఒక్క పరుగున కంచెకు వచ్చాడు

తెనుగోళ్ళ అంజయ్య కొడుకు గిరి. తండ్రీ కొడుకులిద్దరూ పెద్ద పటేలు జీతగాళ్ళే. ఈ పటేలు దగ్గరే అంజయ్య పదిహేను ఎండాకాలాలను మండించాడు.

తల్లిదండ్రులతో పట్నంలో వుండే నవనీత్ ఈ ఊరికి పండుగలకూ, పబ్బాలకొచ్చినా, ఇలా సెలవల్లో వచ్చినా గిరితో కలిసే తిరుగుతాడు. వచ్చిన మరుక్షణం నుంచి గిరి లేకుంటే ఎటూ తోచదు.

పట్నం దుస్తులు, ఫ్యాషన్లు, కొత్త ఆట వస్తువులు చూడాలని, ఇంగ్లీషు, హిందీ మాటలు వింటూ విమానం, రైలుబండి, సినిమాల కథల కోసం గిరి చెవి కోసుకుంటే – ఇక ఊరిలో గిరే తోడు కనుక చెట్టు గుట్టల వెంబడి, చెరువు బావు లెంబడి తిరిగి గిరి చెప్పే పక్షుల, జంతువుల కథలు వింటూ పచ్చి కందికాయ, పెసరికాయ ముంజలు, ఏ కాలానికి అవి తింటూ వున్న నాల్గురోజులు హాయిగా వుండొచ్చునని నవనీత్ ఆశ అందుకే తండ్రి వరదారెడ్డి ఎటూ వెళ్ళొద్దని మందలిస్తున్నా వినక కళ్ళు కప్పి దొంగచాటుగా ఈ మెనుగోమ్ రాళ్ళలోకి పరుగెత్తుకొచ్చి గిరిని పిలుస్తూ వెదుకుతున్నాడు. ఆ బండల మీద అక్షరాలన్నీ గిరి రాసినవేనని ఇతనికి తెలుసు.

రివ్వున వీస్తూ దుమ్మంత దోపుకొస్తున్న వేడిగాలి. గాలి వేగానికి పడిపోగలనేమోనని ప్యాంటు కొంచెం బిగువగున్నా కష్టపడి ఆ గుండు మీద అట్లే కూర్చున్నాడు నవనీత్ దూరంగా పశువులు కనిపిస్తున్నాయి. మనిషి జాడే లేదు. ఆ సమయంలో నవనీత్‌కి ఎదురుగా గాకుండా వెనక నుండి ఏ మాత్రం అలికిడి లేకుండా దగ్గరగా వచ్చాడు గిరి. కళ్ళు మూద్దామనుకున్నాడు కాని నవనీత తెల్లని పూలపూల షర్టు నలిగి నల్లగౌతుందని ఐనా ఇంత చనువు ఇస్తాడో లేదోనని గట్టిగా "ఎప్పుడొచ్చినవ్ పటేలా?" అని అడిగాడు.

ఎటో చూస్తున్న వాడల్లా ఒక్కసారే చెవి దగ్గర వినిపించిన శబ్దానికి ఉలిక్కిపడి "అబ్బ ఎంత భయపెట్నవ్‌రా!" అని తల తడుముకొని, తన వీపుతానే నరుసుకొని 'గంట నుండి పిలుస్తున్న, పసుల విడిసిపెట్టి ఏడికి పోయినవ్?" అడిగాడు నవనీత్ గిరి ఆకారం చూస్తూ.

చూపులెంత సూటివో ఆ గొంతు నుండి మాట అంతె గట్టిది. నవ్వు పువ్వై పూస్తుంటే ఆ పలువరుస తెల్లగా మెరుస్తుంది. ఆ జుత్తుకు నూనె ఎప్పుడూ రాసి వుండడు. చీకి పారేసిన మామిడి పీచులాగుంది. చమటతో తడిసిన ముఖమంతా జిడ్డు కారుతోంది. భుజమ్మీద చినిగిన జాకీ కమీజు ఎవ్వరు దానమిచ్చిందో మోకాళ్ళ వరకుంది. అసలు చెడ్డీ లేదేమో అనుకున్నాడు నవనీత్ కాని చెడ్డీ కింది పట్టి చిరిగి నల్లగా వేళ్ళాడుతోంది. కాళ్లకు టైరు చెప్పులు. ఒక చెప్పు వుంగటం తెగి వుంది. దానికి ఈత ఆకులు నమిలి తాడులా పేని ముడి వేశాడు.

"ఈ బండల మీదంత నువ్వే రాసినవ్ గదరా? నీ రాతకు ఈ బండలైనందుకు సరిపోతున్నయ్. ఇవ్వే నోట్‌బుక్స్ ఐతే ఓ లారీ నిండ గావాలె. ఎప్పుడూ ఎందుకింత పిచ్చి రాతలు? రాసిందే రాస్తవ్?"

"మీ తాత దగ్గర జీతం కుదురక మొదాలు నేను నేర్చిన సదువు ఇంతవరకే పటేలా అది మర్సిపోవద్దని ఎప్పుడూ రాస్తుంట. ఎన్నో ఏండ్ల సంది రాస్తున్న, వాన గొడితె ఈ రాసిందంత పోతది, మల్ల రాస్త"

"గిరి నీకేమో సదువు కొనాలనుంటది. నాకేమో నీ లెక్క ఆడుకోవాలనుంటది. సదుకునేది సానా కష్టం. సారు కొడ్తుంటడు. నిన్ను సదువుల పెడితే మల్ల నువ్వు ఈడికే ఉరికొస్తవు.

"ఈ పసుల గాసుడు ఆటలా పటేలా? ఇది జీతముండుడు మాకు పై సల్లేవు గని నీ లెక్క సదువు కొమ్మంటె బాగా సదువుకుంటుంటి. ఇగ ఎట్లైన నీ దసర దీపాలి లెక్కలు జేస్తడట పెద్ద పటేలు. మా అప్పు దీర్తది. మాకున్న ఎకరం శెల్క మీద బ్యాంకు కెల్ల లోను దీస్తడంట మా అయ్య. మా భూమి మేమే దున్నుకుంటం. అప్పుడు నేనిగ సాల్లెకు వోత"

"అరే! నువ్వు రాసుకుందుకు పల్క దెచ్చిన. నోట్‌బుక్, పెన్సిల్, మా చిన్నచెల్లె చదివిన తెలుగు పుస్తకం గూడ దెచ్చిన, రేపు నీకిస్త."

గిరికి ఎంతో సంతోషమైంది. కండ్లు మెరిశాయి. "నెలరోజులు నీకు తాతీళ్ళుగద! పోయిన కారు లెక్క మురగశిల కార్తె వరకుంటవు గద? నాకు సదువు జెప్తవా మల్ల?" అని అడిగాడు

నవనీత్ ఎటు వైపో చూస్తూ సరే అన్నట్టు తల ఊపాడు. సాయంత్రం ఎండ కొండ దిగిపోయింది పశువులు ఒక్కొక్కటిగా దక్షిణం వైపు ఊరి చివరి నున్న బావి దిక్కుగా నడక సాగిస్తున్నాయి. మందలో వున్న కోల్లెగ ఒకటి అన్నిటితో కోకుండ తూర్పు దిక్కు ముఖం పెట్టి చెవులు నిక్కించి నాల్గు గజాలు నడిచింది. అది గమనించిన గిరి "ఏయ్. భీమ భీమ . ఎక్కడమ్మా?" అని మందలించాడు. ఆ లేగ టక్కున దిశ మార్చి మందలో కలిసింది అది చూసిన నవనీత్‌కి ఎంతో ఆశ్చర్యం, సంబరం అనిపించింది

"అబ్బ! నీ మాట ఇంటినే ఎంత, భయంరా?" అన్నాడు.

"అవు పటేలా! మొదాలు అది మాట ఇనకపోతుండె శెర్వాకం పన్లు జేస్తుండె. ఒకసారి మంచి ఆయలిబర్గె తీస్కోని సెప్పిన మాట ఇనవా బిడ్డా అని తోక పట్కోని ఊపు మీద వున్నట్టు సరిచిన 'ఇంటవా' 'ఇంటవా' అని తిట్టుకుంట. సగం కంచె బల్ల ఉర్కినా తోక విడువలే. అగో నప్పటి సండి నా మాట ఇంటే గజ్జున ఒణ్కుతది అది శాన మంచిది పటేలా. జెర్ర మెడ కింద దువ్వితే సాలు నన్ను పాణంగా చేస్కుంట నా భుజమంతా నాకుతది

"ఇవిటెకన్నిటికి పేర్లున్నయారా?"

"ఆ అన్నిట్కి పెట్న. ఆ సుక్క పెయ్య లేదు అది లచ్చలు.. దాని పక్కనున్నదేమో లచ్చిమి. ఆ బట్ట కోడె పేరు అర్జున, ముంగట పొయ్యేదాని పేరు అంజన. ఇట్లు అన్నిటికున్నయి, పిలుస్తె పలుకుతయి"

నవనీత్‌కి నవ్వు ఆగలేదు "పిలిస్తే నోరు లేనివెట్ల పల్కుతయిరా! పిచ్చోడ" అన్నాడు.

అవి పలుకుతాయన్న విషయం ఎట్లా అర్థం చేయించాలో గిరికి తెలియలేదు. "అవు పటేలా" అని మాత్రం అన్నాడు. ఇద్దరూ పశువుల వెనకాల నడుస్తూ కొంత దూరం వెళ్ళారు. కంచె దాటి సెలకల నడుమున్న డొంక దగ్గరికి వెళ్ళగానే అక్కడున్న మామిడిచెట్టు నవనీత్ కంటబడ్డది 'అరె మామిడికాయలు' అంటూ అటుగా పరిగెత్తాడు నవనీత్.

చెలక అంచునున్న గెట్టు మీద చిన్న చిన్న పలుగు రాళ్ళు కనిపిస్తే అతి కష్టమ్మీద రెండు చేతుల్లో ఎనిమిది రాళ్ళను తీసుకున్నాడు. చెట్టు కిందికి వెళ్ళి ఒక చోట వాటిని

కుప్పలా ఉంచి ఒక్కొక్కటిగా చెట్టు పైకి విసరసాగాడు ఇదంతా చూస్తున్న గిరి మెల్లగా నవనీత్‌ని చేరి "ఇంకెన్ని రాళ్ళుగొడ్తవు పటేలా చెట్టు మీద చిటారు కొమ దాక చెప్పు. ఏ కాయ గావాలె? నేను కొట్టిస్త. మీ తాత గిట్ల సూస్తెనైతె నువ్వె కొట్టుమన్నట్టు చెప్పాలె మల్ల" అన్నాడు.

నవనీత్ 'సరే' అన్నాడు కాయను చూపిస్తూ.

పశువుల డొంక వెంబడి నేరుగా వెళుతున్నాయి. గిరి ఒకే ఒక చిన్న రాయి తీసుకొని గురి చూసి విసిరాడు. క్షణంలో నవనీత్ చూపించిన కాయ ఠక్కున తెగి క్రింద పడ్డది. నవనీత్ ఎగిరి గంతేశాడు మరో కాయ చూపిస్తే దాన్ని ఒకే దెబ్బతో రాల్చాడు. నమ్మశక్యం కాని గిరి ప్రావీణ్యానికి నవనీత్ విస్తుపోయాడు. మరోటి తన పెద్ద చెల్లికోసమనీ మూడింటిలో రెంటిని జేబులో కుక్కేసి ఒకదాన్ని అట్టే కొరికి తినబోయాడు.

"ఉండు పటేలా దానికి జీడి కారుతుంది. ఆ సొన సెయ్యి మీద పడ్డా, మూతికి అంటినా పుండ్లైతాయి" అని నవనీత్ చేతనున్న కాయ తీసుకొని చెట్టు కాండానికి కాయ నుండి కారుతున్న జీడినంతా తుడ్చి ఇచ్చి పశువుల వైపు చూశాడు. అవి ఇంచుమించు బావి దగ్గరికి చేరుకున్నాయి అవి గాడిలో నీళ్ళు తాగుతుంటే గిరి సన్నని ఈల వేస్తూ 'త్రువ్... చో... చో" అంటూ అన్నిటి ఎడమ డొక్కలు పరీక్షించసాగాడు. చెట్టు గుట్టెంబడి తిరిగి ఏగాకు, జియ్యాకు, జావాకు ఎంత ఇరిసి ఏసినా ఇయ్యాల వాటి కడుపులు నిండలేదని అనుమానపడ్డాడు. అందరి బావుల వద్ద వరిగడ్డి ఐపోయినా పెద్ద పటేలు దగ్గర చాలా వుంది. నీళ్ళు దాపి దొడ్లో కట్టినాక 'ఇయ్యాల రెండు బిగిల గడ్డి ఎక్కువెయ్య'మని తన అయ్యకు చెప్పాలనుకున్నాడు. ఇంతలో ఏదో జ్ఞాపకమొచ్చి 'ఒక్క నిముషంలొస్త'నని నవనీత్‌కి చెప్పి గడ్డివాముల వైపు పరుగు తీశాడు నవనీత్ చూస్తుండగానే ఒక మూలలో మక్కేసిన ఈత పళ్ళు తెచ్చి అతని దోసిలి నిండా పోశాడు తర్వాత పసుల్ని దొడ్లో కట్టి సలగడ పెట్టి వెనక్కి తిరగ్గానే బాయికి పడమటి వైపు వీరభద్రారెడ్డి అల్లునికి టమాట తోట చూపిస్తూ కనిపించాడు.

"అగో మీ నాయిన, పెద్ద పటేలు తోట తిరిగి చూస్తుంద్రు. నా ఎంట నువ్వున్నట్టు సూస్తె నిన్నూ నన్నూ తిడ్తడు మీ నాయన. మెల్లగ ఈ కానుగు చెట్ల ఎన్కకెళ్ళి ఇంటి కురుకు" నవనీత్‌కి చెప్పాడు గిరి.

తండ్రిని చూడగానే నవనీత్ కాళ్ళు గట్టెక్కి ఆగాయి. అదీగాక చేతినిండా ఈతపండ్లు. ఇంకేం గిరి చెప్పినట్లే మెల్లగా దాటుకున్నాడు.

వేసవి సెలవల్లో పట్నం వేడి భరించలేక పిల్లలతో తల్లిగారింటికొచ్చింది వనజమ్మ నవనీత్ తల్లి. భార్యా పిల్లల్ని దిగబెట్టి వెళ్ళడానికి వచ్చాడు వరదా రెడ్డి. సిటీలో వుంటే పిల్లలు బాగుంటారనీ, ఊరికొస్తే పూర్తిగా చెడిపోతారని, భార్య ఏం పట్టించుకోదని అతని భయం. ఊరికొచ్చి కింది కులస్తులతో, పని బాటలోళ్లతో తిరిగి చెడ్డమాటలు, చెడు అలవాట్లు, పోకిరి పనులు, రోగాలు తెచ్చుకోవద్దనీ, క్రమశిక్షణ దాటొద్దనీ పిల్లలకు అతను ఎన్నిసార్లు చెప్పినా వినరు. భార్య 'సరే, జాగ్రత్తగా చూసుకుంటా' అంటుంది కాని అతను

పట్నం వెళ్ళిపోగానే చెప్పినవన్నీ మర్చిపోతుంది. పొద్దాక పిల్లల గోల భరించడం కష్టమని.

ఆరోజు రాత్రి భోజనాలు కాకముందు తల్లి దగ్గరికి పరిగెత్తుకొచ్చాడు నవనీత్. "అమ్మా! గిరిగాడి అయ్య కుందేల్ను పట్టిండట. దాన్ని ఆళ్ళు కోసుక తింటరట అది నాకు గావాలె. సాదుకుంట. దబ్బున ఎవర్నన్న ఆలింటికి తోలిచ్చి తీస్కరమ్మను" ఇంచుమించు ఏడుస్తూనే చెప్పాడు.

తల్లి 'తాత నడుగు'మంది. తండ్రి "చూశావా! అప్పుడే వాడికి ఊరి సంగతులన్నీ తెలిశాయ్. కుందేలూ, కోడీ, కొంక, నక్కా అంటున్నాడు చెట్టు గుట్టలెంబడి తిరిగి చెడిపోకుండా చూడు. మరోసారి చెపుతున్న ఆ జీతగాళ్ళతో అస్సలు తిరగనివ్వకు" అన్నాడు.

నాల్గురోజులు కన్నేసి కుందేలు స్థావరం జాగ్రత్తగా కనిపెట్టాడు అంజయ్య. ఈరోజు సాయంత్రం డొంక మూలకు, అయిలి చెట్ల నడుమ వలకట్టి జోపితే అది లేచి పరిగిడుతూ వలలో చిక్కింది కుందేలు కూర తినక సంవత్సరం దాటింది ఇప్పుడు దీన్ని కోసుకు తిందామని జివ్వ గుంజుతున్నా దాన్ని అమ్మితే ముప్పై రూపాయిలన్నా వస్తాయని మరో దిక్కు అంజయ్య మనస్సు కొట్టుమిట్టాడుతుంది

"కూర లేక సిన్నవొయినారయ్యా! నేనైతే ఒండిపెట్ట. దాన్నెవరికన్నా అమ్మేయ్ పోరగానికి లాగు లేదు" అంటుంది అంజయ్య పెళ్ళాం.

"అమ్మ చెప్పేదీ బాగానే వుంది కానీ 'కుందేలు కూర!' అయ్య చెప్పింది కూడా బాగానే వుంది. కత్తి నూరమన్నడు గదా' అనుకుంటూ సానె మీద కత్తి నూరుతున్నాడు గిరి అప్పుడే పటేలు మరో జీతగాడు నర్సయ్య ఊడిపడి 'కల్లు తాగుమని పటేలు ఐసదు రూపాయలు పంపిండని' అని అంజయ్య చేతిలో పెట్టి గంప కింద దాచిన కుందేలు చెవులు పట్టుకొని తీసుకుని వెళ్ళిపోఆయడు. గిరికి బాధ అనిపించినా వెళ్ళేది తన మిత్రుని ఇంటికే గదా అనుకొని సర్దుకున్నాడు.

మరునాడే పటేలొంట్ల పిట్టగోడ పక్కన పిడుకల గూడు నానుకొని బొమ్మరిల్లు లాగా మట్టిగోడ పెట్టి నిలువెత్తు జాలి చుట్టి దాంట్లో కుందేలునుంచారు దాని ఆలనా పాలనా అంతా గిరి మీద వేశారు. ఉదయం, సాయంత్రం దాని గూడు శుభ్రం చేసి గడ్డి గరకా తెచ్చి వేయాలి. నీళ్ళు పెట్టాలి. నవనీత్‌కి, చెల్లెళ్ళకూ బలే సరదాగా వుంది. వరదారెడ్డి ఉదయం లేచి కుందేల్ని చూసి "మరెక్కడా వెళ్ళకండి. దాన్ని చూస్తూ ఇంట్లోనే ఆడుకోండి" అంటూ "అరే! గిరిగా! బాబును బయట ఎండలో తిప్పితివా ముందు నీ వీపు విమానం మోత మోగిస్త" అని గట్టిగా హెచ్చరించి పట్నం వెళ్ళిపోయాడు.

☆ ☆ ☆

నెల రోజులు గడిచాయి. వరదారెడ్డి హెచ్చరిక గిరికీ, క్రమశిక్షణ పాఠం నవనీత్‌కి పట్టింపే లేక ఇష్టం వచ్చినట్టు తిరిగారు వరిమళ్ల కన్నాల్లో వుండే ఎండ్రకాయలనైనా, గుట్టన పుట్టలోకి పాకుతున్న పామునైనా లెక్కచేయక తేలిగ్గా పట్టి ఆడిస్తాడు గిరి. కోతి

కొమ్మొడితే మిగతా పిల్లలకన్నా చలాకీగా ఆకాశ వీధుల్లో ఆడేస్తాడు. పరుగు పందాల్లో గాలి కన్నా వేగంగా నీళ్లలో దూకితే చేపలకన్నా చమత్కారంగా. . ఇదంతా చూసి గ్రామంలో గిరిని మించిన వీరుడే లేడని నిర్ణయించుకున్నాడు నవనీత్ ఐనా గిరి తన జీతగానితనానికి ఏ మాత్రం భంగం వాటిల్లకుండా పనులు చేస్తూ నవనీత్‌ని ఎంతో సంతోషపర్చాడీ నెలరోజులు.

నవనీత్ ఈత నేర్వాలని తనూ, తండ్రి కలిసి అయిదపు లొట్టిలు తెచ్చి సమంగా కట్టకట్టి అతని వీపుకి నడుం భాగంలో బిగించి కట్టి పెద్ద బావిలో ఈదడం నేర్పించాడు. చేలలో కంచెల్లో ఇరికి పండ్లు, బుడ్డగోసి పండ్లూ మొదలు ఏ పండు దొరికినా తెచ్చి నవనీత్‌కి ఇచ్చాడు గిరి కెక్కర, గువ్వ కంజు, చీమకోడి గుడ్లు ఏవి దొరికినా పెండలోనో, మర్రి ఆకు డొప్పలోనో కాల్చి పెట్టాడు. కుందేలుకు పప్పులు, లేక గరికే కాకుండా మైలు దూరమున్న ఎవరో ఒకరి బావి దగ్గర నుండి వాసన్ గడ్డి దొంగచాటుగా ఎత్తుకొచ్చి దానికేశాడు. కుందేలు బాగా బలిసి నిగనిగలాడుతోంది. ఈ కుందేలు జతకు మరొకటి దొరికితే బాగుండునని ఎంతో ప్రయత్నించాడు కాని దొరకలేదు. నవనీత్ ఒక్కడే కాక అతని చెల్లెళ్ళు కూడా కుందేలు మీద ఎంతో మమకారం పెంచుకున్నారు. ఎప్పుడూ దాని గూర్చే మాట్లాడుకుంటూరు ఎట్లా గుర్తుపట్టాడో కాని అది పొట్టతో వుందనీ, పిల్లలు చేస్తుందని చెప్పాడు గిరి. అప్పటి నుండి కుందేలు పిల్లల్ని చూడాలని, "బుల్లి పిల్లల్ని అది ఎప్పుడు పెడుతుందా" అని ఎదురు చూడసాగారు పిల్లలు. గిరిని ఎన్నో యక్ష ప్రశ్నలడిగారు. అన్నిటికి ఏదో సమాధానం చెప్పడం అతనికి మామూలై పోయింది.

ఇంకా పదిరోజుల్లో స్కూల్స్ ప్రారంభమౌతాయని జూన్ మొదటి వారంలో మృగశిర కార్తి ముందురోజు తిరిగి ఊరికొచ్చాడు వరదారెడ్డి. పిల్లల్ని చూస్తే తాను పెట్టిన కండీషన్స్ ఏవీ పాటించినట్టు లేదనిపించింది. నవనీత్ కొంచెం నల్లబడ్డాడనీ, పలచబడ్డాడనీ తన మనసులో అనుకున్నాడు. ఆ గిరిగాడి స్నేహమే పాడు చేసిందని బాధపడ్డాడు ఎళ్ళుండి పట్నం బయలుదేరుదామనుకున్న నాడు అర్థమైంది పిల్లలు కుందేలుని విడిచేలా లేరని. వాళ్ళు తమతోనే దాన్ని తీసి కెళదామనుకుంటున్నారు. ఎప్పటిలాగే చూడ్డానికి గిరిని కూడా తీసికెళదామంటున్నారు. ఈ కుందేలు పీడ ఎలా వదిలించుకోవాలో అర్థం కాలేదు వరదారెడ్డికి. ఆ రాత్రి దాన్ని తీసి బయట పడేశాడు. అది ఎటు వెళ్ళక ఉదయం వరకూ వరకూ గోడల లోపలే వుంది. కుక్క దాన్ని ఏమీ అనలేదు. గిరి రాగానే చూసి 'అయ్యో బైటికెట్లొచ్చిందీ?' అని లోపలేశాడు. మరునాడు 'దానిని కోయించి తినేస్తే' ఆలోచించాడు వరదారెడ్డి. కాని పిల్లలు ఆ మాంసం తినరనిపించింది. మరో మార్గమని ఒక జీతగాన్ని పిలిచి 'దాన్ని తీసికెళ్ళిపో లేదా చంపి ఎక్కడైనా పారేయ్, కాదంటే ఎవరికైనా అమ్మేయ్' అన్నాడు. ఆ జీతగాడు "ఒద్దు పటేలా పిల్లలేడుస్తరు. నేను తీస్కపోతే యాదగిరిగాడు ఊకోడు. ఈ రాత్రికే నా ఇంటికి నింగలం పెడ్తడు' అన్నాడు.

ఏమైతేనేం మరునాడు తెల్లారేసరికి కుందేలు తన గూడులోనే చచ్చిపడుంది. దాన్ని ముందు చూసింది గిరే. పిల్లలందరూ లేచారు. 'ఎట్లా చచ్చింది? ఏమైందని?" గిరిని

అడిగారు. గిరికి ఏమీ అర్థం కాలేదు కుందేలు కళేబరాన్ని చేతుల్లోకి తీసుకొని ఏమైనా కరిచిందా? అని పరీక్షించాడు. ఏమీ కరిచినట్టు కనిపించలేదు. నవనీత్ ఎంతో బాధపడ్డాడు. చెల్లెళ్ళు ఏడ్చారు

"ముందుదాన్ని తిందామని అనుకున్నవాడు గిరే దాన్ని పట్నం తీసికెళ్లడం వానికే ఇష్టం లేక ఇలా చంపాడు. వాడు కాకుండా మరొకడు దాన్ని చేరే ధైర్యం చేయలేడని" కొన్ని కారణాలు చూపాడు వరదారెడ్డి

నవనీత్ తండ్రి మాటలు విని అనుమానంగా చూశాడు చెల్లెళ్ళూ గిరి దిక్కు చూశారు "నేనెందుకు సంపుతా? నాకు తెల్వదు" అన్నప్పటి గిరి కళ్ళు చెమ్మగిల్లి వున్నాయి. ఏ మాత్రం అతన్ని సందేహించడానికి వాళ్ళ మనసులు ఒప్పలేదు గిరి గుణం పెద్దలకన్నా వాళ్ళకు బాగా తెలుసు ఐతే చంపిందెవరు? ఎవరికీ అంతు చిక్కలేదు.

"ఏంరా? ఇంకా నిలబడ్డావేం? దాన్ని తీసికెళ్ళి ఏం చేస్తావో చేసుకోపో! నడువ్ కళ్ళ ముందు వుండకు" అన్నాడు వరదారరెడ్డి.

గిరి ఏం మాట్లాడక కుందేలు శవంతో బయటికి నడిచాడు.

తిండి కూడా తినక ఆ రోజంతా పశువుల వెనకాల ఏడుస్తూ తిరిగాడు గిరి. సాయంత్రం వరకూ ఎవ్వరితో మాట్లాడలేదు నెలరోజులుగా రోజూ కలిసే తన మిత్రుడు ఈరోజు దూరం నుండైనా అగుపడలేదు. ఎప్పుడూ ఇన్ని రోజులు లేని సహచర్యంతో వాళ్ళ మధ్య 'పటేలు, జీతగాళ్ళ సంబంధం చాలావరకు తగ్గి స్నేహం పొడుకొంటాయని తలిచాడు గిరి. మరి నవనీత్ ఈరోజెందుకు రాలేదో తెలియదు. తను నేరస్తుడు కాడు అతను అనుమాన పడుతున్నాడా? ఏమో చెప్పలేం. "వాళ్ళ నాన్న నా మీద ఇంకా ఏమేమేం చెప్పాడో" అనుకున్నాడు

చీకటి పడింది ఆకాశం నిండా మేఘాలు. ఎంత ఎండలోనైనా తిరుగుతారు, పనులు చేసుకుంటారు జనం. కాని నాల్గు చినుకులు పడుతున్నాయంటే తడుస్తూ తిరగరు. పని చేయరు వాన కుండపోతగా కుమ్మరిస్తే బాగుండుననీ, రేపే విత్తనాలు చల్లుకుందుమని ఎంతో ఆశతో మొగుల్ని చూసి సంతోషిస్తూ రైతులంతా ఇండ్లలోకి, గూళ్ళలోకి వెళ్ళిపోతున్నారు. కోళ్ళ గూళ్ళు సరి చేసి, లేగల పలువులు బిగించి, పశుల దొడ్ల పలగాళ్ళు నెట్టి చూసి, తట్ట పార తాళ్ళు అంబలి గంపలు ఎక్కడివక్కడ బద్ర పరుస్తున్నారు. ఎక్కడో వాన భూమిని ముట్టింది. కమ్మని మట్టి వాసన జమ్మున కొడుతూ చల్లగాలి వీస్తుంది

వీరభద్రారెడ్డి మిద్దె మీద తన వోను పడక పరచి వున్న గదిలోకి దక్షిణం దిక్కున మెట్లు ఎక్కుతున్నాడు అల్లుడు వరదారెడ్డి. పెందలాడే పుష్టిగా భోంచేసి తాంబూలం బిగించి ఉత్సాహంగా ఆరుమెట్లు ఎక్కాడో లేదో గోడ అవతలి నుండి తూటాలాగా రివ్వున దూసుకొచ్చిన రాయి బలంగా తలకు తాకింది. అట్లే తల పట్టుకుని కూలబడిపోయాడు. తల బొల బొల నెత్తురు చిమ్మింది. అరిచిన అరుపుతో అందరూ నిముషంలో పరుగెత్తుకొచ్చారు. కందిళ్ళు, టార్చిలైట్లు, చీకటి నంతా వెలుగు చేసి వెదికాయి. ఆ రాయి

ఎవ్వరు విసిరారో ఎవరికీ అంతుపట్టలేదు. చుట్టుపట్ల ఎవరూ లేరు జీతగాళ్ళు అంజయ్య, నర్సయ్య తదితరులు అక్కడే వున్నారు. కొందరి అనుమానం గిరి మీద వుంది ఈ దెబ్బ గిరి కొట్టిందేనని నవనీత్ నిర్ధారణ చేసుకున్నాడు. అప్పుడే ఎవరితో అనలేదు. గిరి ఇంట్లో వున్నాడా అని ఇద్దరూ వెళ్ళిచూశారు.

"పసులను ఇంకో పోరని తోని కొట్టిచ్చిండు. ఒక ఎద్దు ఆగమైందట ఆడింక ఇంటికే రాలేదు. ఎక్కడెక్కడ తిరుగుతుండో ఏమో. మొగులు అఖండమైంది. ఆనొచ్చేటట్టుంది" అంది తల్లి

ఇది జరిగిన గంట తర్వాత ఆ బంగ్లా ముందు నుండే ఎద్దును గొట్కోని గట్టిగా మందలిస్తూ అందరు చూస్తుండగానే బావి దిక్కుగా వెళ్లాడు గిరి. 'ఇది గిరి చేసిన పనే' అని తాతగారికి చెప్పే ప్రయత్నం చేశాడు నవనీత్. తండ్రి పడుతున్న బాధ చూసి తాత ఆ మాట వినిపించుకోక "ఈ దెబ్బ పిల్లలు కొట్టింది కాదు, ఎవరో పెద్దలే ఈ పనిచేశారు" అని అన్నాడు.

రాత్రికి రాత్రే నాల్గు కిలోమీటర్లు కారును పంపించి మంచి డాక్టరుని తీసుకు వచ్చి మందులూ గాయానికి కుట్లూ, పట్టీ వేయించాడు. ఆ రాత్రంతా వీరభద్రారెడ్డికి నిద్ర లేదు. అవమానంతో కృంగిపోయాడు 'ఈ ఊరికేదో ముసలం పుట్టింది' అని మాత్రం మనసులో అనుకున్నాడు

తెల్లవారింది. నవనీత్‌కి గిరి కనిపించినా పలకరించలేదు. చూసి కూడా చూడనట్టే ప్రవర్తించాడు. ఈరోజే సాయంత్రం అందరూ పట్నం వెళ్ళిపోతున్నారని తెలిసింది. సాయంత్రం వరకు ఎట్లాగైనా ఏదో ఒక పక్షినన్నా పట్టి నవనీత్‌క ఇవ్వాలని, తన స్నేహం మర్చిపోడనీ అనుకున్నాడు గిరి. ఏ చెట్టు మీద ఏ పక్షి వాలుతుందో దేని గూడు ఎక్కడుందో, ఏ వేళ్ళప్పుడు పక్షులు ఎక్కడుంటాయో అన్నీ తెలుసు ఎంతో ప్రయత్నం చేసి నాల్గు చోట్ల ఉర్లు పన్ని ఎలాగైతేనేం మధ్యాహ్నం వరకే పావురాన్ని పట్టుకున్నాడు సాయంత్రం వరకు దాన్ని జాగ్రత్తగా కాపాడాడు.

కారు సిద్ధమైంది. పెద్దలందరూ వనజమ్మ కుటుంబాన్ని సాగనంప వాకిట్లోకి వచ్చారు. ఆవకాయ పచ్చడి కొత్త జాడీలు, పిండి పదార్థాలతో కారు డిక్కీ నిండిపోయింది. రాత్రి తాకిన దెబ్బ నొప్పి ముదిరింది. అప్పటివరకూ పడుకున్న వరదారెడ్డి ఇక మెల్లగా లేచి కారు దగ్గరికి వచ్చి డ్రైవర్ సీట్లో కూర్చున్నాడు. వనజమ్మ, పిల్లలు వెనుక సీట్లలో కూర్చున్నారు. ఇక బయలుదేరే ముందు అందరికీ మళ్ళీ మళ్ళీ 'టాటా' చెప్పి కారు ముందు సీట్లో కూర్చున్నాడు నవనీత్. గిరికి వెళుతున్నానైనా చెప్పలేదు. ఐనా అప్పటివరకు పావురాన్ని ఒక చేత్తో వెనక దాచుకున్న గిరి కారు దగ్గరగా వచ్చి 'ఇగో ఇది నీకే' అంటూ పావురాన్ని అందించాడు.

వరదారెడ్డి గుడ్లురిమి చూస్తూ కొడుకు చేతిలో నుండి పావురాన్ని లాక్కున్నాడు. దాని మెడ పట్టి మూడు చుట్లు తిప్పి బయటికి విసిరి పారేస్తూ 'పో లంజా కొడకా' అన్నాడు కసిగా పిల్లలంతా కళ్ళప్పగించి, ఆశ్చర్యంతో చూశారు. కారు స్టార్టయి వెళ్ళిపోతుంది.

గిరి కండ్లు ఎర్రబడ్డాయి. కోపం బుసలు కొట్టింది తను ఏమీ చేయలేని స్థితి చుట్టూ పెద్దలు, పఠేండ్లు. ఒక్కరూ కిక్కురు మనరైరి. మెల్లగా అడుగులు వేస్తూ నేలపై పడున్న పావురాన్ని చేతుల్లోకి తీసుకొని పరీక్షించసాగాడు. రెక్కలు టపటప కొట్టుకొని చనిపోయిన పావురం మెడ ఎటు వేస్తే అటు వాలిపోతోంది. దాని కళ్ళ రెప్పలు పైకెత్తి చూశాడు. మళ్ళీ మూతలు పడ్డాయి. ఇక గిరి భోరున ఏడ్చాడు. నిమిషంలో దుఃఖాన్ని దిగమింగి లేచి నిలబడి కారు వెళుతున్నవైపు చూస్తూ కసిగా పండ్లు పటపట కొరికాడు.

*1989, ఆంధ్రజ్యోతి దీపావళి ప్రత్యేక సంచిక*

# పాము – కప్ప

**శశికళ**

*"ఈ ప్రపంచంలోని సత్పురుషులంతా అనుక్షణం నిన్ను అణచివేయడానికి, నామరూపాలు లేకుండా చేయటానికి నిరంతరం ప్రయత్నిస్తూనే ఉంటారు. అట్టివారి ప్రయత్నాలు ఫలించకుండా చెయ్యడంలో నీవు నిత్యం జాగరూకత వహించు"*

*– మాక్సిమ్ గోర్కీ*

సైన్స్ టీచర్ గోవిందం మాష్టారు పాపా! అంటూ గట్టిగా పిలుస్తూ లోనికి వచ్చాడు. ఆయనకు 40 ఏళ్ళుంటాయి. కూతురు రజని 10వ తరగతి చదువుతోంది. కొడుకు ఇంటర్ చదువుతున్నాడు. ఏంటి నాన్నా అంటూ వచ్చింది రజని. తండ్రి చేతిలోని సంచి కూతురి చేతిలో పెట్టి స్కూల్‌కు టైమ్ అవుతోందని హడావుడిగా వెళ్ళిపోయాడు. చిన్నీ! అని అమ్మ పిలుస్తూంటే లోనికెళ్లింది రజని. కాసిన్ని మంచినీళ్ళివ్వమా! అని అడిగింది అమ్మ.

రజని నీళ్లందిస్తూ, నాన్న నీకొక్కసారైనా నీళ్ళుగాని, కాఫీగాని తెచ్చిచ్చాడా అమ్మా అని ప్రశ్నించింది రజని తల్లిని. ఆమె మలేరియాతో రెండు వారాల నుండి బాధపడుతోంది. కొద్దిగా ఆయాసంతో తప్పమ్మా అట్లా అనకూడదు. ఆయన చదువుకున్నారు. నాకు భర్త. భర్త చేత అట్లాంటి పనులు చేయించుకోకూడదు! అది సరేగాని నీకన్నీ అనుమానాలే. సరిగ్గా చదువుతున్నావా? అని తల్లి టాపిక్ మార్చేసరికి రజని ముఖంలో రంగులు మారాయి. "ఈ పాడు జ్వరం నన్నిట్లా పీడించకపోతే నీవు హాయిగా చదువుకుండేదానివే, చిన్నీ నీవు బాగా చదవాలని నా కోరిక. నాకెటూ అక్షరం ముక్క రాలేదు" ఆమె కళ్ళలో ఏదో వెలుగు.

రజని మౌనంగా అక్కడినుండి వచ్చేసింది. పనులు చేసుకుంటూనే రాత్రి చదివిన సోషల్ గుర్తు చేసుకుందామని ప్రయత్నించింది రజని. కానీ ఒక్కటీ గుర్తు రాలేదు. భారత రాజ్యాంగంలోనివి కొన్ని నేర్చుకుంది . అయితే ఆమె ఆలోచనలు ఎటో తిరుగుతున్నాయి.వ

నాన్నకు అన్నిరోజులు జ్వరం వస్తే అమ్మ అస్సలు ఆయన బెడ్ దిగకుండానే సేవలు చేసింది మరి అమ్మ బాగాలేక అన్నిరోజులు బెడ్లో ఉంటే కనీసం ఏదైనా ఆమెకు అందిస్తామనుకోడే నాన్న. డాక్టరు దగ్గరికి తీసికెళ్ళమంటే, "నెలాఖరు, నాకు తెలీదా నీవు చెప్పేదానివా" అంటూ నామీద ఒకటే విసుగు

ఇంకా ఏమైనా చెప్పాలి అంటే, నీవు నోరుమూసుకొని ఇంట్లో కూర్చోమంటే స్కూల్కెళ్ళి ఇదా నువు నేర్చుకొంది అని ఒకటే తిట్టడం

మెదడులో ఇలా ఆలోచనలు తొలుస్తూంటే రజని ప్రొద్దున టిఫిన్ చేసిన పాత్రలు, ఎంగిలి కంచాలు అన్నీ కడుగుతూంది శేఖర్ చిన్నకంటే రెండేండ్లు పెద్ద 10వ తరగతి ఒక పేపరు తప్పి ఈమధ్యనే పాసయితే, తండ్రి ప్రయివేట్ కాలేజీలో డొనేషన్ కట్టి బి పి.సి. గ్రూపులో చేర్పించాడు తండ్రి కాలేజీలో చేరినప్పటినుండి శేఖర్ అలవాట్లే మారిపోయాయి గోవిందం మాస్టారుకు కొడుకు డాక్టరవ్వాలని పెద్ద ఆశ

చిన్ని కాలేజీకి టైమ్ అవుతోంది టిఫిన్ పెట్టు త్వరగా అంటూ హడావుడి పెట్టేశాడు రజనీని రజని చేయి కడుక్కుంటూ వచ్చి టిఫిన్ పెట్టింది. తొందరగా తిని గబగబా చేయి కడిగేశాడు. వెనుకకు తిరిగి చూడకుండా వెళ్ళిపోయాడు. తర్వాత రజని వీడి పనే మేలు అనుకుంది.

అమ్మకు జ్వరం తొందరగా తగ్గితే బావుణ్ణు, ఇన్నిన్ని పనులతో ఏం సరిగా చదవలేకపోతున్నా అమ్మకు గంజి కాచి ఇచ్చింది

తర్వాత వంట మొదలుపెట్టేసరికి కమల వచ్చింది కమల వాళ్ళ తండ్రి ఇంజనీర్. దగ్గర్లోనే కమలా వాళ్ళ ఇల్లు. కమల అక్కకు ఈమధ్య పెళ్ళి అయింది. యూనివర్శిటీలో ఎం.ఏ. చదివింది కమల వాళ్ళ అక్క. తమ్ముడు మనోహర్ ఇంగ్లీషు మీడియం స్కూల్లో 4వ క్లాస్ చదువుతున్నాడు. కమలకు చదువంటే ఇష్టం ఉండదు వాళ్ళ నాన్న భయంతోనే బుక్ ముట్టుకుంటుంది, అంతే.

"రజనీ మీ అమ్మగారికి జ్వరం తగ్గిందా" అడిగింది కమల. "లేదు కమలా రా కూర్చో, సైన్స్ చదివేశావా?" రజని ప్రశ్న. "ఎక్కడా? బుక్ ముట్టుకుంటేకదా! అమ్మ అరిచినపుడంతా తెలుగే, ఆ తెలుగులో ఏం కథలులేవు. లేకుంటే ఆ తెలుగు అయినా అయిపోయేదే?" అంది కమల. రజని మనసులో "ఓసి దీని కథలపిచ్చి పాడుగాను" అనుకుంటూ పైకి "మనిద్దరం కలిసి లెక్కలు చేసుకుందామా" అడిగింది రజని.
"అలాగే ఇప్పుడే ఒక్క నిమిషంలో ఇంటికెళ్ళి వస్తాను. ఈలోపల నీ పని పూర్తిచేయి" అంటూనే ఇంటికి పరిగెత్తింది కమల

కమల బుక్స్తోపాటు దాచుకుంటూ ఏదో తెచ్చింది. "రజనీ! ఇంకా పని అయిపోలేదా, నేనిక్కడే హాల్లో కూర్చుని చదువుకుంటూ ఉంటాను తొందరగా వచ్చేయ్" అంటూనే తీరిగ్గా కూర్చుని ఒక బుక్ తీసి చదవటం మొదలుపెట్టింది కమల.

రజని వంట పూర్తి చేసేసరికి 12 గంటలు అవుతోంది. బుక్ తీసుకొని కమల దగ్గరికి వచ్చేసరికి ఎదులోనో లీనమై తీవ్రంగా చదువుతూ తనలోతనే నవ్వుకొంటోంది

కమల. ఏంటి కమలా పరీక్షలు దగ్గర్లో పెట్టుకొని ఈ నవల ఎందుకు చదువుతున్నావు? అడిగింది రజని. మా అమ్మ ఈరోజు సాయంత్రమే ఈ నవల వాపసు ఇచ్చేస్తుంది. అందుకే ఇప్పుడే వస్తాను, నీవు చదువుతూండు, అంది కమల. కమల బుక్స్ తీసేసరికి రజని సైన్స్ చదువుతూ కన్పించింది ఎప్పుడూ సైన్స్ చదువుతూ ఉంటావు. మిగతా సబ్జెక్ట్స్ చదవవా? అడిగింది కమల.

నాకు సైన్స్అంటే ఎంతో ఇష్టమైన సబ్జెక్టు. డాక్టరవ్వాలని నాకు కోరిక అంది రజని.

తర్వాత కాసేపు చదువుకొని కమల వెళ్ళిపోయింది రజని నాన్నగారు రావడంతో. భోజనం ముగించి హాల్లో పేపరు చదువుకుంటూ కూర్చున్నాడు తండ్రి. రజని తల్లీ దగ్గరికి గంజి తీసుకొని వెళ్తూ తండ్రిని చూసింది. అమ్మ ఎంత సన్నగా అయిపోయిందో, ఎంత నీరసంతో వాలిపోతోందో, ఈయనకు కొద్దిగా కూడా దిగులు లేదు అనుకుంది మనసులో.

గబగబా పనులు ముగించి మళ్ళీ చదువుకుందామని కూర్చుంది రజని మళ్ళీ ఆలోచనలు చుట్టుముట్టాయి రజనిని. తనని అసలే చదువుకోవద్దనే తండ్రి ఇక మంచి మార్కులు రాకుంటేనా? అమ్మో! భయంతో రజని గుండె గబగబా కొట్టుకుంది. తనకు 7వ తరగతిలో ఫస్టుమార్కులు వచ్చాయి. కమల ఒక్క అక్షరం పేపర్లో వ్రాయకపోయినా పాసయింది. వాళ్ళమ్మ, నాన్న గొప్పగా చెప్పుకొన్నారు. కాని మా నాన్న కనీసం చిరునవ్వు కూడా లేదు. ఒక్క మాట లేదు. ఈసారి టెన్త్‌లో ఎట్లా ఉంటుందో తన పరిస్థితి.

ఆరోజు సాయంత్రం నాన్న తన స్నేహితులతో కలిసి ఇంటికి వచ్చాడు. వస్తూనే చిన్నీ ఏదైనా టిఫిన్ చేసి, కాఫీ తీసుకురా గట్టిగా కేకపెట్టాడు.

రాజు, వేణు గోవిందం మాస్టారి స్నేహితులు. అయ్యయ్యో ఇప్పుడెందుకండీ అమ్మాయికి శ్రమ. పరీక్షలు కూడా దగ్గరకొస్తున్నాయి – చదువుకొంటోంది కదా అన్నారు ఒకేసారి.

కనీసం వేరేవాళ్ళకున్న సానుభూతి కూడా తండ్రికి లేదు అని మనసులోనే తిట్టుకుంది రజని. అదెంతసేపు, తొందరగా చేస్తుంది. మా పాప వంట ఎంత చక్కగా చేస్తుందని, పనులన్నీ చిన్నప్పటి నుండీ నేర్చుకొంది. ఒక్కతే అయినా గారాబం చేయలా, అవతల పెళ్ళి అయ్యాక మమ్మల్ని తిట్టుకోకుండా అని బిడ్డను గూర్చి గర్వంగా ఫీలయ్యాడా కన్నతండ్రి. మీ ఆవిడ ఆరోగ్యం బాగా లేదన్నావుగా వెళ్ళి ఆమెను పలకరిద్దాం అంటూ లేచి లోనికి వచ్చారు రాజు, వేణు.

"ఏమ్మా ఎలా ఉంది మీకిప్పుడు ఆరోగ్యం" అని అడిగారు. రజని తల్లి సర్దుకుంటూ కూర్చోవటానికి ప్రయత్నిస్తూ, రోజూ రాత్రి తీవ్రంగా వచ్చి పగలు తగ్గుతోంది, తగ్గటంలేదు అంది.

రజని తండ్రి "ఏం లక్ష్మి టాబ్లెట్స్ వేసుకోవటంలా, తగ్గిపోయేది కదా ఈపాటికి" అన్నాడు తన సంస్కారాన్ని సందేహంతో మిళితం చేస్తూ.

ఇంతలో రజని కాఫీ టిఫిన్ తేవటంతో వేరే కబుర్లలో పడిపోయారు.

☆ ☆ ☆

ఆ మరుసటి రోజు ఆదివారం. రాత్రి బాగా వర్షం పడటంతో కప్పలు అరుస్తూనే ఉన్నాయి రజని ఇంట్లో కరెంటు పోయింది రజనికి ఎంతో బాధ కల్గింది. ఆరోజంతా అలా చదువుకోకుండా గడిచిపోయినందుకు.

పొద్దున్నే తండ్రి కాఫీకోసం ఎదురు చూస్తున్నాడు నాన్నా అని మెల్లగా పిలిచింది తండ్రికి కాఫీ అందిస్తూ. ఏమిటి అన్నట్లు చూశాడు తండ్రి. నాన్నా ఈపూట శేఖర్‌ను పనులు చూసుకోమని చెప్పండి నేను చదువుకుంటాను ఇంట్లోనే ఉన్నాడు కదా చదువుకోలేదు, క్రికెట్‌కు పోలేదు నేను చెప్తే నామీద పోట్లాడుతున్నాడు" – రజని.

ఆ. . . అదేదో వినకూడని, నేరమైన విషయమన్నట్టు ముఖం పెట్టి, ఒసేవ్ లక్ష్మి చూడే నీ కూతురి ఘనకార్యం, చదువు అప్పుడే మాన్పిద్దాం అంటే విన్నావు కాదు, నేనూ వాడూ వంట చెయ్యాలట. అదేమో చదివి వూళ్ళేలుతుందంట. పైన అతి మాటలు కూడా నేర్చింది. ఆడదాన్ని ఎంతట్లోపెట్టాలో అంతట్లో పెట్టకపోతే – ఇలా సాగుతోంది ఆయన మాటల ధోరణి.

రజనికి అసహ్యమన్పించింది. వంటరూంలోకి వెళ్ళి దుఃఖం తీరేవరకు ఏడ్చింది. మనసులో ఒక అస్పష్టమైన నిర్ణయం మెదిలింది.

కలత నిద్రలో రజని కలవరిస్తోంది.... చాలా కప్పలున్న చెఱువులో పాము ఇష్టం వచ్చినట్టు కప్పలను వేటాడుతోంది. అరే, నాకు కప్ప రూపం వచ్చిందే! అయితే ఏదో ఒకటి చెయ్యాల్సిందే, గట్టుమీదకెళ్ళి గట్టిగా అరుస్తున్నా

*ఉపాధ్యాయ, 1988*